





# నాణ్యత మరియు ధర
# యొక్క
# లెక్క ప్రకారం

చెక్ డిటర్జంట్ కేక్ నమ్మకమైన ధర, అన్ని
బట్టలకు భద్రత నిచ్చేది అదే [illegible] మరియు [illegible] బట్టలకు
ధర రూ. 2/- (అన్ని పన్నులతో సహా)

మీరే చెక్ చెయ్యండి!

షా వల్లేస్ వారి
ఒక క్వాలిటీ ఉత్పత్తి

AOIL/SWCPD/3-87/TEL

# న్యూఢిల్లీ లేఖ

డా.జయ్ దుబాషి



ఫేబియన్ల మద్య పడి నటువంటి మంచి మనిషిగా బెర్నార్డ్‌షాను అభివర్ణిస్తూ ఉండడం జరిగేది విశ్వనాథ ప్రతాప్‌సింగ్‌ను కూడా అదే విదంగా నిజాయితీ పరుడైన వ్యక్తిగా అబివర్ణించవచ్చును. కాని ఎవరి మధ్య పడి పోయాడని అనాలి? రాజా సాహెబ్ మిత్రులనూ, శత్రువులనూ కూడా పదేపదే మార్చేస్తున్నారు. ఎంత వేగంగా ఈ మార్పులు జరుగుతున్నాయంటే ఒకానొక ప్రత్యేక క్షణంలో ఆయన మిత్రులెవరో చెప్పడం అసాద్యమైనటువంటి విషయం. ఆయన తనకు సన్నిహిత మిత్రులెవరూ లేరని, కేవలం సహజమైనటు వంటి స్నేహితులు మాత్రమే వున్నారని అనవచ్చును. కాని దానివల్ల ఆయన సాదించగలిగినదేమీ ఉండదు. నిజానికి అధికార పక్షంతో తన సంబంధాలను తెంచివేసుకున్న ఆరు నెలల తర్వాత సింగ్ అంతకు ముందు ఎక్కడ ఉన్నారో అక్కడే ఉన్నారు. ఆయన స్నేహితులు కూడా సహజమైనటువంటి వాళ్ళయినా కాకపోయినా అంతకు ముందు ఎక్కడ ఉన్నారో అక్కడే ఉన్నారు

విశ్వనాద ప్రతాప్‌సింగ్ ప్రస్తుతం అనేక మంది ప్రతిపక్ష నాయకులలో ఒకానొకరు మాత్రమే. ఆరునెలల క్రితం పరిస్థితి అదికాదు. ఆయన సబలకు హాజరయ్యేవారు పలచబడ్డారు. ఒకప్పుడు ఆయనను ఆదరించడానికి పరిమితులు దాటి ప్రవర్తించిన వార్తా పత్రికలలో ఇప్పుడు ఆయనకు దొరుకుతున్న చోటూ తగ్గిపోయింది. ఆయన ఉపన్యాసాలు కూడా చర్విత చర్వణంగా, ఊహించదగినవిగా ఉంటున్నాయి. బహుగుణ, చంద్రశేఖర్‌ల ఉపన్యాసాలు, ప్రకటనలకంటే అవి పెద్దగా బిన్నంగాఏమీ ఉండడం లేదు. వాళ్ళ ఉపన్యాసాలు ప్రతిపక్షనాయకు లందరిలోకీ సులబంగా ఊహించ దగినవీ, అందువల్ల విసుగెత్తించేవీను. సింగ్ కూడా క్రమక్రమంగా విసుగు కలిగిస్తున్నారు. ఐతే ఇతరులకన్నా బిన్నంగా ఆయన తన భూమికను ఎప్పటికప్పుడు మారుస్తున్నారనుకోండి.

ఆయన గురించి ప్రధానంగా చెప్పుకోవలసిన విషయమేమంటే ఆయన తన మౌలిక ఆసక్తుల నుంచి ఎంత దూరం ప్రయాణం చేసి వచ్చారనేదే. షామ్లీలో ఆయన ఇటీవల చేసిన ఉపన్యాసంలో బోఫోర్స్ ప్రస్తావనయినా తేలేదు. బహుశా దానిగురించి హఠాత్తుగా అలసట వచ్చిందేమో. ఆయన అక్కడ లంచగొండి తనాన్ని కూడా ఒక సమస్యగా ప్రస్తావించలేదు. బహుశా ఆయనను మిగతా నాయకుల నుంచి వేరు చేసి ఉంచినది ఆ ఒక్క విషయమే. అవినీతి గురించి బహుగుణ మాట్లాడడం ఒక అపహాస్యం. ఆ సంగతి ఆయనకు తెలుసు. అవినీతి గురించి చంద్రశేఖర్ మాట్లాడడం కూడా అపహాస్యమే. అది ఆయనకు తెలుసు. కాని అవినీతి గురించి విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ మాట్లాడడమనేది నిజంగా వేరయిన విషయం. అందువల్లనే ఆయన వినదగిన మనిషిగా ఉన్నారు. కాని. ఏవో వివరించని కారణాలతో, సింగ్ తన ఉద్యమాన్ని మధ్యే మార్గంలో వదిలేసి తన ప్రధాన పాత్ర నుంచి దూరంగా వెళ్ళిపోయాడు. ఎందుకలా చేశారు? కమ్యూనిస్టులు తమ మద్దతుకోసం ఆయననుంచి కోరిన మూల్యం అదేనా? లేదా తాను కొత్తగా నిర్మించుకోదలచుకున్న అనుచరవర్గంలో ఈ సమస్య పెద్దగా ఆదరణీయం కాదని ఆయన కనిపెట్టారా?

## పక్కదారి పడుతున్న వి.పి.సింగ్



రెండింటిలో ఏది కారణమయినా ఆయనది తప్పే. ఆయన నిజంగా వామ పక్షవాదు లకి లొంగిపోయి ఉంటే, వాళ్ళ మద్దతు కోసం ఆయన చాలా ఎక్కువ మూల్యం చెల్లిస్తున్నారనాలి ఒకవేళ అవినీతి ఇక ఎంత మాత్రమూ సమస్య కాదంటే రాజీవ్‌గాంధీ కూడా ఇక ఎంత మాత్రమూ సమస్య కారు పాలకపక్షం దాని నాయకత్వం పైనుంచి కింది దాకా అవినీతిమయమై పోయిందన్నవాస్తవాన్ని అలా ఉంచి, పాలక పక్షంతో ప్రతిపక్షాలకు తీవ్రమైన విభేదాలున్నాయి విశ్వనాద ప్రతాప్ సింగ్‌కు ఎప్పుడూ ఈ విబేదాలు లేవు ఆయన రాజీవ్‌గాంధీ ప్రభుత్వంలో రెండో నెంబర్ మనిషిగా ఉండేవారు తన శక్తివంతమయిన మంత్రిత్వ పదవిలో ఎంతో కొంత స్వతంత్రంగా ఉండేవారు నాకు తెలిసినంత వరకు, ఇప్పటికీ ఆయనకు ఆర్థిక విదానం గురించి తన మాజీ అదినేతతో విబేదమేమీ లేదు ఇక అవినీతి కూడా ప్రదాన సమస్య కానట్టయితే సింగ్ పోరాడుతున్నది దేని కోసం? గోదుమలకి కిలోకి మూడు రూపాయలు గిట్టుబాటు దర అవుతుందా మూడు రూపాయల ఇరవై పైసలు గిట్టుబాటు దర అవుతుందా అనే సమస్య ప్రదాన సమస్య అవుతుందా ఏమిటి?

విశ్వనాద ప్రతాప్‌సింగ్ దేని కోసం పోరాడుతున్నారో ఆయనకు నిజంగా తెలియదేమోనని నాకు అనుమానం కలుగుతోంది ఈ దేశం పాలించబడుతున్న లేదా పాలించబడిన పద్ధతిలో ఏదో లోపం ఉన్నదని ఆయనకు అస్పష్టంగా తెలుసు కాని ఆ లోపమేమిటో తెలియదు దేశపు కడగండ్లకు తన పార్టీయే కారణమని నిందించ లేనంతటి కాంగ్రెసువాది ఆయన. ఆ కడగండ్లకు బాద్యత జవహర్‌లాల్ నెహ్రూ పైనో ఆయన కూతురు పైనో పెట్టడం వి ఎ సింగ్ కలలో కూడా ఊహించలేరు ఆయన జీవితమంతా వాళ్ళిద్దరికీ విదేయుడుగా ఉన్నారు ఇప్పుడు దేశాన్ని ఒక గందరగోళంగా తయారు చేస ఇటువంటి హీనస్థితికి తెచ్చిన కుహనా నాయకులను తాను అనుసరిస్తూ ఉన్నానని ఆయన ఒప్పుకోలేరు గదా. తన పదవికీ పార్టీ సభ్యత్వానికీ రాజీనామా చేసేటప్పుడు ఆయన ఒకే ఒక మాట స్పష్టం చేశారు ఆయన మాటల్లోనే చెప్పాలంటే తాను కాంగ్రెసు సైనికుణ్ణని కాంగ్రెసు త్రివర్ణ పతాకాన్ని ఎత్తి పట్టుకుని పురోగమిస్తానని ఆయన అన్నారు ఇప్పుడు ఆయన తనే స్వయంగా ఒకత్రివర్ణ పతాకాన్ని తయారు చేసుకున్నారు దాని మధ్యలో

ఒక పెద్ద సున్న ఉంటుంది అది మంచి ప్రతీక. కాని ఆయన ఒక తప్పుడు సంగీతానికి కవాతు చేస్తున్నారు తాము ఎందుకు కవాతు చేస్తున్నామో తెలియని వారందరూ అలాగే చేస్తారు

రాజీవ్‌గాంధీ అవినీపరుడయితే ఆయన రాత్రికి రాత్రే అలా తయారు కాలేదని విశ్వనాథ ప్రతాపసింగ్ గుర్తించాలి అవినీతి ఒక రకమైనటువంటి సంస్కృతి ఆ సంస్కృతి క్రమబద్ధంగా ఏళ్ళ తరబడిగా నెహ్రూ ఇందిరాగాంధీలు పాలించిన ఏళ్ళ నుంచి కూడా నిర్మించబడుతూ వస్తున్నది. భారత రాజకీయ • వ్యవస్థలోకి నెహ్రూ, ఇందిరాగాంధీలు ప్రవేశపెట్టిన వికృత ధోరణులను తొలగించకుండా ఈ సంస్కృతిని తొలగించడం అసాధ్యం నెహ్రూ లంచాలు తీసుకోకపోయి ఉండవచ్చు కాని ఆయన స్నేహితులు తీసుకున్నారు వాళ్ళు తమ జేబులు నింపుకుంటున్నప్పుడు నెహ్రూ చూసీ చూడనట్టు వదిలేశారు కాని వాళ్ళు ప్రవేశ పెట్టిన వికృత ధోరణులు అంతటితో అయిపోలేదు సోషలిజం పేరు మీద నెహ్రూ ఒక పెట్టుబడిదారి రాజ్యం తయారు కావడానికి తోడ్పడ్డారు అక్కడ రాజకీయ, ఆర్థిక అధికారాలన్నీ తన వాళ్ళయినటువంటి వాళ్ళ కొందరి చేతుల్లో కేంద్రీకరించబడ్డాయి. ఆయన కుమార్తె రాజ్యాన్ని తన స్వంత కుటుంబ వ్యక్తిగత



ప్రయోజనాల కోసం వినియోగించుకున్నది. అవి ఎంత వ్యక్తిగత మయినటువంటి వంటే రాజ్యం ఒక్క కుటుంబ సంపదతో సమానం చెయ్యబడింది. విధే యుడైన సుపుత్రుడు అక్కడ్నించి ప్రారంభించి, విశ్వనాథ ప్రతాప్‌సింగ్ వంటి వ్యక్తుల సాయంతోనే ముందుకు కదిలాడు. పాతుకుపోయిన పాలక కుటుంబాన్ని వ్యతిరేకించకుండా ఆ మాటకు గల అన్ని అర్థాలలోనూ వ్యతిరేకించకుండా ఈ అన్ని వ్యవహారాలకు నిజమైన వ్యతిరేకత అనేది ఉండదు విశ్వనాథ ప్రతాప్ సింగ్ అటువంటి పనికి సిద్ధపడక పోతే, రాజకీయాలకు స్వస్తి చెప్పి తన జమీందారీకి వెళ్ళిపోవడం మంచిది ఆయన ఆ పని చేస్తామని తరచుగా బెదిరిస్తున్నారు కూడా

కమ్యూనిస్టులు ఇందిరాగాందీని ఆమె స్థానం నుంచి తొలగించడానికి సిద్ధంగా లేనట్లే ఇప్పుడు కూడా రాజీవ్‌గాంధీని ఈ రాజకీయ సింహాసనం నుంచి తొలగించడానికి సిద్ధంగా లేరు ఈ వంశ పాలనకు తిలోదకాలు వదలడానికి మాస్కో ఇంకా సిద్ధపడలేదు. కనుక మాస్కో సిద్ధపడనన్నాళ్ళు రణదివేలు, నంబూద్రిపాద్‌లు కూడా సిద్ధపడరు కనుక విశ్వనాథ ప్రతాప్ సింగ్ ఏం చేస్తారు? ఆయన తమ వైఖరి మార్చుకొని రైతులకు గిట్టుబాటు ధరల గురించి కార్మికులకు అధికార భాగస్వామ్యం గురించి, అటువంటి తక్కువ ప్రాముఖ్యం గల సమస్యల గురించి మాట్లాడతారు కాని ఆ సమస్యలపై శరద్‌జోషి వంటి చిన్న స్థాయి నాయకులు పోరాడగలరు విశ్వనాథ ప్రతాపసింగ్ మిత్రులు ఆయనను దేశ రాజకీయ రంగంలో సన్నని ఇరుకు సందులలోకి నెడుతున్నారు అట్లా తాను పక్క దారి పడుతున్నానని ఆయన గుర్తించక పోవడం విచారించవలసిన విషయం □

## చిన్నారి నూతన తార చిట్టి మేధావి.

# బజాజ్ కాంపాక్ట్ వాషింగ్ మెషీన్. సన్నగా ఉన్నా సామర్థ్యం గలది. చిట్టి మేధావిగా వర్ణిస్తే సార్థకమవుతుంది.




కాంపాక్ట్ మీకిచ్చే సదుపాయాలేవో ఒకసారి చూసుకోండి.

**సింగిల్ బటన్ కంట్రోల్:**
ఆధునికమైన CMOS సర్క్యూట్రీ కారణంగా, ఉతికే, నీళ్లలో పిండే పనుల సమయాలను, ఆయా రకాల బట్టలకు తగినట్టుగా 1 నుంచి 4 నిముషాల మధ్య సెట్ చేసుకోవచ్చు. దీనివల్ల పాత రకం టైమర్లతో పని తీరిపోయిందన్నమాట.

**రేపటి రోజుల పోకడగల రూపం:**
సాటిలేని చక్కదనంతో తయారై వచ్చిన చిన్నారి వాషింగ్ మెషీన్ కాంపాక్ట్. ఇది చాలా తక్కువ స్థలం తీసుకుంటుంది. పైగా, చక్రాల సహాయంతో సులభంగా, మీరు కోరిన చోటికి వచ్చినిలుస్తుంది.

**LED డిస్ప్లే:**
ఎలెక్ట్రికల్ సెట్టింగును సూచిస్తుంది. ఆడియో సిగ్నల్ కూడా వినిపిస్తుంది. ఉతికే పని పూర్తవగానే అలారం మోగుతుంది.

**రివర్సిబుల్ వాషర్:**
మరింత శుభ్రంగా ఉతకడానికై, తిప్పి తిప్పి ఉతికే వసతి నిస్తుంది.

**దిట్టమైనది:**
కాంపాక్ట్ బాడీ సొగసైన, దృఢమైన ఫైబర్ గ్లాసుతో తయారైనది. దీని లోపలి తొట్టి తుప్పు పట్టని స్టెయిన్‌లెస్ స్టీలుతో తయారైనది.

**లోనికి చూడ వీలయ్యే అక్రిలిక్ మూత:**
ఉతికే పని గమనించే వసతినిస్తుంది.

**ఉతకడంలో గొప్ప సామర్థ్యం:**
ఇంత ఇమిడికైనదైనా ఇది వంతు వంతుగా ఎన్నో బట్టలు ఉతక గలదు. 1 చీర, 2 షర్టులు, 1 జీన్స్ పాంటు, 1 దుప్పటి, 5 చిన్న బట్టలు ఒకేసారి వేసినా హాయిగా ఉతికేస్తుంది.

**బ్యాక్-అప్ స్విచ్:**
మీ కాంపాక్ట్‌లోని ఎలెక్ట్రానిక్ ప్యానెలుకు రిపేర్ల అవసర మంటూ వస్తే కూడా మీ వాషింగ్ మెషీన్‌ను నిశ్చింతగా వాడుకోవచ్చు. ఆ ప్యానెల్‌ను తీసి రిపేరుకు పంపించి, బ్యాక్-అప్ స్విచ్ వేసుకుని మెషీన్ నడపొచ్చు.

సన్నదనంలో సొగసుదనం. ఆదాతనంలో లాభసాటితనం. చక్కదనంలో చురుకుదనం. ఇల్లాళ్లకు నిజంగా వరదానం. అదన్నమాట బజాజ్ కాంపాక్ట్. ఒకసారి చూడండి, మీరే ఒప్పుకుంటారు.



**bajaj COMPACT**

బజాజ్ కాంపాక్ట్ వాషింగ్ మెషీన్.

LINTAS BE P 1 2720 TL




## చూడడానికి చిట్టిదైనా బుర్ర గట్టిది, పని గొప్పది.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938 1972)

27 నవంబరు 3 డిసెంబరు 87

శ్రీ ప్రభవ నామ సం మార్గశిర శు సప్తమి

సంపుటము 80 సంచిక 14

ముఖ్య సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక(యాక్టింగ్) సంపాదకుడు
మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు 80 60 |
| పోస్టులో 12నెలల చందా | రు 161 20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం విజయవాడ 520 003


## విషయానుక్రమణిక






## ముఖచిత్రం

'కిమ్‌రోమ్మి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక నూతన గెటప్‌తో ఎంతో సుందరంగా వుంది ఈవారం ఆంధ్రపత్రికను చూసి నా మనస్సు పులకించి పోయింది నిజం ఇది నా అభిమాన పత్రికగదా! అనే భావం నన్ను ఆనందపరవశుణ్ని చేసింది కార్టూన్‌లు కడుపుబ్బ నవ్వించాయి

—మోదేకుర్తి సత్యనారాయణ అన్నవరం

## సీరియల్స్

కిమ్‌రోమ్మి ముఖచిత్రంతో చాలా ఆకర్షణీయంగా వుంది వడ్లమన్నాటి కుటుంబరావు గారి ఈతరం యువతి మమల్ని అలరిస్తూంది

—కళ్యాణం వెంకటసుబ్బారావు ఏలూరు

★ ★ ★

ఈతరం యువతి సీరియల్ మంచి రసవంతముగా సాగుతున్నది

—బి రఘునాథ్ బి వి రమణ రాయగడ

★ ★ ★

స్వర్గీయ డా దాశరథిగారన్నట్లు— విశ్వనాథ విజయగాథ అదో గొప్ప కావ్యం అది నవ్యం అతి భవ్యం అతని కవిత కడుదివ్యం ఇది నిజం! యధార్థం! వాస్తవం! మనల్ని కవిసమ్రాట్ వీడినప్పటికీ వాడని ఆయన వేయి పడగల్ని సీరియల్ పడగలుగా అందిస్తున్నందుకు కృతజ్ఞతలు విశ్వనాథ పావని శాస్త్రి గారు ఆ సీరియల్ మధ్య భాగంలో చక్కని విషయాల్ని తెలియ చేస్తున్నారు

—పి బాలాన్నపూర్ణ పి లక్ష్మీ ప్రభావతి
రాజమండ్రి

★ ★ ★

రావినూతల సువర్ణాకన్నన్ గారి మంజీరనాదం సీరియల్ చాల బాగుంది రసన్ చందన లాంటి ప్రేమికులు నిజజీవితాలలో ఎందరో వున్నారు ధైర్యవంతులు తల్లితండ్రులతో పోరుబడి లవ్‌మ్యారేజ్ చేసుకొని ('చేరువవుతున్నారు పిరికి వాళ్ళు తల్లిదండ్రులకు భయపడి ప్రేమకు స్వస్తి చెప్తున్నారు ఇప్పుడు రసన్ చందనలు ఈ రెండు రకాలలో ఏరకానికి చెందిన వాళ్ళో చాల సస్పెన్స్‌గా వుంది

—చలపాక ప్రకాష్ విజయవాడ

★ ★ ★

డి యస్ పి విజయ్ రేపటి మహిళ సీరియల్స్ మమ్మల్ని ఎంతో ఆకట్టుకొంటున్నాయి

—చిత్రాడ విజయకుమార్ సోంపేట

★ ★ ★

డి యస్ పి విజయ్ పై పలువురి అభిప్రాయాలు భావున్నాయి వేయి పడగలు ఆదినుండి ఇప్పటి దాకా అలరిస్తోంది

—చో డవరపు నాగేశ్వరరావు రమాదేవి
లక్ష్మీశశాంక హైదరాబాదు

★ ★ ★

మంజీరనాదం ఈతరం యువతి సీరియల్స్ చాలా బావుంటున్నాయి ఇంద్రాణి ఎ కుంచనపల్లి

## కథలు

కిమ్‌రోమ్మి' ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చదివి కొత్త పాఠకురాలుగా పరిచయం అవుతున్నాను కార్టూనులు ఫీచర్లు చాల బాగున్నాయి ముఖ్యంగా ఉడుకురక్తం కథ నన్నెంతో ఆకట్టుకుంది

—యస్ డి కె సుల్తానా చింతకాని(ఖమ్మం)


( 16 వ పేజీ చూడండి)

# పదవినుంచి పార్టీనుంచి శ్రీనివాసులురెడ్డి బహిష్కరణ



తెలుగుదేశం ప్రభుత్వంలో పైలట్ – కో పైలట్ వివాదం మరోసారి చెలరేగింది తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడిగా ముఖ్యమంత్రిగా ద్విపాత్రాభినయం చేస్తున్నశ్రీ ఎన్ టి రామారావు తె దే ప్రభుత్వంలో నెంబర్ టుగా అనుకుంటున్న రెవెన్యూమంత్రి నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డికి ఉద్వాసన చెప్పారు

శ్రీ ఎన్ టి రామారావు భేదాభిప్రాయాన్ని సహించలేరని తీవ్రమైన అసహనం ప్రదర్శిస్తారని తెలుగుదేశం పార్టీలో అంతర్గత ప్రజాస్వామ్యం కరువైపోయిందని ముఖ్యమంత్రికి బంధుప్రీతి కుటుంబ లాభాపేక్ష విపరీతంగా ఉన్నాయని గతంలో వెలికి వచ్చిన ఆరోపణలను శ్రీనివాసులు రెడ్డి ఉదంతం బలపరుస్తున్నది ఐతే వివాదంలో ఇరుపక్షాలూ అనుమానాస్పదంగానే ఉన్నాయి వివాదం సాగిన ఆరువారాల కాలంలో శ్రీనివాసులు రెడ్డి చేసిన పరస్పర విరుద్ధ ప్రకటనలు తెలుగుదేశం పాలనా కాలమంతటిలోనూ ఆయన ప్రదర్శించిన రాజును మించిన రాజభక్తి ఆయన మాటలకు పూర్తి విశ్వసనీయతను ఇవ్వడం లేదు

ముఖ్యమంత్రిని తెలుగుదేశం ప్రభుత్వ విధానాలను చివరికి ముఖ్యమంత్రి కుటుంబ సభ్యులను వెనకేసుకురావడానికి శ్రీనివాసులురెడ్డి మిగిలిన అందరికంటే ఎక్కువ దూకుడుగా ప్రవర్తించారు ఆ పనిలో భాగంగా ఆయన ప్రతిపక్షాలను అధికార వర్గాన్ని న్యాయస్థానాలను తీవ్రంగా దూషించారు ఇలా విరుచుకు పడడంలో ఆయన చివరికి కనీస గౌరవ మర్యాదలను కూడా వదిలి గవర్నర్ నివాసంపై తీవ్రమైన పద జాలంతో విమర్శలు గుప్పించారు ఈ రకంగా పలుకు బడిని పెంచుకొన్న శ్రీనివాసులు రెడ్డి సీనియర్ మంత్రిగా తమ పదవికి ఎసరు పెట్టే ప్రమాదం ఉన్నదని ముఖ్యమంత్రి అనుమానించడం ప్రారంభించారు అప్పటి నుంచి మంత్రి వర్గంలో పార్టీలో రెడ్డి ప్రాధాన్యతను తగ్గించే ప్రయత్నాలు మొదలయ్యాయి దీనితో శ్రీనివాసులు రెడ్డి కూడా ప్రభుత్వ విధానాలపై స్వల్పంగా విమర్శలు ప్రారంభించారు వివిధ వర్గాల ప్రజల పట్ల ప్రభుత్వం కక్షసాధింపు ధోరణి అనుసరిస్తున్నదని. ఈ ధోరణి అనుచితమని ముఖ్యమంత్రికి రెడ్డి లేఖ రాశారు. ఈ లోగా ఆయనకూ, ముఖ్యమంత్రి అల్లుడు చంద్రబాబు నాయుడుకూ మధ్య విభేదాలు తలెత్తాయి ఈ పరిణామాలు ఇలా జరుగుతుండగానే శ్రీనివాసులు రెడ్డి రాష్ట్ర వ్యాప్తంగ ప్రజా విజ్ఞప్తుల దినాలు నిర్వహించడం ప్రారంభించారు ప్రజలలో పలుకు బడి పెంచుకుని దాన్ని రాజకీయ స్వప్రయోజనాలకు వాడుకునేందుకు మాత్రమే ఆయన ఈ ప్రజానందస్సులను ఏర్పాటు చేస్తున్నారని భావించిన అధిష్ఠాన వర్గం ఆయనకు సహకరించ వద్దని అధికారులను ఆదేశించింది ఈ లోగానే శ్రీ శ్రీనివాసులు రెడ్డి స్వస్థలమైన నెల్లూరు జిల్లా లో క్రాంతిపథం పథకం అమలులో అవకతవకలు జరిగాయంటూ విచారణ ప్రారంభమైంది మరో వైపున శ్రీనివాసులు రెడ్డి సోదరుణ్ణి సన్నిహిత సహచరుణ్ణి పార్టీలో నుంచి తొలగించారు

ఆపైన శ్రీ శ్రీనివాసులు రెడ్డి పూర్తిగా లొంగిపోయి ముఖ్యమంత్రిని శరణు వేడుకున్నారు తనకు ముఖ్యమంత్రి పదవిపై ఆశ లేదని శ్రీ ఎన్ టి రామారావు జాతీయస్థాయి రాజకీయాలలోకి వెళ్తే ముఖ్యమంత్రిగా శ్రీ నందమూరి బాలకృష్ణను గాని శ్రీ చంద్రబాబు నాయుడిని గాని ప్రతిపాదిస్తానని కూడా ప్రకటించారు తమ నాయకుని పట్ల తమకు అపారమైన గౌరవం ఉన్నదని నాయకుని కోసం తాను ప్రాణత్యాగమైనా చేస్తానని శ్రీనివాసులు రెడ్డి అన్నారు

ఇది ఇలా ఉండగానే శ్రీ శ్రీనివాసులు రెడ్డికి అవమానకరమైన సంఘటనలు కొన్ని జరిగాయి నెల్లూరు జిల్లాలో ఆయన భార్యపై అసభ్యకరమైన కరపత్రాలు వెలువడ్డాయి రెవెన్యూమంత్రిగా ఆయన హోదాను కించ పరిచే ప్రభుత్వ నిర్ణయాలను ముఖ్యమంత్రి తీసుకున్నారు ఆయనపై హైకోర్టులో నడుస్తున్న కేసులో వాదించడానికి న్యాయవాదిని నియమించడంలో ప్రభుత్వం అలసత్వం చేసింది

ఈ అన్ని కారణాలతో రెచ్చిపోయిన శ్రీ శ్రీనివాసులు రెడ్డి ఇక ముందు ఏమి కానున్నాసరే అన్నట్టు చంద్రబాబు నాయుడు పై ధ్వజమెత్తారు దీనితో సహజంగానే ముఖ్యమంత్రి ఆగ్రహోదగ్రులయ్యారు శ్రీ శ్రీనివాసులు రెడ్డి రాజకీయ మరణం అనివార్యంగా జరిగిపోయింది

నవంబర్ 12 సాయంత్రం నెల్లూరు వెళ్ళేందుకు హైదరాబాదు నుంచి బయల్దేరిన శ్రీ శ్రీనివాసులు రెడ్డికి కాశీపేటలో తనను మంత్రివర్గం నుంచి తొలగించిన వార్త తెలిసింది వెంటనే ప్రయాణం రద్దు చేసుకుని రాజధానికి తిరిగి వచ్చిన శ్రీనివాసులు రెడ్డి ఆ రాత్రే పత్రికా సమావేశంలో తాను అంతకు ముందు దేవుడిగా అభివర్ణించిన వ్యక్తిని వెయ్యి మంది హిట్లర్లతో పోల్చారు తర్వాత ప్రతి రోజూ ఆయన చేస్తున్న ప్రకటనలు అంతకు ముందు చేసిన ప్రకటనలకు పూర్తిగా భిన్నంగా ఉన్నాయి శ్రీ చంద్రబాబు నాయుడు సంపాదించిన కోట్లాది రూపాయల ధనం గురించి ముఖ్యమంత్రి పాల్పడిన అవినీతి చర్యల గురించి శ్రీనివాసులు రెడ్డి ఇప్పుడు ప్రశ్నల మీద ప్రశ్నలు గుప్పిస్తున్నారు

కేంద్ర రాజకీయాలలో వి పి సింగ్ – రాజీవ్ గాంధీల మధ్య జరిగినదే ఇప్పుడు రాష్ట్ర రాజకీయాలలో పునః ప్రదర్శిత మవుతున్నది శ్రీనివాసులు రెడ్డి వి పి సింగ్‌ను మరపించేలా వ్యవహరిస్తున్నారు వి పి సింగ్ చేసిన ఆరోపణల కన్న తీవ్రమైన ఆరోపణలను తీవ్రమైన పదజాలంతో శ్రీనివాసులు రెడ్డి చేస్తున్నారు నిజానిజాలని కాలమే నిర్ణయిస్తుంది (ఒ వి)

# ఫారెక్స్®
# తల్లుల మొదటి ఎంపిక!

## తన పాపాయికి ప్రేమతో తినిపించి పెంచే ప్రతి తల్లికీ తెలుసు: పాపాయి పెరుగుదలకై ఘన ఆహారాలను ప్రారంభించేటపుడు మొట్టమొదటి ఎంపిక ఇదే-ఫారెక్స్®.

ఎందుకంటే, మేలుపర్చబడిన ఫారెక్స్‌లో ముద్దుల పాపాయి పెరుగుదలకై అవసరమైన పోషణ పదార్థాలు సరియైన పాళ్లలో కలవు

- ఫారెక్స్‌లో పాపాయి పెరుగుదలకు అవసరమైనట్లు సరియైన పరిమాణంలో ప్రొటీన్లు సున్నిత జీర్ణశక్తికి అనువుగా క్రొవ్వు పదారాలు కలవు
- పుట్టిన నాలుగు నెలలకు, పాపాయికి తల్లి నుండి లభించిన ఐరన్ నిల్వ తగ్గిపోతుంది పాపాయి రక్త-పుష్టికై ఫారెక్స్‌లో తగినంత ఐరన్ కలదు
- దృఢమైన ఎముకలు, గట్టి పళ్లకోసం ఫారెక్స్‌లో పాపాయి పెరుగుదలకు ఉత్తమ 2 1 నిష్పత్తిలో కాల్షియం, ఫాస్ఫరస్ కలవు
- ఫారెక్స్‌లో పాపాయి బాగా ఇష్టపడి తినే రుచి కలదు
- దీనిని కలపడం, తినిపించడం సులభం




పాలు చేర్చే అవసరం లేదు. కేవలం నీళ్లలో కలిపి ఇస్తే చాలు

**ఫారెక్స్®-శ్రేష్ఠమైన ఘన ఆహారం**
**తల్లి ప్రేమకు ప్రతిబింబం**

CLARION/B/GX/15/244/TEL

# సీరియల్

# ఈతరం యువతి

## వడ్లమన్నాటి కుటుంబరావు



(గత సంచిక తరువాయి)

"ఫ్రెండ్స్! అలా నా మొదటి పెళ్ళి సంబంధం మూలువాసంలో తప్పిపోయిందోచ్" అంది ముగించిన మృదుల ఆమె ముఖంలో అదోరకం నిర్లిప్తత చోటుచేసుకుంది

ప్చ్ అంది సుశీల

ఎటీ అంది కమల

షేర్ బాడ్‌లక్ నిట్టూర్చింది నిర్మల

మీకు బోర్ కొడుతున్నానా? అంది మృదుల నెమ్మదిగా

లేదే కొత్త విషయాలు వింటున్నాము అడిగిన కట్నం ఇవ్వలేకో లాంచనాల దగ్గర పేచీ వచ్చో పెళ్ళిసంబందాలు పెయిలవుతూవుంటాయి శ్రీమంతుల గారాలపట్టివి నీకు ఈ చిన్నవిషయాల వల్ల సంబంధం తప్పిపోయిందని వింటే చాలా బాదగా వుందే ఇలాంటివి కూడా జరుగుతుంటాయని ఆశ్చర్యంగాకూడా వుందే! అంది నిర్మల చేత్తో నుదురుకొట్టుకుంటూ

నమ్మశక్యం కాకుండా వుందే అంది సుశీల

అవునన్నట్టుగా తలూపింది కమల

ఈసారి వినండి ఇంకెంత గమ్మత్తుగా వుంటుందో మీకే తెలుస్తుంది అంటూ మొదలుపెట్టింది

శ్రోతలు ఏకాగ్రతతో వింటున్నారు

వారం తిరక్కుండానే మరో సంబంధం వచ్చింది బ్రైడ్ గ్రూం డాక్టర్ ఎం డి సొంతంగా ప్రాక్టీసుపెట్టాడు గుంటూరులో తండ్రి పలుకుబడివల్ల పేషెంట్లపట్ల అతని శ్రద్ధవల్ల ప్రాక్టీసు అతికొద్దికాలంలోనే పుంజుకుంది మూడు రోగాలు ఆరు ఫీజులుగా వుందిట సుదర్శనం అన్నయ్యకి తెలిసిన ఫ్రెండ్‌కి వరుడు – ఫ్రెండట అలా వచ్చిందీ సంబంధం కట్నం లాంచనాలు వగైరాలు ముందే మాట్లాడుకోవటం జరిగింది పెళ్ళిచూపుల తతంగం మామూలుగానే ఘనంగానే ఏర్పాటుచేశారు మర్యాదల పలకరింపులు ఆప్యాయతల చిలకరింపులు కాఫీ టిపిన్లు కూల్‌డ్రింకుల సేవనాలు అన్నీ అయింతర్వాత పెళ్ళికూతుర్ని తీసుకురమ్మన్నారు వాళ్ళు వదిన లక్ష్మీరాణి నన్ను ఎక్కడ కందిపోతానో అన్నట్టుగా నడిపించుకొచ్చి కూర్చోపెట్టింది

మొదటిసారంత బయంగా లేదీసారి నాకు అయినా తల దించుకునే కూర్చున్నాను

వరుని తరపువారు ఏవేవో రొటీన్ ప్రశ్నలడిగారు

తొట్రుపడకుండా నిబ్బరంగానే సమాదానం చెప్పాను

మధ్యలో కళ్ళెత్తి పెళ్ళికొడుకుని చూశాను అతనప్పుడు టీపాయ్‌మీద పెట్టిన వక్కపొడి బరిణవేపు చూస్తున్నాడు యదాలాపంగా మొట్టమొదటిసారి వచ్చిన తనంత ఎర్రగా లేకపోయినా యితనుకూడా బాగానేవున్నాడు ఆ ముఖంలో ఏదో ప్రత్యేకమయిన ఆకర్షణ కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది

అనుకోకుండా నా మనసు ఓ కె చేసిందతన్ని మళ్ళీ మామూలుగా తల దించుకుని కూర్చున్నాను

పెళ్ళికొడుకు తల్లి మరి ఇతర ఆడవాళ్ళూ నేను లేచివచ్చిన తరవాత నా గదిలోకి రావటం మాట్లాడటం పళ్ళిచ్చి బొట్టుపెట్టటం ఇలాంటివన్నీ కూడా నిముషాలమీద జరిగిపోయాయి

మీ నిర్ణయంకోసం ఎదురు చూస్తుంటాం అన్నారు డాడీ పెండ్లి కుమారుని తల్లిదండ్రులతో వినయంగా

చిరునవ్వు నవ్వి రెండు మూడు రోజుల్లోనే తెలియపరుస్తాం అని వెళ్ళిపోయారువాళ్ళు

డాడీ వెంటనే మినీ సమావేశం ఏర్పాటుచేశారు మా అందరితో

వాళ్ళకు మృదుల నచ్చినట్టు వాళ్ళ ముఖకవళికలే చెపుతున్నాయి అందుకని మీ అందరి అభిప్రాయాలు ముందుగానే తీసుకోదలిచాను ఏం బార్యామణీ! ఈసారి కూడా నీ మహిళామండలి సభ్యురాలు నీకు ఏదో చెప్పి ఈ సంబంధం తప్పించదుకద?! ఎందుకయినా మంచిది ఈ సంబంధం కుదిరి లగ్నపత్రిక రాసేంతవరకూ నువ్వింట్లోనేవుండు అన్నారు డాడీ మమ్మీని ఆటపట్టిస్తూ

పోదురూ మరీ బడాయి ఈసారి మీరు , అబ్బాయి అన్నీ పకడ్బందీగానే ఏర్పాటుచేశారుగదా కుర్రాడుకూడా చక్కగావున్నాడు పైగా బోలెడంత అస్థి! ప్రాక్టీసు! నాకేం అభ్యంతరంలేదు

థాంక్‌గాడ్! శ్రీమతి రుక్మిణీదేవిగారి రాజముద్ర సారీ రాణీ ముద్ర లభించేసింది సభ్యులారా! వరసగా మీ అందరి అభిప్రాయాలు వివరించండి స్వీకరిస్తాం చాలా హుషారుగా వున్నారు డాడీ కూతురికి మంచి పెళ్ళిసంబంధం కుదురుతోందంటే ఏ తండ్రికిమాత్రం సంతోషంగావుండదు?

జరిగిన కథ – 6 రవికాంత్‌కు మృదులకు మధ్య అనుబంధం ఏర్పడుతుంది మృదులకు ఆడతనం లేదని దుష్ప్రచారం జరుగుతుంటుంది ఆ ప్రచారాన్ని ఎదుర్కొనేందుకు మృదుల మిత్రులు ఆలోచనలు చేస్తుంటారు ఆ ఆలోచనల్లో భాగంగా మృదులకు జరిగిన పెళ్ళి చూపుల వివరాలు కనుక్కుంటారు మొదటి సంబంధం తల్లి వల్ల తప్పిపోయిందని తెలుసుకుంటారు

ఈ మాచ్ తెచ్చింది నేనేకాబట్టి నా అంగీకారం సెంట్‌పర్‌సెంట్ అన్నాడు పెద్దన్నయ్య సుదర్శనం

అన్నయ్యకే నా ఓటు ఈ పెళ్ళికి వుండదు ఎలాంటిలోటు స్మార్ట్‌గా బలపరచాడు రాజేంద్రన్నయ్య

మీ పెద్దబ్బాయిగారు ఈ సంబంధం చూశారు గనుక నేను సాక్షాత్తూ వారి దర్మపత్నిని గనుక భర్తమాట భార్యమాట ఒకటేగనుక ఈడూ జోడూ ఆస్తి అంతస్తూ అన్నీ సరిపోయాయిగనుక నే నీ సంబంధానికి మనస్పూర్తిగా ఒప్పుకుంటున్నాను.... సంతోషమేకదా. అత్తయ్యగారూ? అంది మా వదిన లక్ష్మీరాణి

కోడలికేసి ప్రసన్నంగా చూశారు మా డడీ పెద్దదిక్కులు ఏమంటాయ్యో ' ముందుగా .... అమ్మా నువ్వుచెప్పు." అన్నారు

నాకుమాత్రం అభ్యంతరం ఏముంటుంది నాయనా? లక్షణమైన సంబంధం తీసుకొచ్చాడు నా పెద్దమనవడు. తక్షణం దీని నెత్తిమీద అక్షింతలు వేసేద్దాం దీనిపెళ్ళిచేసి అంటూ నాతల నిమిరింది నాయనమ్మ. '

అమ్మా! అత్తయ్యగారికిపోటీగా నువ్వుకూడా చెప్పవే మా మమ్మీ వాళ్ళమ్మ నుద్దేశించి అంది

శుభస్య శ్రీఘ్రం అంది అమ్మమ్మ నా బుగ్గలు పుణుకుతూ

అలా అందరి అంగీకారం లభించింది ఓ కే అయిన తర్వాత ఈ శుభవార్తని పెద్దక్కా బావలకు ఫోన్‌చేద్దామనుకున్నారు

అప్పుడేమయిందంటే ఒక్కక్షణం ఆగింది మృదుల

చంపకేబాబూ! ఏమయిందో త్వరగా చెప్పు ఆతృతగా అడిగింది కమల

ఎం జరిగిందే? ఆరాటపడిపడిపోయింది సుశీల



## ఈతరం యువతి

మగపెళ్ళివారి దగ్గరనుంచి వెగెటివ్‌గా ఫోన్‌వచ్చివుంటుంది అంతే కదూ' అంది నిర్మల

ఇంకా గొంతు సవరించుకుంటూనేవుంది మృదుల

ఒసేయ్! చెపుతావా? నీ పీకపిసకమంటావా? తొందరపెట్టింది నిర్మల

మర్నాడు మగపెళ్ళివారిదగ్గరనుంచి ఫోను వచ్చినమాట నిజం

దట్సిట్ అంది నిర్మల గర్వంగా

కానీ నువ్వనుకున్నట్టుకాదు!

ఏమని ?

అమ్మాయి కుందనపు బొమ్మలావుంది ఆనందంగా ఒప్పుకుంటున్నాం అని

ఇంటిల్లపాదీ సంతోషంలో మునిగిపోయారు

నేను మధురూహలలో తేలిపోయాను పెళ్ళి మంత్రాలు బ జాలు తెల్లటి మదుపర్కాలు వీటినెంతో తియ్యగా ఊహించుకున్నాను కానీ విదినెవ్వరు తప్పించగలరు?

ఏం జరిగిందే మళ్ళీ? నిరాశగా అంది కమల

ఆ సాయంత్రం వస్తూనే డాడీ సోఫాలో కూలబడిపోయారు

ఎవరితోనూ ఏమీ మాట్లాడలేదు

ఆయన ముఖమంతా జేవురించివుంది

నౌకరు కాఫీ తెచ్చియిస్తే కప్పు విసిరికొట్టారు

బూట్లు విప్పలేదు

డ్రస్ మార్చుకోలేదు

బాత్‌రూంకెళ్ళి కాళ్ళు చేతులు ముఖం వాష్‌చేసుకోలేదు

ఆయనతో మాట్లాడటానికి అందరికీ బయంగావుంది

ఎవరితోనన్నా ఘర్షణపడ్డారో లేక బిజనెస్‌లో ఏమన్నా నష్టం వచ్చిందో లేక ఇన్‌కంటాక్స్‌వాళ్ళు ఏమన్నా యిబ్బందిపెడుతున్నారో కారణమేమిటో ఎవరికీ తెలియలేదు

కాసేపాగి మెల్లగా ధైర్యంచేసి అమ్మ వచ్చి నాన్నగారి సోఫాలో కూర్చుంది

ఎమండీ! ఏమిటలావున్నారు?

ఆరోగ్యం బాగాలేదా? డాక్టరుకి ఫోన్‌చెయ్యమంటారా?

విషయం చెప్పండి లేకపోతే ఎలా తెలుస్తుంది?




చెప్పయా?

రుక్కూ!

ఏమండీ? అంటూ ఆశగా చూసింది అమ్మ

నీ మహిళామండలి పని ఎమన్నావుంటే చూసుకో అనవసరంగా నన్ను విసిగించకు వెళ్ళు!

ఎదో చెపుతారని ఊహించిన మమ్మి నీరుగారిపోయింది మేమంతా కూడా నిరాశపడిపోయాం చిన్నబుచ్చుకున్న ముఖంతో లేలివెళ్ళిపోయింది మమ్మీ

ఒరే అబ్బాయ్! నవ్వుతూ అందర్నీ నవ్విస్తుండేవాడివి నీకేమయిందిరా ఇవ్వాళ ఏం జరిగిందో చెప్పరా? అంది నాయనమ్మ బతిమాలుతూ

అమ్మా అంటూ గట్టిగా ఒక్క కసురుకసురారు దాంతో బిక్కచచ్చిపోయిన నాయనమ్మ ఒక్కుదుటన వంటింట్లోకి జారుకుంది

నాయనమ్మకు లబించిన సమాదానం చూసి అమ్మమ్మ అడిగే ప్రయత్నమేచెయ్యలేదు

ఆలోచించి ఆలోచించి పెద్దన్నయ్య సుదర్శనం మెల్లగా దగ్గరికి జేరాడు

డాడ్ అన్నాడు బయంగా

అయామ్ క్వయిట్ డిస్టర్బ్‌డ్ అండ్ పెర్టర్బ్‌డ్ మై బోయ్! నీరసంగా అన్నారు డాడీ

అన్నయ్య యిక నోరెత్తలేకపోయాడు

కొన్నిక్షణాలతరవాత మా వదిన లక్ష్మీరాణి బెరుకుగా అంది మామయ్యాగారూ!

ఓ అరగంటాగి నీ చేత్తో స్వయంగా కాఫి పట్రామ్మా అన్నారు డాడీ ఆమె చెప్పేది వినకుండా

మా వదిన ముఖం పాలిపోయింది

డాడీ అన్నాడు రాజేంద్రన్నయ్య పదినిముషాలు ఓపికపట్టు

రాజా నీ పీకపిసికేస్తా విసిగించావంటే అన్నారు కోపంగా

ఏమయివుంటుందే? అంది సుశీల నిర్మల నుద్దేశించి

ఆఁ! ఎముంది ఆ తరువాత పెళ్ళికొడుకు సకలగుణాబిరాముడని తెలిసివుంటుంది మందు మగువపొందు ఈ రెండే అతని లోకమని తలిసి అప్‌సెట్ అయివుంటారు మృదుల డాడీ అవునటే? తేల్చిపారేసింది నిర్మల

కాదు అంది మృదుల

మరేమిటి?

చెపుతున్నా విను

ఉన్నట్టుండి అమ్మా మృదులా అంటూ గావుకేకపెట్టారు డాడీ

ఆ కేక బిల్డింగంతా ప్రతిధ్వనించింది

ఎం జరిగిందోనని హడావుడిగా పరుగెత్తుకొచ్చారు కుటుంబ సభ్యులే కాక నౌకర్లు చాకర్లుకూడా

ఏమిటి డాడీ అలా కేకపెట్టారు? మా కందరికీ ఎంత కంగారుగావుందో తెలుసా? అసలు విషయం ఏమిటి? అన్నాను నేను బయంగా

నీ ఒక్కదానికే చెపుతా నమ్మా కొంప మునిగిందమ్మా!

చెప్పండి డాడీ చాలా టెన్షన్‌లో పెట్టేశారుమీరు మా అందర్నీ అన్నాను ఇంకా బయం బయంగానే

నీకు తెలుసుగాబేబీ! నాకు కొన్ని సెంటిమెంట్లున్నాయని అందులో మొట్టమొదటిది అస్ట్రాలజీ అందుకనే మన కుటుంబసభ్యుల రాశి చక్రాలన్నీ నా పాకెట్ నోట్‌బుక్‌లో వుంచుకుంటాననే సంగతి మీకు తెలియింది కాదు సాయంత్రం గాందీనగర్‌లోవున్న ప్రముఖ జ్యోతిష్యుడు పరశురామ సిద్ధాంతి యింటికివెళ్ళి కలిసి నీ జాతకచక్రం చూపించాను వరుని పేరు జాతకం తండ్రి పేరు వగైరాలు చెప్పాను అంతా సుఖాంతమే అవుతుందను

కున్నాను కానీ ఆ సిద్ధాంతి ఏం చెప్పాడో తెలుసా?

ఏం చెప్పాడు డాడీ?

ఈ సంబంధం కనక కుదుర్చుకుంటే పెళ్ళిపీటలమీద పెళ్ళికుమార్తె కుప్పకూలిపోతుందట అమ్మా! మృదులా ! అంటూ మళ్ళీ బాధగా అరిచారు డాడీ!

ఏమిటి డాడీ? అన్నాను

అప్పటికే నాలో నీరసం ఆవరించేసింది ఇది కూడా ఫెయిల్యూరేనన్నమాట!

నువ్వు పుట్టిన తరవాతేనమ్మా అప్పటివరకూ సేల్స్‌మెన్‌గా వున్న నా దశ తిరిగింది ఇప్పుడు నాతోపాటు వీళ్ళందరూ ఇంద్రభోగాలనుభవిస్తున్నారంటే అదంతా నీ చలవేనమ్మా! అందుకననేనమ్మా నువ్వంటే నాకు ఎంతో ప్రేమ నిన్నిన్నాళ్ళు గారాబుపట్టిలా పెంచి అందాలబొమ్మగా తయారుచేస అల్లారుముద్దుగా చూసుకుంటూ చూస్తూ చూస్తూ చేజేతులా మృత్యువు కౌగిలికి అప్పగించలేనమ్మా అందుకనే ఎంతమంచిదయినప్పటికీ ఈ సంబంధాన్ని కేన్సిల్ చేస్తున్నాను నీ కన్న తండ్రిగా యింటికి యజమానిగా నన్నందరూ క్షమించండి చేతులు జోడించి దీనంగా అన్నారు డాడీ

నౌకర్లందరినీ వెళ్ళి వాళ్ళవాళ్ళపనులని చూసుకోమని ఆధిలించి పంపించింది మమ్మీ

డాడ్

డాడ్ ఈ శతాబ్దంలో ఈ మోడ్రన్ ఏజ్‌లో కూడా ఈ మూఢనమ్మకాలేమిటి? ఆ సిద్ధాంతి ఏ పెళ్ళాం తిట్టిన మూడ్‌లో నో మీ కీ గాస్‌కొట్టాడు అతను చెప్పినది నిజమని నమ్మకమేమిటి? చక్కటి మాచ్ మూఢనమ్మకాల ఆధారంగా సిస్టర్ బంగారు భవిష్యత్తుని బలిచేయకండి డాడీ యిది నా పర్సనల్ రిక్వెస్టు అన్నాడు సుదర్శనం అన్నయ్య బతిమాలుతున్నట్టుగా

అబ్బాయ్ అన్నారు డాడీ తీక్షణంగా

చెప్పమన్నట్టు చూశాడు అన్నయ్య

జాతకం పాతకాలపు మూఢనమ్మకం కాదురా ఈ నాడు దీన్ని సైంటిఫిక్‌గా చెపుతున్నారు పేరుపొందిన కొన్ని నగరాల్లో అస్ట్రలాజికల్ ఇన్‌స్టిస్యూట్‌లే వున్నయ్ తెలుసా? వాటిని నడిపేది మహామేధావులైన ప్రొఫెసర్లన్న సంగతి విస్మరించబోకు మనిషి జీవితంమీద ప్లానెట్ల ప్రభావం గ్యారంటీగా వుంటుందనేది చాలామంది ఒప్పుకునే నిజం పంచాంగాలలో

చంద్రగ్రహణం ఎప్పుడు సూర్యగ్రహణం ఎప్పుడు సెకన్లుకూడా తేడా లేకుండా తేడా రాకుండా జ్యోతిష్యులు సిద్ధాంతులు రాయిగలుగుతున్నారంటే జ్యోతిష్యశాస్త్రం ఖగోళశాస్త్రం లాంటివి వున్నట్టా లేనట్టా?

ఆపండి మీ ఉపన్యాసం కోపంగా అడ్డుకుంది అమ్మ ఎవడో గన్నయ్య ఏదో చెప్పాడని దాని జీవితాన్ని చేజేతులారా నాశనం చేస్తారా? అంది కటువుగా

నువ్ నోరు మూస్తావా? అంటూ కసిరారు డాడీ అమ్మని

మయ్యను ఎందుకు ముయ్యాలి? అంది అమ్మ రెట్టిస్తూ అవతల నా కూతురి బ్రతుకుబండలయిపోతుంటే

అయితే మీరంతా నేనడిగే ఒక్క ప్రశ్నకి సమాధానమివ్వండి గంభీరంగా అన్నారు డాడీ

అందరి కళ్ళూ డాడీపైనే కేంద్రీకరించివున్నయ్

మృదుల మై బేబీ నాప్రాణం నా చిట్టి చిన్నారి డార్లింగ్ పెళ్ళి పెళ్ళిపీటలమీద, హఠాత్తుగా చచ్చిపోవాలని కోరుకునే పిశాచాలు.. దెయ్యాలు రాక్షసులు ఎవరన్నావుంటే చెయ్యొత్తండి అలాగే దాని పెళ్ళి ఈ సంబంధంతో నే జరిపిస్తాను ఈ మాట అనేప్పుడు డాడీ కంఠం గద్గదమైంది, వణికిపోయింది బొంగురుపోయింది దాదాపు ఏడుపు స్వరంలోకి మారిపోయింది.

# ఈతరం యువతి

అంతే దాంతో అంతా అవాక్కయిపోయారు ఎమ్మైనా చెప్పాలని మనసులో వున్నా పెదాలు కట్టేసుకున్నారందరూ

ఇక అక్కడుండలేక అంతా కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోయారు

డాడీ నన్నమాంతం దగ్గరకు తీసుకుని శిరసుమీద మూర్కుంటూ అన్నారు

మృదూ బేబీ? మైసోల్ ! నీ పెళ్ళికోసం నీ ప్రాణాల్ని రిస్కు చెయ్యలేనమ్మా పార్డన్‌మీ బేబీ పార్డన్‌మీ ! ఆయన కళ్ళనుంచి రెండు కన్నీటి బిందువులు వేడిగా నా తలమీద పడ్డాయి

కుంగిన మనసుతో భారంగా అడుగులేసుకుంటూ వెళ్ళి బెడ్‌మీద వాలిపోయాను

ఆ రాత్రంతా ఎంత వెక్కివెక్కి ఏడ్చానో నాకే తెలియదు

నాతో పాటు ఇంటిల్లపాదీ డల్ గా అయిపోయారు

రెండుమూడు రోజులు మా యిల్లు మూగవేదనకి నిలయమయ్యింది

ఆ తరవాతగానీ మామూలుస్థితికి చేరుకోలేదెవరూ

* * * * *

మృదులకేసి చూశారు స్నేహితురాళ్ళు ముగ్గురూ

ఆమెతో పాటు అందరి గుండెలూ బరువెక్కిపోయినయ్

ఏం కామెంట్ చెయ్యాలో ఏం మాట్లాడాలో తెలియనిస్థితిలో వుండిపోయారు

వాతావరణాన్ని తేలికపరిచేస్తూ మృదులే అంది సారీ ఫ్రెండ్స్! నాకు జరిగిన ఒక్కొక్క పెళ్ళిచూపుల గురించి యింతవివరంగా చెప్పుకుంటూపోతే మనకిక్కడే తెల్లవారిపోతుంది మన తల్లిదండ్రులు కంగారుపడుతూ కార్లలో లారీల్లో విమానాల్లో వచ్చేస్తారు

అచ్చుతప్పే గాంధీకొండమీద యింకా విమానాశ్రయం నిర్మించలేదు అంది కమల తనేదో కొత్తగా కనిపెట్టినట్టుగా

పిచ్చిమొహమా! దిగులుగా పెట్టిన మన షేక్స్పియర్ ముఖాల్ని చూసి జోక్ కోసం అందే ఆమాత్రం గ్రహించలేవూ? అంటూ మెత్తగా వడ్డించింది నిర్మల

సుశీలా అంది మృదుల

ఏమిటే?

"అదిగో ఆ గళ్ళచొక్కా కాకీ నిక్కరు కుర్రాడు – ఏదో అరుస్తున్నట్టున్నాడు ఆలకించు

అటు వింది సుశీల

ఆంధ్రా జీడిబా! ఆంధ్రా జీడిబా! అంటూ ఎలుగెత్తి అరుస్తున్నాడా కుర్రవాడు

ఎలు ఎలు వాడిని ఆంధ్రా జీబ్రా అంటా డేమిటే? నవ్వుతూ అంది మృదుల

సుశీల వాడికేసి చెయ్యి వూపింది

పరుగెత్తుకుంటూ వచ్చాడు వాడు

ఆంధ్రా జీబ్రా ఏమిటో య్? అంది మృదుల

అదికాదండి

మరేటండి? వెక్కిరించింది సుశీల

ఆంధ్రా జీడిబా అండి అంటే ఆంధ్రా జీడిపప్పండి

ఏమిటే యిది జీడిపప్పా? ఒరి నీ చీమిడిముక్కు వూడిపోనూ అంది నిర్మల వాడి జంగిడికేసి చూస్తూ

బలేవారండి తిని చూడండి జీడిపప్పులా లేకపోతే డబ్బులివ్వద్దండి

అలా లేకపోతే నిజంగానే డబ్బులివ్వం బెదిరించింది కమల

అట్టాగేలెండి అంటూ తలా ఒక అర్ధరూపాయి పొట్లం కట్టిచ్చేశాడు వాడు నోళ్ళు కరకరలాడించారు నలుగురూ

జీడిపప్పులా లేదోయ్! వేరుశనగపప్పులానే వుంది అంది మృదుల నవ్వుతూ

అందుకని డబ్బులివ్వంఫో! ఆటపట్టించింది నిర్మల వాడ్ని

వాడేమీ కంగారుపడలేదు అట్టాగేలెండి మా అక్కయ్యలకి ఫ్రీగా

యిచ్చాను అనుకుంటాను అన్నాడు నవ్వుతూ

ఓరి పిడుగా! అంది నిర్మల

నా పేరు పిడుగు కాదక్కాయ్! బుడుగు అన్నాడు

బాపు రమణల బుడుగేమోనే అంది కమల

అక్కాయ్ అక్కాయ్ నాకో అయిదు రూపాయలు చిల్లర కావాలి యివ్వవూ? అన్నాడు నిర్మలని ప్రాదేయపూర్వకంగా

ఓకె అంటూ వాలెట్‌లోంచి తీసి యిచ్చింది నిర్మల రెండు - రెండు రూపాయల నోట్లు ఒక రూపాయి నోటు

అక్కయ్యలూ! మీరు నాకు డబ్బులివ్వక్కరలేదు మీదగ్గర నుంచి నేనే తీసుకున్నాను! నాలుగుపాట్లాలు కలిపి నాలుగు అర్ధరూపాయిలు అంటే రెండు రూపాయలు ఈ అక్కయ్య యిచ్చిన ఐదు రూపాయల్లో రెండు తీస్తే మిగిలిన మూడు రూపాయలు యివిగో అక్కయ్యలూ! టాటా అంటూ మూడు రూపాయలు నిర్మలకిచ్చేసి పరుగెత్తుకుంటూపోయాడు వాడు

వీడెవడేబాబూ ?

డబ్బు డబ్బులో హీరో క్వాలిటీస్ పుణికిపుచ్చుకున్నట్టున్నాడు అంది నిర్మల వాడి తెలివి తేటలకి ఆశ్చర్యపోతూ

మొత్తానికి సీరియస్‌గా వున్న మనమధ్య వాతావరణాన్ని చాలా ఆహ్లాదకరంగా తయారుచేసి వెళ్ళాడు అంది మృదుల

వేరుశనగపప్పులు తినటం ముగించేసరికి సోడా అంటే సోడా .. డబుల్‌గాస్ సోడా అంటూ చెక్కకేసులో సోడా సీసాలుపెట్టుకుని అమ్ముకుంటున్న కుర్రాడొకడు వచ్చాడు

ఒసేయ్! వీడిమీద జోకులెయ్యకుండా సోడాలు తాగండే అంటూ తలా ఒక సోడా ఇప్పించి డబ్బులిచ్చి పంపించేసింది మృదుల ఇప్పుడు మీ మూడ్ నార్మల్‌గావుంది గదుటే? అంది

క్వైట్ ఓకే అంది నిర్మల

నా పెళ్ళిచూపుల అధ్యాయాలు యింకా చాలావున్నయ్ మీకు బోరుకొట్టకుండావుండటానికి ఈసారి కొల్లేటి చాంతాడులా చెప్పకుండా బ్రీఫ్‌గా బిట్స్ బిట్స్‌గా చెపుతాను

మొదలుపెట్టు అంది సుశీల ఆతృతగా

ఆ తరవాత వచ్చిన సంబంధంలో వరుడు ఎం. ఎస్ సి. (టెక్) మన విజయవాడ మహానగరంలోనే సిద్ధార్థ యింజనీరిగ్ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్నాడు ఆస్తిపాస్తులు సమృద్ధిగానే వున్నయ్ వెనకాల. రంగు కూడా ఎరుపే అయితే మేస్నిగా హుందాగాలేదు నాజూకుగా వున్నాడు. ఆ సంబంధానికి సుదర్శనం అన్నయ్య ససేమిరా ఒప్పుకోలేదు. ఈ అడంగిరేకులవాడికి నా చెల్లెలునిచ్చి పెళ్ళి చేసేది? గట్టిగా గాలివీస్తే..... వెళ్ళి హైదరాబాదులో పడేట్టున్నాడు అన్నాడు

"పెళ్ళి అయిన తరవాత ఒళ్ళుచేస్తాడులే" అని మా అమ్మ.... మా అమ్మమ్మలు సపోర్టుచేసినా ఏం ఉపయోగం లేకపోయింది.

మరో సంబందంలో బ్రైడ్‌గ్రూం కేవలం స్వశక్తిమీద పైకివచ్చాడు. ఎమ్. టెక్ పాసయ్యి శ్రీశైలం ప్రాజెక్టులో ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. మనిషిలో అందం ఆత్మవిశ్వాసం రెండూ కొట్టవచ్చినట్టు కనుపిస్తున్నయ్. అయితే... వెనకాల ఆస్తి చెప్పుకోదగినంతగా ఏమీలేదు. ఈ సంబంధానికి డాడీ ఒక్కరు తప్ప ఎవరూ ఒప్పుకోలేదు ప్రాజెక్టులో ఇంజనీరు అంటే డెల్టాలో ఇంజనీర్లలాగ లక్షలు లక్షలు సంపాయించే అవకాశం వుండదనీ రాళ్ళు జీతం రాళ్ళు మాత్రమే లెక్కపెట్టుకోవలసిన అలాంటి ఇంజనీరు కిచ్చి పెళ్ళిచేసి నన్ను కష్టాలపాలు చెయ్యటం తమ అబీష్టం కాదని ఏకాబిప్రాయం వెలిబుచ్చారు దాంతో ఆ సంబంధం అవుట్!

ఇంకో సంబంధంలో పెళ్ళికొడుకు బి ఎస్‌సి అగ్రికల్చర్ చదివి స్వంతంగా వ్యవసాయం చేస్తున్నాడు పొన్నూరులో పెద్దవాళ్ళు చనిపోగా

కొత్త శీర్షిక ప్రారంభం

## విజ్ఞానం - వినోదం

బాబ్ బ్రౌన

### సమస్య

గుర్రుమనే డబ్బా



### అవసరం

ఒక పాలడబ్బా, ఒక మందమయిన దారపు ముక్క

### ఇలాగచెయ్యాలి

డబ్బా అడుగుకి చిల్లు చెయ్యాలి. దానిలో నుంచి దారాన్ని లాగండి. ఊడి వచ్చెయ్యకుండా ముడి వెయ్యాలి. ఒక చేత్తో డబ్బా పట్టుకుని మరొక చేతితో దారం వెంబడే చేతిని జరపాలి. జరిపినప్పుడు వేలిగోరు దారానికి తగులుతూ ఉండాలి. డబ్బాకి మూత పెట్టరాదు.

### ఏమవుతుంది?

గోరు దారం వెంబడే జరిగినప్పుడు రాపిడి వల్ల దారం అదురుతుంది. ఈ అదురులు డబ్బాలోని గాలి అదిరేట్టు చేస్తాయి. ఇవి కుక్కలు పెట్టే గుర్రులాగే ఉంటాయి!

బోలెడంత ఆస్తి వచ్చిందతనికి దీనికి మా యింట్లోవారంతా రెండు గ్రూపులుగా విడిపోయారు. డాడీ.... సుదర్శనం రాజేంద్ర అన్నయ్యలు వద్దనీ ఆ మట్టి పిసుక్కునేవాడి దగ్గరకెళ్ళి నువ్వు తట్టలు మొయ్యలేవనీ !

మిగతా ఆడవాళ్ళంతా ఒకజట్టు

ఆస్తి వుందిగదా! ఇవ్వాళ కాకపోయినా రేపయినా అతనిచేత పట్నం కాపరం పెట్టించగలదు మృదుల అని వారి వాదన

ఇరువక్షాలు.... ఎన్నిరోజులయినా రాజీపడకపోయేసరికి ఆ కుర్రాడికి మరో సంబంధం కుదిరి లక్షణంగాపెళ్ళి జరిగిపోవటం జరిగింది

గుడివాడ నుంచి వచ్చిన ఒక సంబందంలో అబ్బాయికి అన్ని అర్హతలూ బాగున్నయ్. ఆర్. డి. ఆర్ కంపెనీ మేనేంజింగ్ పార్ట్నర్ పోతే నుదుటిమీద అయిదు పైసల నాణెమంత బొల్లిమచ్చ వుంది అతనికి తను దానికి ట్రీట్‌మెంటు తీసుకుంటున్నాననీ, ఆరు నెలల్లో పూర్తిగా తగ్గిపోతుందనీ ప్లెయిన్‌గా చెప్పాడతను. దీనిమీద అన్నయ్యలు రగడ సృష్టించారు తగ్గిపోతుంది ఈ సంబంధం ఖాయపరుద్దాం అన్నాడు పెద్దన్నయ్య అది మొండివ్యాది తగ్గదు పైపెచ్చు ముఖం ఒళ్ళూ అంతా పాకిపోయి అతను పరమ అసహ్యంగా తయారవుతాడు చూడటానికి తన ఫ్రెండ్స్‌లో అలాంటివాళ్ళు ఒకరిద్దరున్నారు టట్! వీల్లేదు అంటూ పట్టుపట్టాడు రాజేంద్రన్నయ్య దానిమీద వాళ్ళిద్దరూ కొట్టుకునేంతవరకూ వచ్చింది మమ్మీ డాడీకి చిర్రెత్తి కాన్సిల్ చేశారు ఆ మాచ్‌ని

ఈ సంబందం చూడండి ఇంకా థ్రిల్లింగ్‌గా వుంటుంది

అంతా చెవులు రిక్కించి వినసాగేరు

(ఇంకా ఉంది)

భారత దేశంలో ఆత్మతత్త్వము, పరమాత్మ తత్త్వము తెలిసిన సిద్ధపురుషు లెందరో ఉన్నారు. మానవ సేవా భాగ్యంలో నే బ్రహ్మానంద చైతన్య స్థితిని బడసిన మహామహులు, ధర్మజ్ఞులు, త్యాగ మూర్తులు, కార్యశీలురు– ఎందరో ఈ పుణ్య భరత భూమియందు అవతరించి ఉన్నారు. చరిత్ర కెక్కిన ఆది శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు, కృష్ణ చైతన్య, రామానంద, కబీరు, బుద్ధుడు, రమణమహర్షి, రామకృష్ణ పరమహంస, వివేకానంద, రాఘవేంద్రస్వామి, అప్పర్, తిరుజ్ఞాన సంబంధర్ మొదలైన కారణజన్ములే గాక చరిత్ర కెక్కని మహితాత్ములెందరో ఉన్నారు. అట్టివారిలో కీర్తికాంక్ష ఇసుమంతైనా లేని జ్ఞానదాత, ఆత్మవేత్త శ్రీ సొరకాయలస్వామి.

క్రీస్తుశకం సుమారు 1700 వ సంవత్సరంలో శ్రీ సొరకాయలస్వామి చిత్తూరు మండలమున అవతరించినట్లు చరిత్ర కథనం. ఈయన 202 సంవత్సరాలు జీవించి 1902లో పరమైక్యము చెందినట్లు ప్రతీతి. ఇంతటి సుదీర్ఘ ఆయుర్దాయం అరుదైనది, అసాధారణమైనది కూడా! అయితే అలా జీవించే అవకాశం ఉందని జీవశాస్త్ర జ్ఞానం కూడా ఒప్పుకొంటోంది. స్వామివారి చదువు సంధ్యల గురించి, తల్లితండ్రుల గురించి పెద్దగా తెలియదు. ఆత్మజ్ఞాన ప్రపూర్ణుడైన స్వామిని నడయాడే దైవంగా ప్రజలు భావిస్తూ ఉండే వారని తెలియవస్తోంది.

స్వామిరూపం కడుంగడు ప్రశాంతంగా ప్రసన్నంగా ఉండి చూపరులకు ఎనలేని చిత్తశాంతిని సమకూర్చి పెడుతుందని స్వామి శిష్యకోటి అంటూ ఉంటుంది. సామాన్య రైతువలె తలపాగా చుట్టుకొని మూడునామాలు తీర్చుదిద్దుకొని చిరునవ్వు నవ్వుతూ ఉంటాడట ఈ స్వామి! పొడవైన నెరసిన గడ్డం, సొరకాయలు వ్రేలాడు మండెడి కావడి, సొర బుర్రలు, పాత పేటికలు ఉన్న మూట, వామనరూపం, వయోభారం వల్ల వచ్చిన గూని, చేతికర్ర– ఇవి స్వామి అవతారానికి ప్రతీకలు. వృత్తి భిక్షాటన, ప్రవృత్తి మానవసేవా తత్పరత. ఎన్ని మహిమలు చూపినారో లెక్కలేదు. భాషరాని మనిషితో మనసుతో మాట్లాడటం, ఆడమగకాని దిగంబర పరబ్రహ్మ స్వరూపాన్ని శిష్యుడైన కుమారకుప్పం స్వామికి


శ్రీ సొరకాయస్వామి బహిర్మూర్తి!
అంతర్దీప్తి అనంతం!!

సాక్షాత్కరింప జేయడం– అమిత ఆశ్చర్యాన్ని గొలుపుతాయి.

నారాయణవనం ఒకపుణ్య ప్రదేశం. ఈ ప్రాంతంలో నే కల్యాణ వేంకటేశ్వరునిగా శ్రీమన్నారాయణుడు విహరిస్తూ ఉండినట్లు పురాణ ఘోష. ఈ ప్రదేశానికి చేరువగా జగత్ప్రసిద్ధి చెందిన తిరుపతి క్షేత్రం, వాయులింగ ప్రతిష్ఠా విశేషం గల కాళహస్తీశుని నిలయం, తిరుత్తణి కుమారస్వామి ఆలయం, కోలింగపురం యోగనరసింహుని దివ్యస్థానం ఉన్నాయి. ఇట్టి పవిత్ర క్షేత్రంలో అరుణానది తీరాన శ్రీ సొరకాయస్వామి నిర్యాణం చెందడం జన్మాంతర పుణ్యఫలమని చెప్పుకోవాలి. స్వామి సమాధి ఆలయ రూపంలో నేటికీ ఉంది. ఎందరో బాధితులు ఎన్నోరకాలుగా స్వామి సేవ చేసి ప్రారబ్ధ కర్మ నుంచి బయటపడి ఉపశమనాన్ని పొందుతున్నారు. వ్యక్తి పూజ దైవపూజ కన్నా తక్కువైనదని అభిప్రాయ పడినా, వ్యక్తినే దైవంగా భావించే మూఢభక్తి, పరమభక్తి కన్నా తక్కువని చెప్పడానికి వీలు లేదు. అక్కడే సంస్కారం బయట పడుతుంది!

స్వామి భక్తులు కూడా స్వామి వలెనే సిద్ధపురుషులు. జగత్కల్యాణమునకై జీవిత కాలాలు వెచ్చించిన ధన్య మూర్తులు. కీర్తి కాముకత లేని తేజోవంతులు. వారిలో మూటలమ్మ, చట్టి పరదేశి, మడుగు స్వాములు, ము: తపరదేశి, కుమార కుప్పంస్వామి, మంగమ్మ, నందనారు స్వామి ముఖ్యులు. శ్రీ సొరకాయల స్వామి కైంకర్య సమాజము, మద్రాసు నేటికీ ప్రతి సంవత్సరం స్వామి సిద్ధియైన నాగపంచమి నాడు గురుపూజ చేస్తూ ఉండడం విశేషమని చెప్పుకోవాలి!

ఊహాతీతమైన అద్భుతాలు ఎన్నో నిత్య జీవితంలో ఎదురవుతూ ఉంటాయి. అద్భుత మైన ప్రతిదానికీ శాస్త్రీయ వివరణలు ఇవ్వడం కుదరకపోవచ్చు. అంత మాత్రాన అంతా మాయా, మోసం అనడం సమంజసం కాదు. మనిషికి తెలియని విషయాలు ఎన్నో ఉన్నాయి. వాటిల్లో ఒకటి అవధూతల విచిత్ర శక్తి. ఈ పరమహంసల జన్మ సార్థక్యాన్ని గుర్తించి గౌరవించడం వారి ఆదర్శంలోని అంతర్యాన్ని త్రికరణ శుద్ధిగా అలవరచుకోవడం ఒక్కటే విజ్ఞులైన వారు చేయదగ్గవని. ఈ మాట ఎవరికైనా వర్తిస్తుంది.

–డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

## ఉత్తరాలు

( 7 వ పేజీ తరువాయి)

### శీర్షికలు

మీరు శ్రీ ఖండవల్లి సూర్యనారాయణ శాస్త్రిగారు వ్రాసిన 'మన సంస్కారములు–విశేషాలు' ప్రతివారము ప్రచురిస్తున్నారు. ఈ కాలంలో సామాన్యులకు తెలియని, మహత్తర విషయాలను తెలియజేయటం ద్వారా భారతీయులందరికి మహోపకారము చేయుచున్నారు. కేవలము ఐహిక విలాసములలో కొట్టు కొని పోవుచున్న వారికి ఇటువంటి మంచి విషయములు జీవితానికి మంచిమార్గాన్ని చూపిస్తాయనటంలో సందేహం లేదు. ఇంతటి మంచి విషయాలు వ్రాయుచున్న లేఖకునకు కృతజ్ఞులము.

–వెంపటి లక్ష్మీనారాయణ శాస్త్రి, విజయవాడ

★ ★ ★

అనేక మందిని రచయితలుగా తీర్చిదిద్దే "చిన్నారి బాలల దీనగాథలు" సూపర్‌ఫైన్‌గా వుంది. మహిళల కోసం పెట్టిన "ఈకాలం పెళ్ళిళ్ళు" మహిళలను రచయిత్రులుగా తయారు చేస్తుంది. జోక్స్ పూర్తిగా చదవక ముందే నవ్వును తెప్పిస్తున్నాయి. ముఖచిత్రం పట్ల చాల జాగ్రత్త తీసుకుంటు న్నారు.

–సతీం, ఖమ్మం

### ధర్మపథం

భరతుని భ్రాతృభక్తి యెట్టిదో స్పష్టంగా తెలుపుతూ తమ ధర్మపథం శీర్షికలో రచయిత శ్రీ బులుసు వేంకటరమణయ్య గారు చక్కగా వివరించారు.

–శ్రీమతి మణిమాలమోహన్, కడప □

మహిళా పాఠకుల శీర్షిక

# ఈ కాలం పెళ్ళిళ్లు

## "యువత" సహకరించాలి

"మాంగల్యం తంతునానేన మమ జీవన హేతునా

ఇది వివాహ సమయంలో పురోహితుడు ఉచ్చరించే అతి పవిత్రమైన వేద మంత్రం. పచ్చటి పందిరిలో, బాజాభజంత్రీలతో, మంత్రోచ్చారణతో వేసిన ఆ మూడు ముళ్ళ బందానికి ఎంతో పవిత్రత వుంది పెళ్ళంటే నూరేళ్ళ పంట స్త్రీ పురుషుల జీవితాలలో అదొక మరపురాని మరచిపోని మదురానుభూతి స్త్రీ పురుష లిరువురు ఒకరి కొకరు అవగాహన చేసుకొని అన్యోన్యంగా అనురాగంగా, కలసి సహ జీవనము చేయటయే, ఆ మంత్రంలోని పరమార్థం కాని నేడు ఆ మంత్రము కేవలం పెళ్ళిలో ఒక బాగమై పోయింది బహుశా యీ మంత్రోచ్చారణకే నేటి వివాహాల్లో కొన్ని వేలు పోయాల్సొస్తోంది. ఈ అతి పవిత్ర పెళ్ళి మంత్రాన్ని ఉచ్చరించగానే,




పెళ్ళి కూతురు తండ్రి అదేదో పెద్ద బారం తొలగినంత నిట్టూరుస్తాడు. మనసు నిలకడైనట్లు బావిస్తాడు

నానాటికి పెరిగి పోయే యీ వరకట్న ఎశాచి కోరల్లో ఎంత మంది ఆడపిల్లల తండ్రులు నలిగి ప్రాణాలు కోల్పోతున్నారో? ఎంత మంది కన్నెలు దారుణంగా బలయి పోతున్నారో? ఆ ఆడపిల్ల తండ్రి ఎన్ని బాధలయినా పడనీగాక అబ్బాయికి మాత్రం తగిన లాంచనాలు తు చ తప్పకుండా యివ్వాలి పైగా అమ్మాయి ఉద్యోగం చేస్తుండాలి ఇదెక్కడి న్యాయం??

ఇన్ని కష్టాలు పడి అప్పో సొప్పో చేస ఆ తండ్రి అమ్మాయి పెళ్ళి చేసి, అత్తవారింటికి పంపితే అత్త గారింటిలో ఆ అమ్మాయి పడే బాదలు వర్ణనా తీతములు ఎంత కట్నం యిచ్చినా యింకా యివ్వలేదని, అత్తగారి ఆరళ్ళు మగడి హింసలు, మామగారి చీవాట్లు జరుగరానివి యింకెన్నో పరిపాటి అయినాయి

ప్రతి రోజు ఏ పత్రిక చదివినా కనీసం మూడు నాలుగు వరకట్నపు చావులు తప్పని సరి ఈ వరకట్నాన్ని నిషేదిస్తూ ప్రభుత్వం చట్టాలు వేసింది. అయితే యిది ఎంతవరకూ అమలులో వుంది? ఎంత మంది పడుచుల ప్రాణాలను కాపాడ గలిగింది?

వరుడు వధువును చూచి యిష్టపడితే, తల్లి తండ్రులకు కట్నం దగ్గర పేచి, స్త్రీ పురుషుని కంటె దేనిలో తక్కువ? చదువు, ఉద్యోగం, ఆశయాలు, ఆలోచనలు– అన్నింటి లోనూ ఆడది పురుషునితో సమానమే. కేవలం కట్నం కొరకు కురూపులను పెళ్ళి చేసుకున్న సంఘటనలు లేకపోలేదు. కొంత మంది నీతులు వల్లించే పెద్ద మనుషులు, కట్నం పైకి వద్దంటూ, లోలోపల తీసుకొన్నవారు లేకపోలేదు. ఈ వరకట్నం ఒకరిని పట్టిన జాడ్యం కాదు. మొత్తం దేశానికే పట్టిన చీడ. దీన్ని సమూలంగా, తొలగించి, పార ద్రోలాలంటే, ఏ ఒక్కరి వల్ల జరిగే పని కాదు. అట్లని ఎవ్వరికి వారు ఊరుకోరాదు. తప్పనిసరిగా కట్నం తీసుకొనే ప్రతి ఒక్కరిని ప్రభుత్వం శిక్షింప చేయాలంటే అందులకు ప్రజల సహకారం ఎంతైనా అవసరం యువతులు కూడా తాము పెళ్ళి చేసుకోక పోతే, బ్రతకలేమేమో నన్న సందేహాలు మాని, గొప్ప చదువులు చదివి, తమ కాళ్ళపై తాము నిలబడటానికి సిద్ధహస్తులు కావాలి. ముఖ్యంగా "వరకట్న" సమస్య నేటి యువతీ యువకులకు సంబంధించిన సమస్య. దీన్ని వేర్లతో సహ తుద ముట్టించాలంటే, యీ యువతకే సాధ్యమవుతుంది. దీనికి తల్లి తండ్రులు కూడా, వారికి చేయూత నివ్వాలి. అనాదిగా గూడు కట్టుకున్న మూఢాచారాలు, సాంప్రదాయాలు, పట్టించుకోకుండా, పెద్దలు కూడా, పెద్ద మనసు చేసుకొని, మతాంతర వివాహాలు, కులాంతర వివాహాలకు చేయూత నివ్వాలి. ఏ రోజు వరకట్న దురాచారం దేశం నుండి, శేషం లేకుండా పోతుందో, ఆ రోజే, సమస్త స్త్రీ జాతికి పండగ రోజు. మరపురాని రోజు. మధురమైన రోజు.

– కె. శాంతి, అనకాపల్లి □



కూపన్
ఆంధ్ర సచిత్ర వారపత్రిక
ఈ కాలం పెళ్ళిళ్లు
పంపిన వారి పేరు.........................................
పూర్తి చిరునామా.........................................
.........................................
.........................................
పిన్ కోడ్:.........................................




# భారతి

సాహిత్య మాసపత్రిక

## అతిత్వరలో మళ్ళీ వెలువడుతోంది!

కొన్ని అనివార్య కారణాల వలన బారతి సాహిత్య మాసపత్రిక ప్రచురణని తాత్కాలికంగా నిలిపి వెయ్యటం జరిగింది కాని–

సాహిత్యాబి మానుల కోరికపై

**–అతిత్వరలో –**

సాహిత్య మాసపత్రిక

**భారతిని**

తిరిగి వెలువరించటానికి ఏర్పాట్లు చేస్తున్నాము!

★ ఎప్పటిలాగే బారతి సాహిత్యానికి ప్రాదాన్యం ఇస్తుంది!

★ కవిత్వం కథలు చారిత్రక పరిశోదన విమర్శనము భాషా శాస్త్రం చర్చ– అన్నిటికీ బారతి చక్కటి అవకాశాలు కల్పిస్తూనే ఉంటుంది!

★ ఒక్క మాటలో చెప్పాలంటే భారతి తెలుగు వారి సంస్కృతికి (బారతీయులుగా ఆదునిక ప్రపంచపు పౌరులుగా) ప్రతిబింబంగా ఉంటుంది

సాహిత్యాభిమానులు చందాదారులుగా చేరి బారతి ప్రచురణకి తగిన ప్రోత్సాహం ఇవ్వాలని కోరుతున్నాము

చందాదారులుగా చేరే వారి సౌకర్యం కోసం ముందుగానే ఒకేసారి 12 సంచికల చందా కట్టేవారికి రు 15/–ల ముదరా ఏర్పాటు చేస్తున్నాము

అంటే సంవత్సర చందా నెలకి రు 5/–చొప్పున రు 60/– అవుతుంది కాని ముందుగా చందా దారులు కావాలనుకున్న వారు రు 45/– పంపితే చాలునన్నమాట!

**సంవత్సర చందాదారులకు రు. 15-లు ఆదా!**

ఆంద్ర పత్రిక ఏజెంటు ఉన్న చోట సరపరా ఏజెంటుద్వారా జరుగుతుంది

ఏజెంటు లేని చోట ఉన్న వారికి బారతిని పోస్టు ద్వారా పంపగలము

ఈ ప్రకటనలో పొందుపరిచి ఉన్న కూపనుని నింపి మీ చందా మొత్తంతో నేడే పంపగోరుతున్నాము

చందాదారులుగా చేరదలచినవారు భారతి కేరాఫ్ ఆంధ్రపత్రిక గాంధీనగరం విజయవాడ–520003 చిరునామాకు మనియార్డరు/ డ్రాఫ్టు ద్వారా రూ 45/– చెల్లించాలి మనియార్డరు రసీదు/ డ్రాఫ్టుతో బాటు ఈ క్రింది కూపన్ జతచేర్చి పంపాలి

మనియార్డరు కూపన్‌లో భారతి సంవత్సర చందా నిమిత్తం రు 45/ పంపుతున్నట్టు రాస్తూ తమ పోస్టలు చిరునామాను స్పష్టంగా రాయాలి

### భారతి చందా కూపను

నేను బారతి మాసపత్రికకు చందా దారునిగా చేరదలుచుకున్నాను సంవత్సర చందా పైకము రు 45/-(25 శాతం ముదరా పోను) డి డి/ ఎం ఒ ద్వారా పంపుతున్నాను

పేరు:

చిరునామా

పిన్‌కోడ్:

చందాదారుని సంతకం

# భర్తృవిజయం

## మాడుగుల కృష్ణమూర్తి




దాదాపుగా ఓ ఆర్నెల్ల నుంచి సుబ్బారావు భద్రం కల్సి ఆలోచించినా విడి విడిగా ఆలోచించినా కూడా వాళ్ల ప్రోబ్లంకి సాల్వేషన్ లభించలేదు తలకాయలు పగలకొట్టుకున్నా జుట్లు పీక్కున్నా కూడా రవ్వంత క్లూ దొరకలేదు కానీ ఫలితంగా ఇద్దరితలలు బుర్ర బద్దలయ్యాయి

అసలు వాళ్లకీ సమస్య ఆర్నెల్లనాడు తమ ఆఫీసులో మధు కొత్తగా ట్రాన్సఫర్ అయి వచ్చిన నాటి నుంచి మొదలయ్యింది

ఆఫీసుకు కరెక్టు టైముకే వస్తున్నాడో ఎప్పుడు నలగని బట్టలతో చెదరని చిరునవ్వుతో తప్ప ఏనాడూ దిగుళ్లు బాధలు వున్నట్లుగా కన్పించలేదతడు వాళ్ల కళ్లకు

ఓ వేళ బ్రహ్మచారేమో అన్న అనుమానం వచ్చింది కానీ సర్వేలో కాదని ఏడాదిన్నర కొడుకు కూడా వున్నాడని తెల్సింది

కానీ ఇదెలా సాధ్యం అన్నదే వాళ్ల ఆలోచన

ఏదో గుట్టు చప్పుడు కాకుండా పని చేసుకు పోతున్న తమ మీద గోరుచుట్టు మీద- రోకటి పోటులా వచ్చిపడ్డాడు ఈ మధు

ఈ సమస్యని ఛేధించటాన్కి తమే ఇద్దరి శాయ శక్తులు చాలవని టాప్ లెవెల్లో ఆలోచించి ఎవరన్నా ఎ ఐ డి ని అపాయింట్ చెయ్యాలని అనుకొన్నారిద్దరు

అలాటి మనిషికోసం వేట మొదలుపెట్టి చివరకు ఆఫీసుప్యూన్ హరిచ్చంద్రుడ్ని అపాయింట్ చేశారు

ఓ వారం రోజుల్లో పరిష్కరిస్తానని చెప్పాడు మాట తప్పని హరిచ్చంద్రుడు అయినప్పటికి ఆశ చావక ఓసారి మధుని ఇంటర్వ్యూ చేశారు జతగా

మీరు ఆఫీసుకు ఇన్‌టైముకు ఎలా రాగల్గుతున్నారు?

ఆఫీసయ్యాక మీకు ఇంటిదగ్గర పనేమి వుండదా?

మీరు జీవితంలో ఇంత ఆనందంగా ఎలా వుండగల్గుతున్నారు

మీరు ఇలా వుండటాన్కి కారణాలు వివరించ గలరా?

అన్ని ప్రశ్నలకు సమాధానాలు వాళ్ళు వూహించని విదంగా వచ్చాయి మదు చెపుతున్న సమాదానాలు విన్న భద్రానికి తన విషయం గుర్తుకు వచ్చింది

ఆఫీసు వదలగానే ఆదరాబాదరాగా ఇల్లు చేరిన భర్తను చూసి

ఏం ఇంత ఆలస్యంగా తగలడ్డారు?? తల పగిలిపోతోంది ముందు కాస్త కాఫీ తగలెయ్యండి నా ముఖాన అంది గుర్రుమని చూస్తూ అలివేలు

అయిపోయింది ఇదిగో అని వణికిపోతూ బట్టలయినా మార్చుకోకుండా ముందు కాఫీ తయారు చేసి భార్యకిచ్చాడు

బట్టలు మార్చుకోడానికి గదిలోకి వెళ్ళబోతున్న అతణ్ణి చూసి కెవ్వుమంది అలివేలు

ఏమయింది, అనడిగాడు గాబరాగా

చిన్నది ఆ గదిలో అంటు వన్ అండ్ టు హేండ్స్ చూపించింది భార్య

చచ్చినట్లుగా అక్కడంతా క్లీన్ చేసి రూమ్ కడిగి వంట ప్రయత్నంలో పడ్డాడు

వంట గది సర్దుకుని పడగ్గది చేరుకొనేసరికి రాత్రయింది

ఆనవాయితిగా భార్యామణి పాదసేవ పావుగంట సేపు

మళ్ళీ తెల్లవారు ఝామునే లేచి ఇంటి పని మొదలు

తన కార్యక్రమాల్లో ఏ ఒక్కదానికి భిన్నంగా జరిగినా ఇంటి పరిస్థితి గురించి ఆలోచించడం అనవసరం

అలివేలు కాపురానికి వచ్చిన నాటి నుంచి భద్రం జాతకం ఇలా మారిపోయింది ఇంచుమించుగా సుబ్బారావు పరిస్థితి అంతే

భద్రానికయితే భార్యా పిల్లలు మాత్రమే

సుబ్బారావుకి అత్త – మామలు కూడా వున్నారు

అందుకే ఆఫీసులో ఇద్దరికి జతకుదిరింది ఒకరి కష్ట సుఖాలు మరొకరికి చెప్పుకొని మనసు సేద తీర్చుకుంటారు

ఇంటి చాకిరితో యిలా కష్టపడుతు న్న తమ మీద ఒక్కరికి కూడా ఎందుకు సానుభూతి చూపరో వాళ్ళకి ఎంత ఆలోచించినా అర్థం కాదు

బస్ చార్జీలకు తప్ప తమ దగ్గర పైసావుండటాన్కి వీల్లేదు భర్త పోస్టుతో పాటు పని మనిషి చాకలి వంట మనిషి పోస్టులు కూడా తాము నిర్వర్తిస్తున్నామని తెల్సికూడా నోరు మెదపలేని స్థితి తమది

తమ విషయాల గురించి ఎవ్వరికి తెలియకూడదని ఎంతగా జాగ్రత్తపడ్డా అందరికి తెలిసిపోయి అలుసయిపోయింది

తమతోపాటుగా పని చేసే మిగిలిన వాళ్ళు తమని ఏ ఏ పేర్లతో పిలుస్తారో వాళ్ళిద్దరికి బాగా తెలుసు

కక్కలేక మింగలేక అవస్థ పడుతున్న వాళ్ళ అవస్థ మరింత పెంచటాన్కా అన్నట్టుగా ఈ మధు వచ్చాడు

హరిచ్చంద్రుడు తెచ్చే న్యూస్ కోసం ఎంతగానో ఎదురు చూస్తున్నారిద్దరూ రానే వచ్చాడు చెప్పనే చెప్పాడు మధు అన్యోన్య దాంపత్యానికి వుదాహరణలు కొన్ని మచ్చుకి

తమసాటి వాడయిన మదు కాపురం మూడు పువ్వులు – ఆరుకాయలుగా వుండటం వాళ్ళిద్దరిలో తీవ్రమయిన అసంతృప్తిని కల్గిస్తోంది

ఏరా చంద్రుడు దీనికు కారణం ఏమి టంటావు? అనడిగాడు వాడ్ని దీనంగా ఇద్దరు

సమాదానం నన్ను చెప్పమంటారా? అన్న మధు వైపు ఆశ్చర్యంగా చూశారు

మనం డబ్బు పెట్టి కొనుక్కున్న వస్తువు అయినా డబ్బిచ్చి పెట్టుకున్న మనిషి నయినా వుపయోగించుకుంటాం మిమ్మల్ని మీ భార్యలు కొనుక్కున్నారు మీలా నన్ను నా భార్య కొనుక్కో లేదు నేనామెకు అమ్ముడు పోలేదు అందుకే మా మధ్య ప్రేమాభిమానాలతో మా కాపురం హాయిగా సాగుతోంది కానీ మీరో –

ఆ భద్రంగారు వాతికవేలకు అమ్ముడుబొయ్యారండి ఈ సుబ్బారావుగారు యాభై వేలకండి అందుకే ఆర బార్యలు ఆర్ని బాగా ఇనుక చంతపండు పెట్టి తో మినట్లుగా తో ముతున్నారు ఇంటికాడ " అన్నాడు హరిచ్చంద్రుడు అబద్ధం చెప్పటం ఇష్టం లేక

చూశారా ఫ్రెండ్స్ కట్నం కోరని భర్తగా భార్య మనసులో ప్రేమను సంపాదించుకోవాలి కానీ –

వేలకు వేలు కట్నం గుంజి భార్య మనసులో నా భర్తను నేను డబ్బుపెట్టి కొనుక్కున్నాను అన్న అభిప్రాయం ఏర్పరిచిన నాడు మీ జీవితాలు యిలాగే వుంటాయి '

ఇదే నా జీవితంలోని టాప్ సీక్రెట్ కాదు కాదు నేను సాదించిన భర్త విజయం అని చిరునవ్వుతో చెపుతూన్న మదువైపు

నోరు తెరుచుకుని చూస్తుండిపోయారు మిత్రులిద్దరూ ☐




బి.బి.రావు. ఎమ్.ఏ.ఎల్ఎల్.బి.

డాక్టర్ విజయ మహారాష్ట్రలోని కళ్యాణ్‌లో ప్రాక్టీస్ చేస్తున్నది ఆమెకు పెళ్ళి అయినది ఆమె తండ్రి కాశీరావ్ కాశీరావ్ మొదటి భార్య వలన విజయ కలిగినది కాశీరావ్ మొదటి భార్య మరణించినది తను పోషించుకోలేని స్థితిలో ఉన్నందున తన పోషణ నిమిత్తం నెలకు రు 500/ చెల్లించాలని కూతురు డాక్టర్ విజయమీద మేజిస్ట్రేట్ కోర్టులో క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని సెక్షన్ 125 క్రింద దావా వేసాడు కాశీరావ్ ఈ సెక్షన్ భరణం చెల్లించాలని తీర్పు చెప్తూ రివిజన్ పిటిషన్ డిస్మిస్ చేసారు ఈ తీర్పుపై డాక్టర్ విజయ సుప్రీమ్ కోర్టుకు అప్పీలు పెట్టుకున్నది 125(1) సెక్షన్ ప్రకారం ఎవరైనా తన భార్యను పోషించడానికి నిరాకరించినా తన మైనర్ పిల్లలను పోషించక పోయినా అంగ వికలులైన తన పిల్లలు మెజారిటీ తీరినప్పటికీ వారిని పోషించనట్లయితే లేదా తండ్రినిగానీ తల్లిని గానీ పోషించడానికి నిరాకరించినా అతను ప్రతి నెలా ఐదు వందల




క్రింద కూతురుమీద తండ్రి దావా వేయడం చెల్లదని విజయ తరఫు లాయర్ వాదించారు కాని ఈ వాదనను మేజిస్ట్రేట్ త్రోసిపుచ్చారు తండ్రికి ప్రతి నెలా రు 500/ భరణం చెల్లించవలసినదని డాక్టర్ విజయను మేజిస్ట్రేట్ ఆదేశించారు ఈ ఆర్డర్‌పై విజయ బొంబాయి హైకోర్టుకు రివిజన్ పిటిషన్ పెట్టుకున్నది కాని హైకోర్టువారు కూడా తండ్రి పోషించుకోలేని స్థితిలో ఉన్నాడు కనుక వివాహం అయిన కూతురు తండ్రిని పోషించాలి కనుక రూపాయిల వరకు భరణం చెల్లించవలసినదని మెజిస్ట్రేట్ ఆదేశం జారీ చేయవచ్చు ఈ సెక్షన్ క్రింద కూతురు కూడా తండ్రికి భరణం చెల్లించాలని సుప్రీమ్‌కోర్టు 1987 లో తీర్పు చెప్తూ డాక్టర్ విజయ అప్పీల్‌ను కొట్టి వేశారు 1982 లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు కూడా ఈ విదంగా తీర్పును ఇచ్చారు ఈ తీర్పును సుప్రీమ్ కోర్టువారు ఆమోదించారు ☐

సీరియల్

# మంజీరనాదం

## రావినూతల సువర్ణకన్నన్

(గత సంచిక తరువాయి)

చందన అంతఃపురంలోని ఓగదిలో కుళ్ళికుళ్ళి ఏడుస్తోంది ఆమెను ఓదార్చడానికైనా అనునయించడానికైనా అక్కడెవరూ లేరు దాసీలు కూడా అనుమతి లేనిదే ఆగదిలోకి వెళ్ళకూడదు అది రాజాజ్ఞ!

మమతాదేవి మరో గదిలో పడుకుని అంతకన్న ఘోరంగా విలపిస్తోంది

ఆమె పుట్టింటారొచ్చి రాజాపాండూతో ఏదో మాట్లాడ్డానికి ప్రయత్నించినా అతను అంగీకరించ లేదు పైగా వాళ్ళని తూలనాడాడు కూడా

రసన్ మాత్రం కారాగారంలో నిర్వికారంగా కూర్చున్నాడు అతని మొహం భావరహితంగా వుంది

తల్లి దండ్రులు అన్నలు వచ్చి ఏడ్చి గోలచేశారు

వదినలు ఎందుకు చేశావీపని రసన్? అంటూ ఆక్రోశించారు స్నేహితులు హితులు వచ్చి కంట తడి పెట్టుకున్నారు అయితే అన్నింటికీ మౌనమే జవాబుగా వుండి పోయాడతను

అతనికి పడబోయే శిక్ష తల్చుకుంటే అందరికీ భయంతో ఒణుకొచ్చేస్తోంది

కనిపించని దైవాలందరికీ మొక్కుకున్నారు ఆపసివాణ్ణి కాపాడమని

విచారణ జరిగింది

ఊపిరి బిగబట్టి వింటున్న వారినెత్తిన పిడుగు పడింది

రసన్‌కి వురిశిక్ష పడింది

ఎప్పుడూ లేనిది ఆదేశ ప్రజలు రాజుని విమర్శించ సాగారు

రాజుకో న్యాయం సామాన్యులకో న్యాయమూనా? రసన్‌కా శిక్ష విధించినప్పుడు రాకుమారికి మాత్రం క్షమాభిక్ష ఎందుకు పెట్టారు? అంటూ బాహాటంగానే అనుకున్నారు

ఆ సంగతి రాజాపాండూ చెవుల్లో కూడా పడింది అయినా అతను పట్టించుకోలేదు ఆగ్రహించనూ లేదు

వంశం అంతరించి పోతుందనో లేక భార్య బాధ చూడలేకనో అదీగాక కూతురి మీద మమకారం వల్లనో ఆమెకే శిక్షా విధించలేదు

అది మంచి పద్ధతి కాదని ప్రజల దృష్టిలో తానో దుష్టుడిగా మిగిలి పోతాడనీ అతనికి తెలుసు అయినా అతను పట్టించుకోలేదు

రసన్ వురి సంగతి తెలిసిన దూరపు బంధువులు సైతం వచ్చి పడ్డారు ఏడ్చారు రాజు నిర్దయకి దూషించారు పట్టీ తగ్గిపోయి సూర్యదేవ్‌ని వెళ్ళి అతని కాళ్ళ మీద పడమని సలహా ఇచ్చారు మోడు చిగురుస్తుందేమో అన్న ఆశతో

రాజు దగ్గరికెళ్ళి పుత్రభిక్ష పెట్టమని ఏడ్చారు

ఈ తప్పు కాయండి అంటూ కాళ్ళ మీద పడ్డారు అతన్ని వదిలితే దేశమే వదిలిపోతామన్నారు అయినా అతని మనసు కరగలేదు వురి శిక్షరద్దు కాలేదు

వురిశిక్ష ఎప్పుడు అమలు జరుపుతారో ముందుగా తెలియనివ్వరు అది ఆదేశాచారం

చనిపోయిన వారికి ఆదేశంలో ఇచ్చిన గౌరవ మర్యాదలు ఇంకేదేశంలోనూ ఇవ్వరు

నేరస్తుని అంతిమ కోరిక ఎలాంటిదైనా సరే ఒక్క ప్రాణభిక్ష స్వేచ్ఛ ఇవ్వడం తప్ప నెరవేర్చడం ఆదేశాచారాల్లో అతి ముఖ్యమైంది

అక్కడ శవాల్ని ఖననం చెయ్యడమే తప్ప దహనం చెయ్యరు అదీ చాలా చిత్రంగా ఖననం చేస్తారు

రాజ వంశీయులు పోతే ఓ ప్రత్యేక స్థలంలో రాజలాంఛనాలతో భూస్థాపితం చేస్తారు

వారి శవ పేటికల్లో తలకిరు పక్కలా రెండు వెండి పాత్రల్లో ఓ రకమైన పసరు పోసి పెడతారు అదే పసరుతో తడిపిన పట్టు వస్త్రాలు కడతారు బంగారు నాణాలు నగలు లాంటివి అలంకరిస్తారు

అయితే అన్నింటికన్నా ముఖ్యమైంది ఆపసరు! ఆ పసరువల్ల శవం ఎన్ని యుగాలయినా పాడవదు జీవం వున్నట్టే వుంటుంది ఆ మర్యాదలన్నీ ఒక్క

**జరిగిన కథ – 17 :** చందన రసన్‌ల పెళ్ళి జరిపించి ధాయమ్మ ఆత్మాహుతి చేసుకుంటుంది రసన్ తమ రాజ్యం నుంచి పారిపోయాడని మమతాదేవికి తెలుస్తుంది రసన్ చందనలు అడవిలో ఆనందలోకాలలో తేలిపోతుంటారు రాజాపాంధూ వాళ్ళ కోసం తీవ్రంగా వెతికిస్తూంటాడు రసన్ చందనలను సైనికులు చుట్టుముడతారు

రాజకుటుంబీకులకే మాత్రమే అయినా మిగతా వారిక్కూడా కొన్ని ఆచారాలున్నాయి వారి వారి స్థితిగతులని బట్టి ఖననం చేస్తారు

వారి దేశాచారం ప్రకారం రసన్‌ని అడిగారు నీతుది కోరిక ఏమిటి? అని

నాకు చందనని చూడాలనుంది' అనంటాడని పూహించారంతా అయితే అతను ఆకోరిక కోరలేదు



చిత్రమైన కోరికలు కోరాడు

మొదటిది చందన కాలి అందెలు తనకిమ్మని! తర్వాత కోరిక మరీ వింతగావుంది

తను పోయాక తన శవాన్ని రాజలాంచనాలతో సహా రాజుగారి తోటలో తన కుటీరానికి పదడుగుల దూరంలో భూస్థాపితం చెయ్యాలనీ తన శవం యుగాలయినా చెడి పోకుండా వుండేలా రాజ వంశానికి వుపయోగించే పసర్లకన్నా శ్రేష్ఠమైన పసర్లు వాడాలనీ తనని వురి తీసే వరకు ప్రతిరోజూ తన వాళ్ళతో మాట్లాడుతూ కొంత సేపు గడపాలనీ ఆపై రాజుగానీ రాజుకి సంబంధించిన మరెవరుగానీ లేకుండా తన వాళ్ళు మాత్రమే తన శవాన్ని రాజావారి తోటలో తను చెప్పిన చోట భూస్థాపితం చెయ్యాలనీ కోరాడు రసన్

తెల్లబోయాడు రాజాపాండూ

మొహాలు చూసుకున్నారు మిగతావారు

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

పదిహేను రోజులు గడిచి పోయాయి

చందన అంతఃపురంలో నే బందీగా వుంది

ఆమె చచ్చి పోవడానిక్కూడా వీల్లేనట్టు కట్టు దిట్టాలు చేశాడు పాండూ

గది వదలి బైటికి రావడానికి వీల్లేదు రవ్వల్లాంటి ఆభరణాలు ఆమె ఒంటి మించి తీసేశారు ఆత్మహత్యకి పనికొచ్చే ఎలాంటి ఆయుధమూ ఆమె పరిసరాల్లో లేకుండా జాగ్రత్త పడ్డారు బయపట్టి ఆహారం పెడుతున్నారు

చందనకి ఈ పరిస్థితి చాలా దుర్భరంగా వుంది

రసన్‌కి వురిశిక్ష పడిందని ఒక దాసీ ద్వారా తెలుసుకుంది

అనుకున్నదే అయినా ఆ మాట వినగానే నిలువెల్లా ఒణికి పోయింది వలవల ఏడ్చింది తలగోడకేసి బాదుకుంది రసన్ చావుకి కారకురాలు తనే అనుకున్న ఆమె హృదయం ఎండేస్తున్నట్టుంది

తన సాహసం దాయమ్మ ప్రాణత్యాగం తమకి సుఖాన్నివ్వలేదు రసన్ ప్రాణాన్ని తీస్తున్నాయి దాయమ్మ దీవనలు ఫలించలేదు ఆమె ఆశీర్వదించినట్టు రసన్ నూరేళ్ళు జీవించడం లేదు అకాల మరణం పాలవుతున్నాడు కాదు తనే అతన్ని చంపుకుంటోంది ఆనాడు తను ఇల్లు విడిచి అతని దగ్గరికి కెళ్ళక ఎంత తన రసన్ ఎక్కడో ఓ చోట ఎతుకుండేవాడు అనుకుని కుళ్ళి కుళ్ళి ఏడ్చింది

దాయమ్మ సాహసం ప్రాణత్యాగం తల్చుకుంటే మమతాదేవి హృదయం కూడా భారంగా అయిపోయింది కానీ రేపు జరగబోయేది తల్చుకుంటేనే ఆమెకి వెన్నులోంచి ఒణుకొచ్చేస్తోంది

రసన్నెలాగూ రక్షించలేం కనీసం చందన్నైనా రక్షించుకోవాలి! కానీ ఎలా? కోపిష్టి భర్త దగ్గర ఎలా చెప్పుకోవాలి తన ఆవేదన? అంటూ అల్లాడి పోయింది మమతాదేవి

భర్త చందనక్కూడా ఏదో ఓ శిక్ష వెయ్యక మానడని ఆమె అంతరాత్మ ఘోషిస్తోంది

అయితే ఆమె ఆలోచనల్ని తారుమారు చేస్తూ ఆరోజు రాత్రి సరాసరి ఆమె గదిలో కొచ్చాడు భర్త

అతని ఎదుటకి రావడానికే భయపడుతున్న మమతాదేవి హఠాత్తుగా అతను రావడం చూసి మళ్ళీ ఏం కొంప మునిగిందో అన్నట్టు కంగారుగా చూసింది

చందన ఏమంటోంది? గంభీరంగా అడిగాడతను



జరిగిందానికి పశ్చాత్తాప్పడు తోంది ప్రభూ అందంగా అబద్ధం చెప్పింది మమతాదేవి

అయితే మీరు చందనకో మాట చెప్పాలి

బయం భయంగా చూసింది మమతాదేవి

రేపు పున్నమి వెళ్ళిన పంచిమినాడు చందా విక్రమ్‌ల పెళ్ళి గంభీరంగా అన్నాడతను

తృళ్ళి పడింది మమతాదేవి

ఏవిఁటి? అంది తను పొరపాటుగా విన్నానేమో అన్నట్టు మళ్ళీ చెప్పాడతను

ఆమె పొంగిపోయింది

మీ బావగారు

రసన్ చిత్రకళలోని మెలకువలు నేర్పిస్తానని చందనని ఎక్కడికో తీసి కెళ్ళాడు తీరా వెళ్ళాక అతని దురుద్దేశాన్ని అర్థం చేసుకున్న చందన అతని మీద దెబ్బతీసి తాతగారింటి కెళ్ళి పోయింది మీ నాన్నగారు రసన్‌ని బందించి మనకప్ప చెప్పారు చందన మనింటి కొచ్చేసింది జరిగిన సంఘటన అవమానంగా బావించిన చందన మానసికంగా కృంగి పోయింది ఇదే మా బావగారికి చెప్పింది నువ్వూ అలాగే చెప్పాలి! తీక్షణంగా అన్నాడు పాందూ

వాళ్ళు నమ్మారా?

ఎందుకు నమ్మరు నమ్మేలా చెప్తే? నమ్మారు లగ్నాలు నిర్ణయించారు

మమతాదేవి కళ్ళల్లోకి జీవం వచ్చింది

భగవంతుడా! నా మొర ఆలకించవా! ఆనందబాష్పాలు తుడుచుకుంటూ గొణుక్కుంది

అయితే పాంధూ మొహం మాత్రం గంబీరంగానే వుంది వెళ్తూ మరో సారి పాత కదని సమాది చెయ్యాలని హెచ్చరించి మరీ వెళ్ళాడు

మమతాదేవిలోని మాతృ హృదయం ఆనందంతో వుప్పొంగి పోయింది ఆ ఆనందంలో మరో మాతృహృదయం పెట్టే ఘోష ఆమెకి వినిపించడం లేదు

గబగబా తీపి పదార్థాలు తెప్పించి అందరికీ పంచింది తన కూతురు పెళ్ళి నిర్విఘ్నంగా జరిపించమని వేయి దేవుళ్ళకి మొక్కుకుంది

చందాని ఎలాగైనా ఈ పెళ్ళికి ఒప్పించాలి అంతగా కాకపోతే తను చచ్చి పోతానని బెదిరిస్తే సరి తనే ఒప్పుకుంటుంది అసలంటూ ఒప్పుకుంటే పెళ్ళయ్యాక తనే మారిపోతుంది అనుకుంటూ వుత్సాహంగా కూతురి గదిలో కెళ్ళింది బైటవున్న తాళం తీసుకుని




అయితే చందన అక్కడ లేదు స్నానాలగదిలో వున్నట్టుంది

చందా! అని ఎల్చింది మమతాదేవి ఆనందం వుట్టి పడుతున్న గొంతుతో

ఈ మధ్య చందన తల్లితో మాట్లాడ్డం లేదు పిల్చినా పలకడం లేదు అంతకుముందులా కూతురు పలక్కపోతే ఇప్పుడు కోపం రాలేదు మమతాదేవికి

ఆ పిల్ల అలకకి ముసి ముసిగా నవ్వుకుంది

రెండు నిమిషాలు వేచివుంది

ఆనందాన్ని దాచుకోవడం ఆమెకి సాధ్యం కావడం లేదు మరో సారి పిల్చింది

ఈసారీ పలకలేదు చందన

మమతాదేవి కళ్ళు చిత్రంగా ముడుచుకున్నాయి

కొంపతీసి పారి పోలేదుకదా? అనుకుంది కానీ వెంటనే బైట తాళం తనే తీశానన్న సంగతి గుర్తొచ్చి ధైర్యం వచ్చింది

మరో అయిదు నిమిషాలు బారంగా గడిచి పోయాయి

ఇంక ఆగలేని మమతాదేవి మెల్లగా తలుపు మీద శబ్దం చేసింది అయినా చందన పలకలేదు

ఎందుకో ఆమెక్కంగారనిపించి తలుపు బాదింది

తలుపు లోపల గడియ లేనందున దడాల్ని తెరుచుకుంది

చందా! అంటూ గడప దాటి లోనికి వెళ్ళ బోయి రక్కున ఆగిపోయింది

ఆమె నోటి నించి దిక్కులు పిక్కటిల్లేలా బయంకరమైన అరుపు వెలువడింది

వెంటనే తెలివి తప్పి పడిపోయింది ఆమె పెట్టిన కేకక్కి దాస దాసీలంతా పరిగెత్తుకొచ్చారు

అంతే! వాళ్ళూ కొయ్యబారి పోయారు

స్నానశాలలో పైన వేలాడే దీపాల గుత్తికి చందన శవం వేలాడుతోంది

ఒంటి మీద లంగా రవిక మాత్రమే వున్నాయి

కట్టుకున్న చీరనే వురితాడుగా వుపయోగించుకుని తన ప్రియుని కోసం పూల మాల చేత పట్టుకుని స్వర్గద్వారం దగ్గరె నిల్చుని ఆహ్వానించడం కోసం ప్రియుని కన్నా ముందుగానే స్వర్గం చేరుకుంది చందన ఆత్మ

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

రోజూలాగే కొడుకుని చూడ్డానికొచ్చింది మాయ

నాన్నా! రసూ! అంటూ బావురుమంది

ఇంకా నీ కళ్ళలో నీళ్ళున్నాయమ్మా? బారంగా అన్నాడు రసన్

ఘోరం జరిగి పోయిందిరా దుఃఖాన్ని అపుకోవడానికి ప్రయత్నిస్తూ అంది మాయ

ఏం జరిగిందమ్మా?

మాయకి మాట రావడం లేదు ఎలా చెప్పాలా అన్నట్టు బయం బయంగా చూస్తోంది

ఏవిఁటమ్మా? నాకు వురి వేసే రోజు తెలిసిందా? నిర్విచారంగా అడిగాడు రసన్

ఊఁహూఁ

మరి?

ఆమెకేం చెప్పాలో అర్థం కావడం లేదు

రాకుమారి చచ్చి పోయిందంటే విని తట్టుకో గల శక్తి కొడుకులో వుందో లేదో అన్న బయం ఆమెగొంతుని అణిచేస్తోంది

చెప్పమ్మా! ఏం జరిగింది? మళ్ళీ అడిగాడు రసన్

ఎలా చెప్పాలో అర్థం కావడం లేదురా రసన్ ఏడుస్తూనే అంది మాయ

ఎరవాలేదమ్మా! చెప్పు! అదేలాంటి విషయమైనా నేను తట్టుకో గలను తల్లి బావాన్ని అర్థం చేసుకున్న రసన్ అన్నాడు

# రచయిత్రి జవాబులు



జె మోహనకృష్ణ మద్రాసు

ప్ర రచయిత్రిగారూ! సస్పెన్స్ అడ్వంచర్ లౌ క్రయిమ్ ఫేమిలీ సెంటి మెంట్స్ లాంటి అన్ని రకాల రచనలూ చేశారు ఇటీవల మీరు రాసిన నిశీధి అన్న నవల కూడా చదివాను సూపర్! మీరు కచ్చితంగా ఆల్‌రౌండర్ అంటాను ఇంత చక్కని రచనలు ఎలా చేస్తున్నారండీ?

జ అమ్మబాబోయ్! నన్ను మరీ ములగ చెట్టు ఎక్కించేస్తున్నారు మోహనకృష్ణగారూ! పడితే ప్రమాదం! అయినా మీ అబిమానానికి థాంక్స్ చెప్పుకుంటున్నాను నిజం చెప్పాలంటే ఇదంతా మీ అబిమానమేనండీ

సి అనసూయ ప్రొద్దుటూరు

ప్ర లంచగొండితనం రోగ ఆకలిపీడితులకు కుళ్ళు రాజకీయాలు ఇన్ని సమస్యలు దేశం నిండా వుండగా రచయి(త్రు)తలందరూ ప్రేమగురించే నవలలు రాస్తారేమండీ! పై సమస్యలపై రాసి పరిష్కారమార్గం చూపించచ్చుగా?

జ అందరూ అనకండి కొందరు మాత్రమే! అయినా ప్రతి రచనా సమస్యల తోరణంలా వుంటే మనసుని కాస్త సేదతీర్చేదెలా! అందుకే ప్రేమసాహిత్యం కూడా వుండాలి

హెచ్ ఆర్ వి రాజ్‌కుమార్ బళ్ళారి

ప్ర : రచయిత్రిగారూ! సమాజంలో మార్పురావాలి అనే వాళ్ళు ఏవిధమైన మార్పు రావాలో ఎలారావాలో చెప్పరెందుకని?

జ ఎందుకు చెప్పరు కాకపోతే అవి తలో రకంగా వుంటాయి

బి సుదర్శన్ భీమవరం

ప్ర సువర్ణా కన్నన్ గారూ సమాజం మారడానికి సాహిత్యం ఎంత వరకు వుపయోగపడుతుంది?

జ చదివించేంత వరకోమారడం అన్నది వారి వారి మనస్తత్వం మీద ఆధారపడి వుంటుంది

## ఉత్తమ ప్రశ్న

నందిగాం మురళీమోహన్, నరసన్నపేట

ప్ర సమాజంలో పేరుకు పోయిన అవినీతిని సాహిత్యంలో బట్ట బయలు చేసే రచయితలే అవినీతికి పాల్పడుతున్నారు వారిపై మీ అభిప్రాయం ఏమిటి!

జ ఒక్క రచయితలనే ఏమిటి మురళీ మోహన్‌గారూ! చాలా మంది అలాగే చేస్తున్నారు న్యాయం చెప్పే వాళ్ళు అన్యాయానికి పాల్పడుతూ, రక్షించే వాళ్ళు భక్షిస్తూ బతికించాల్సిన వాళ్ళు చంపేస్తూ ఇలా. కాక పోతే న్యాయం, నీతి, బాధ్యత లాంటివి ఇంకా కొంత మందిలో మిగిలి వున్నాయికాబట్టే ఇంకా ఈ లోకం ఈమాత్రంగానైనా వుంది

వై భాస్కరరావు అనకాపల్లి

ప్ర నేటి యువకులు అబిమానం పట్టలేక సినీనటుల కటౌట్లకి పాలాబిషేకం చేస్తున్నారు దీనివల్ల అమూల్యమైన పాలు వృధా అవుతున్నాయి అలాంటి వారికి మీరిచ్చే సందేశం ఏమిటి?

జ ఎవరి పిచ్చి వారికానందం! (ఎవరికీ సందేశం ఇచ్చేంతటి దాన్ని కాదునేను)

టి ఎన్ రాజు కావలి

ప్ర రచయిత్రిగారూ! కరిగిన శిల లోని రమణి పాత్ర ద్వారా యువతరానికి మీరిచ్చే సందేశం వార్షించతగ్గది వ్యసనాలకి బానిసలై మత్తులో మగ్గిపోతున్న యువతీ యువకుల దీనస్థితిని చూసి ఆర్ద్రమైన మీ మనస్తత్వం ఆరచనద్వారా వెల్లడయింది అలాగే అనుక్షణం పతనమై పోతున్న మన సమాజానికి రచనల ద్వారా కాకుండా వేరే ఎవిధంగానైనా సేవ చేస్తున్నారా? చెయ్యాలనుకుంటున్నారా?

జ : మీ అబిమానానికి కృతజ్ఞతలు ఇంట గెలిచి రచ్చ గెలవమన్నట్టు నాకుటుంబాన్ని ఆదర్శకుటుంబంగా తీర్చి దిద్దుతున్నాను కన్నవారు పక్కనున్నవారు జన్మ భూమి గర్వించేలాంటి ఇద్దరు కొడుకుల్ని కని ఒకర్ని ఇంజనియర్‌గా ఒకర్ని డాక్టర్‌గా మలచాను నా చుట్టూ వున్న సమాజానికి చేతనైన సహాయం చేస్తాను చాలదూ? □

రాకుమారి

ఊఁ! రాకుమారి? కళ్ళు చిట్లించాడు రసన్

రాకుమారి చచ్చిపోయిందిరా! గొల్లుమంది మాయ

అతను మౌనంగా వుండి పోయాడు

వూరికే కాదురా! వురి వేసుకుని మరీ చచ్చి పోయింది! పైట చెంగు నోట్లో కుక్కుకుంటూ అంది మాయ

అంతేనా? అదోలా నవ్వాడతను

బిత్తర పోయింది మాయ

కొడుక్కి మతి పోయిందేమో అనికూడా అనిపించింది

రసూ! నేను చెప్పింది విన్నావా సరిగ్గా? అంది అనుమానంగా

విన్నానమ్మా! రాకుమారి ఆత్మహత్య చేసుకుంది! అంతేనా?

మరింత నిర్ఘాంత పోయిందామె

రసూ! నీకు బాధగాలేదూ? అంది రాకుమారి చావుమాట వినగానే జుట్టు పీక్కుంటూ అరిచి గోల చేస్తాడనుకున్న కొడుకు అంతతాపీగా అంతేనా అంటుంటే ఆమెకి మతి పోయేలా వుంది

బాధెందుకమ్మా! రాకుమారి పోయిందే గానీ నా చందన నాదగ్గరే వుందిగా?' నవ్వాడతను

రసూ! ఎవ(యిం)రానీకు? అతని చేతుల్ని పట్టుకుని మరో సారి బావురు మంది మాయ

ఏం కాలేదమ్మా! నాకు ఇలా జరుగుతుందని ఎప్పుడో తెలుసు అవకాశం రాలేదు గాని వస్తే ఈ పని చందన ఎప్పుడో చేసేది రాకుమారిగా ఆమె పోయినా చందనగా నా గుండెల్లో శాశ్వతంగా వుండి పోతుంది ఈ మంజీరాలు చూడు రాజావారు దయతల్చి నాకిచ్చారు వీటిని చూస్తుంటే నా చందనని చూస్తున్నట్టే వుందమ్మా నాకు జేబులో దాచుకున్న చందన కాలి శిరి మువ్వల పదమంజీరాలు తీసి ఆప్యాయంగా చూసుకుంటూ అన్నాడు రసన్

అతని కళ్ళు నిండు తటాకాల్లా వున్నాయి

అయోమయంగా చూస్తూండి పోయింది మాయ

అమ్మా! ఇంతకీ అవి తెచ్చావా? గొంతు తగ్గించి అడిగాడతను ఓ సారి ఆమె అటు ఇటు చూసి కొంగుచాటున దాచుకున్న తాళ పత్రాలు తీసి—

ఇవిగో! తెచ్చాను అంతకన్న రహస్యంగా అతనికిచ్చింది

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

ఈ దీనగాధ చదివారుగా?

ఆదురదృష్ట జాతకుడైన రసన్‌ని నేనే అని మీరీపాటికి గ్రహించే వుంటారు నాకు శిక్ష వేసి చాలా రోజులయినా ఆ శిక్ష ఎప్పుడు అమలు పరుస్తారో

## మంజీరనాదం

తెలియదు.

రేపు కావచ్చు! ఎల్లుండి కావచ్చు!

మరో నెల తర్వాత కావచ్చు!

మేం పట్టుపడ్డ రోజునే మాకెన్ని శిక్షలు వేస్తారో మాకు తెలుసు మా ఆశలు నెరవేరకుండానే మాకు నూరేళ్ళూ నిండి పోయాయి

మాలో ఎవరం ముందు పోయినా వాళ్ళు రెండో వారి కోసం స్వర్గ ద్వారాల దగ్గర ఎదురు చూస్తూండాలి!

అవి మేం చేసుకున్న బాసలు!

ముందు నా చందన వెళ్ళి పోయింది

ఆమెలేని ఈ లోకం నాకు మరుభూమితో సమానం! అందుకే ఆమెని ఎంత తొందరగా చేరుకుంటానా అని ఆత్రంగా వుంది

నా చందన నాకోసం దారంతా పూలు పరచి కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూస్తూ వుంటుంది నేను వెళ్ళి పోవాలి

కానీ మా ఈ ప్రణయ కావ్యాన్ని నా చందన పెద్ద మనసుని నలుగురూ తెలుసుకోవాలి రాజావారు ప్రచారం చేసిన వన్నీ కేవలం కట్టు కతలు మాత్రమే అనీ నిజమైన కథ ఏమిటో మీ అందరికీ తెలియపరచాలనీ నా వుద్దేశం!

నా ఆశయం నెర వేరింది నేను కోరిన విధంగా నెరవేర్చడానికి రాజావారు అంగీకరించారు ఎక్కడున్నారో కోరిన మర్నాడే నా చందన కాలి అందియలు నాకందజేశారు పోయే టప్పుడు పోయాకా కూడా అవి నాతోనే వుంటాయి నాగుండె మీద నిద్ర పోతూ వుంటాయి

వాటిని చూస్తుంటే నా చందనని చూసినంత ఆనందంగా వుంది

నా కోరిక ప్రకారం మా వాళ్ళు రోజూ వస్తూండే వారు వాళ్ళతో మొదటి రోజునే కొన్ని తాళ పత్రాలు తెస్తూండమని కోరాను

ఎందుకు? అన్నారు ఆశ్చర్యంగా

నేను నా చరిత్రంతా ఏరోజు కారోజు కొస్త కొస్త రాసి మీకిస్తాను పూర్తయితే మొత్తం కాక పోతే రాయినంత వరకు జాగ్రత్త చేసి నా శవ పేటికలో భద్రపరచండి ఇదినా తుది కోరిక అన్నాను వాళ్ళు ఏడుస్తూనే అంగీకరించారు

అలా రోజూ కొన్ని పత్రాలు తెచ్చి రహస్యంగా ఇచ్చేవారు మర్నాడు రాసిన పత్రాలు తీసి కెళ్ళేవాళ్ళు

ఈ రోజుతో నేను రాసే నానిజజీవిత కథ ముగిసి పోయింది అయితే నా చరిత్ర ఎప్పుడు ముగుస్తుందో మాత్రం ఇంకా తెలియనే లేదు.

నాకిప్పుడు ఎంతో తృప్తిగా వుంది

నా చరిత్ర అమరం!

నా ప్రేమకి మరణం లేదు!

ఎన్ని తరాలయినా ఎన్ని యుగాలయినా ఏదో ఒకనాడు నా ఈకథ వెలుగులో కొస్తుంది

అదే నాకానందం!

నేను కోరినట్టుగా ఆశించినట్టుగా ఎవరైనా ఎప్పుడైనా నాశవం వున్న ప్రదేశంలో తవ్వితే నాకుటీరం నాశనం అయినా నేనున్న వుద్యానవనం నామరూపాల్లేకుండా పోయినా నేను పుట్టి పెరిగిన నగరం దూళిలో కలిసి పోయినా నా శవపేటిక మాత్రం చెక్కు చదరకుండా కనిపిస్తుంది అందులో నా శవం వుంటుంది ఆశవం గుండెల మీద చిన్నారి చందన పాదాలనలంకరించిన శిరిమువ్వలు మా కథల్ని మరోసారి చెప్తాయి

ఆశవాన్ని చూడండి విఫలమైన మా ప్రేమగాథని చదవండి జాలిగా రెండు కన్నీటి చుక్కలు విడవండి! అదే నా కోరిక! అదే నాశ్రమకి ప్రతిఫలం!

అదిగో! రాణా లో రెండు గంటలు కొట్టారు

సైనికులు ఇటికేసి రావచ్చు

గాఢ నిద్రలో వున్నా గంటకో సారి వచ్చి బందీల్ని చూసి వెళ్ళడం వాళ్ళ అలవాటు

ఈ చివరి పత్రాలు కూడా రేపు అమ్మ ద్వారా పంపేస్తాను హాయిగా వూపిరి తీసుకుంటాను

నాశవాన్ని అప్పచెప్పాక రాజలాంఛనాలతో పాటు ఓ దిండు నా తలకిందికి చేరుతుంది

అదే నా ప్రణయగాథ!

అదే ప్రేమకి మరణం లేదు అన్న పవిత్ర గ్రంథం!

ఇంక శలవు

దురదృష్ట జాతకుడు

రసన్!

పాలిభాషలో రసన్ అన్న యువకుడు రచించిన ప్రేమకి మరణం లేదు అన్న గ్రంథం చదవడం పూర్తి చేశాడు అరవింద్

(ఇంకా ఉంది)

## గడుసులోకం —బాబు






# రిమోట్ కంట్రోల్ దీనికి అసాధారణ విశిష్టత తెస్తుంది. అన్ని విధాలా!



దయనోరాకిమటుకే సాధ్యమైన ఎంతో కచ్చితమైన ఫైన్-ట్యూనింగ్ మీకోసం ఏర్పరచబడింది. నవీనమైన ఫ్రీక్వెన్సీ సింథసైజర్ సాంకేతిక విజ్ఞానం వినియోగించుకున్న రిమోట్ కంట్రోల్ యూనిట్ వలన ఎన్నో ప్రయోజనాలు. స్టేషన్‌ని దానంతట అదే కనుక్కోవడం. సరియైన రంగు; తారతమ్యం, ప్రకాశం మరియు శబ్దం స్థాయి నిర్ణయించడానికి LED డిస్ప్లే సహాయపడుతుంది. తిన్నగా, వెనువెంటనే కార్యక్రమాలు మరియు చానల్ నిర్ణయిస్తుంది. కార్యక్రమాలు సేకరించి వుంచుతుంది. అవసరమయితే శబ్దాన్ని తగ్గించవచ్చు స్టాండ్-బై ద్వారా తాత్కాలికంగా నిలిపి వేయవచ్చు. మరియు 6 నిమిషాలలో ఏ స్టేషనూ రాకపోతే ఆటోమాటిక్‌గా స్టాండ్-బైకి మారుతుంది. మరియు ఎలక్ట్రానిక్ లాకింగ్ విధానం.

అతి నవీనమైన రిమోట్ కంట్రోల్‌తో సరితూగే అతి నవీనమైన పిక్చర్ ట్యూబ్-జౌను, బ్లాక్ స్ట్రయిప్, స్పష్టమైన చిత్రాలకి మరియు అంతరాయం కలగకుండా చూడడానికి ఆటోమాటిక్ ఫైన్ ట్యూనర్ మరియు ఆటో డిగాస్సింగ్ యూనిట్, ఆడియో/వీడియో ఇన్‌పుట్ మరియు ఔట్‌పుట్ సదుపాయం, 2-వైపుల స్పీకర్ విధానంతో స్పష్టమైన శబ్దం హెడ్‌ఫోన్ సదుపాయంకూడా.

దయనోరా CT-R 242 ని స్వయంగా సరిచూసుకోండి. నేడే.

# దయనోరా

Dyanora ®

CT-R 242 Mark I కలర్ టివి

HTA 7026 R

కొత్త శీర్షిక ప్రారంభం!

# షేర్ మార్కెట్లో పెట్టుబడులు – పెద్దంత డబ్బుకి సోపానాలు



యన్. రాంజీ
న్యూఢిల్లీ

షేర్ మార్కెట్లు అంటే ఒక పెద్ద జూదం అనే అపోహ ఇది బాగా డబ్బున్న వారికే పరిమితం అనే అపోహ కూడా మనలో చాలా మందికి ఇప్పటికీ చాలా బలంగా నాటుకొని వుండటానికి కారణం ఈ మార్కెట్ మీద సరైన అవగాహన లేకపోవటమే ఇది ముమ్మాటికి జూదశాల కాదు ఎలాగంటే జూదంలో ఒక్క వ్యక్తి గెలిచి మిగతా అందరు పోగొట్టు కొంటారు కానీ దీనిలో ప్రతివారు కొంత మేర సంపాదించు కోవటానికి చక్కని అవకాశం ఇస్తుంది ఈ మార్కెట్ అలాగే కొంత పరిమిత నష్టంతో బయట పడటానికి కూడా అవకాశం ఇస్తుంది నష్టం పోగా మిగిలిన దానితో ఇంకొక పెరుగుతున్న కంపెనీ షేర్ కొని ఆ నష్టాన్ని బర్తీ చేసుకోవ టానికి కొద్ది పాటీ లాబాలు సంపాదించు కోవటానికి అవకాశం వుంటుంది ఇటువంటి చక్కని అవకాశం మరి ఎక్కడా వుండదు ఈ శీర్షిక పూర్తిగా చదివిన తరువాత కొద్ది కాలంలో మీ పరిమిత ఎట్టుబడులతో లక్షలు సంపాదించటం ఎంత సులువో మీకు కూడా తెలుస్తుంది ముందు ముందు ఈ మార్కెట్లో జూదానికి కాదు మానవుని మేదస్సుకు మాత్రమే గుర్తింపు వుంటుంది అనేది మీరూ గమనిస్తారు ఈ మార్కెట్ మీద వున్న అపోహలను పోగొట్టి పాఠకులందరికి ఈ మార్కెట్లో వున్న లాబాలను పంచాలి అనే నా ఈ చిన్ని ప్రయత్నానికి మీరు పూర్తి ప్రోత్సాహాన్ని ఇస్తారని నమ్ముతూ అతి సామాన్యుడు కూడా ఈ పారిశ్రామిక పెట్టుబడులలో అంటే షేర్ల ద్వారా లాబార్జన చేస్తూ దేశ పురోబివృద్ధికి కూడా మన వంతు కర్తవ్యం నిర్వర్తించాలని నా అబిలాష

ఇక్కడ అనుకోని ఒక అద్భుత వాస్తవాన్ని గమనించండి మొట్ట మొదటి సారిగా (1542 ప్రాంతంలో) రూపాయి నాణేన్ని ముద్రించిన అతని పేరు షేర్ షా (షేర్ + షా) ఎహుశా రాబోయే తరాలలో షేర్లలో పెట్టుబడి ఒక ముఖ్యపాత్ర వహాస్తుంది అని ఆ కన్న తల్లి తండ్రులకు ముందే తెలిసి ఈ పేరు అతనికి పెట్టారేమో!

షుమారు 1976 వరకు అంటే విమల్ కంపెనీ వారు తమ వాటాలను ప్రజలకు పంచక ముందు వరకు 90 శాతము ఈ మార్కెట్ మీద గుత్తాదిపత్యం మార్వాడీల కబంద హస్తాలలో వుండేది కాని విమల్ కంపెనీ అదినేత శ్రీదరుభాయి అంబానీ చలువ వలన ఇది సామాన్య మానవులకు అందుబాటులోకి వచ్చింది ఈ మార్కెట్లో లాబాలు సామాన్య ప్రజలు పంచుకోవ టానికి వుత్సాహ పరిచిన ఘనత కూడా ఈయనకే దక్కుతుంది

షుమారు 110 సం క్రితం నుంచి షేర్ మార్కెట్లు మన దేశంలో వుండి కూడా ఈ మార్కెట్లోని లాభాలు ప్రజలకు తెలియక పోవటానికి కారణం ఈ వ్యాపార లావాదేవీలను ఇతరులకు తెలియకుండా ఇంత కట్టు దిట్టంగా బద్రపరచ కల్గిన మార్వాడీల శేఠ్‌రి తనానికి నిజంగా జోహార్లు అర్పించక తప్పదు

మనం నిత్యం ఎంతో శ్రమపడి సంపాదించిన నెల జీతము కాని వ్యాపార వ్యవసాయ అదాయాలు కానీండి మన అవసరాలకు ఖర్చు పెడుతూ ఎన్నో వందల కంపెనీల వారిని రోజు రోజుకు మరింత దనవంతులుగా మారుస్తూ మనం మాత్రం ఎక్కడ వేసిన గొంగళి మాదిరిగానే వుంటున్నాము ఇది మీకు ఆశ్చర్యంగా వుందా? చూడండి మనం వుదయం లేవగానే మన పళ్ళు శుభ్రపరుచు కోవటానికి వాడే టూత్ పేస్ట్ కోల్‌గేట్ పోర్‌హాన్స్ బినాకా లాంటి పెద్ద పెద్ద కంపెనీలవి కాదు మేము పళ్ళ పొడి వాడుతాం అంటే నంజన్‌గూడు లాంటి కంపెనీలవి ఆ తరువాత మనం తీసుకొనే కాఫీ కాని టీ కాని బ్రూక్ బాండ్ లిప్టన్ వంటి కంపెనీలవి అటు పిమ్మట మన స్నానంలో వాడే సబ్బులు హిందూస్తాన్ లీవర్ పాండ్స్ మొదలైన కంపెనీలవి అలాగే మనం వాడే బట్టలు రేమాండ్స్ విమల్ మొదలైన కంపెనీలవి మనం వాడే వాహనాలు సైకిల్ ఐతే అట్లాస్ కంపెనీకి చెందినది స్కూటర్ ఐతే బజాజ్ లోహియా అదే కారు ఐతే హిందూస్తాన్ మోటార్స్ ప్రీమియర్ ఆటో కంపెనీలవి కాదు మేము బస్సులో మాత్రమే ప్రయాణిస్తున్నాం అంటే ఆ బస్సు కూడా అశోక్ లేలాండ్ టిల్కో లాంటి కంపెనీలకు చెందినవి ఇలా వ్రాసుకుంటూ పోతే లిప్‌స్టిక్‌లు గ్రైండర్‌లు టి వి లు ఫ్రిజ్‌లు ఎన్నెన్నో రాత్రి పడుకొనే ముందు మనం ఆపే లైట్స్ కూడా బజాజ్ మైసూర్ లాంప్ లాంటి కంపెనీలవి సుమా చూశారా మనకు తెలియకుండా మనం ఎన్ని పెద్ద పెద్ద కంపెనీలను బాగు పరుస్తున్నామో ఇంతంత లాబాలు మనం



జె ఆర్ డి టాటా



ఆర్ పి గోయంకా



నస్లి వాడియా



అంబానీ

# దేశంలోని అతి సంపన్న పారిశ్రామిక గృహాలు

1985 ఆర్థిక సంవత్సరానికి సంబంధించిన గణాంకాల ప్రకారం దేశంలోని అతి సంపన్నమైనటువంటి 19 పారిశ్రామిక గృహాల ఆస్తులను పన్ను విధించడానికి ముందరి లాభాలను నవంబర్ 10వ తేదీన పరిశ్రమలశాఖ సహాయ మంత్రి శ్రీ ఎం అరుణాచలం లోక్‌సభ ముందుంచారు ఆ జాబితాను ఈకింద ఇస్తున్నాము –సం

| | పారిశ్రామిక గృహం పేరు | మొత్తం ఆస్తులు (కోట్ల రూపాయలలో) | పన్ను విధించడానికి ముందు లాభం (కోట్ల రూపాయలలో) |
|---|---|---|---|
| 1 | బిర్లా | 4111 55 | 154 00 |
| 2 | టాటా | 3680 84 | 251 83 |
| 3 | థాపర్ | 1067 86 | 22 15 |
| 4 | జె కె సింఘానియా | 1057 03 | 19 09 |
| 5 | రిలయన్స్ | 1056 03 | 71 62 |
| 6 | మఫత్‌లాల్ | 964 60 | 45 02 |
| 7 | మోడీ | 818 86 | 19 28 |
| 8 | ఎం ఎ చిదంబరం | 773 27 | 44 09 |
| 9 | లార్సెన్ అండ్ టూబ్రో | 714 93 | 40 70 |
| 10 | బంగూర్ | 650 87 | 8 07 |
| 11 | బజాజ్ | 619 87 | 41 11 |
| 12 | వాల్‌చంద్ | 607 18 | 22 12 |
| 13 | శ్రీరామ్ | 541 78 | 12 39 |
| 14 | టి వి ఎస్ అయ్యంగార్ | 519 30 | 31 00 |
| 15 | ఐ సి ఐ | 446 96 | 32 80 |
| 16 | సారాభాయి | 444 83 | –14 72 (నష్టం) |
| 17 | హిందూస్తాన్ లివర్ | 435 96 | 62 43 |
| 18 | కిర్లోస్కర్ | 433 01 | 22 05 |
| 19 | మహీంద్రా అండ్ మహీంద్రా | 431 19 | 19 64 |

వాటికి చేకూర్చుతూ మనం ఆ లాభాలలో భాగం పంచుకోక పోవటం మనకి భావ్యంగా వుంటుందా చెప్పండి? భావ్యంగా వుండదు కాబట్టి మనం కూడా ఆ లాభాలలో పాలు పంచుకోవాలంటె ఆ కంపెనీల షేర్లు మనం కొనుక్కున్న నాడే మనం ఆ లాభాలలో వాటా పంచుకో గల్గుతాము

1976 ప్రాంతంలో ఈ షేర్ మార్కెట్లు గూర్చి అవగాహన వున్న వ్యక్తి ఒక 1700 రూపాయలతో కోల్‌గేట్ కంపెనీలో పెట్టిన పెట్టుబడి ఒక 10 సం లలో ఎంత అయ్యిందో గమనిస్తే చాలా ఆశ్చర్యంగా నమ్మశక్యం గాకుండా వుంటుంది ఆ మొత్తం ఒక లక్షా డెభై ఆరు వేలు అయ్యింది ఎలాగంటే ఆ కంపెనీ వారు వరుసగా ఇచ్చిన 11 బోనస్ షేర్లు వరసగా వంద రెండు వందల షేర్లుగా మారగా ఆ రెండు వందలు నాలుగు వందల షేర్లుగా తరువాత అవి ఎనిమిది వందల షేర్లుగా మారి ఈ రోజు మార్కెట్ రేటు రు 220 చొ అమ్మితే వచ్చిందే సుమా! ఇది ఆ కంపెనీ వారు ప్రతి సంవత్సరం ఇచ్చిన డివిడెండ్ మినహాయించి చెప్పినది మాత్రమే

మీకు ఒక సందేహం రావచ్చు అయ్యా! మీరు అన్నీ లాభాలు గూర్చే ఎవరిస్తున్నారు మాకు తెలిసిన వారు ఈ వెదవ మార్కెట్‌లో ఎంతో డబ్బు పోగొట్టుకున్నారు దానికి మీ సమాధానం ఏమిటి? అని నాణేనికి బొమ్మా బరుసు వున్నట్టుగానే ఇది కూడా గమనించ దగ్గ విషయమే ఇది ముమ్మాటికి ఖండించ దగ్గ విషయం ఎందుకంటే పరిమితికి మించి స్పెక్యులేషన్ చేసేవారు మాత్రమే ఈ మార్కెట్‌లో నష్టాల ఊబిలో ఇరుక్కుంటారు మిగిలిన వారు కంపెనీల మంచి చెడ్డలు గమనించి



మనూ చట్రియా

పబ్లిక్ ఇష్యూల ద్వారా వాటాలను సంపాదించిన వారు ఎన్నటికి నష్టపోరు నష్టాల గూర్చి ఒక చిన్న వాస్తవాన్ని మీకు వివరిస్తాను

ఒక రోజు నేను మా మెయిన్ బ్రోకర్ ఇద్దరం కలిసి కారులో స్టాక్ ఎక్స్‌ఛేంజ్ నుంచి కన్నాట్ ప్లేస్ అనే ప్రదేశానికి వెళ్తున్నాం దారి మధ్యలో ఒక చోట రెడ్ లైట్ సిగ్నల్ వుండటం మూలంగా మా కారు ఆగవలసి వచ్చింది. మిగతా అన్ని పట్టణాలలో లాగ మీకు ఢిల్లీలో ముష్టి వాళ్ళ బాధ వుండదు కారణం మనం వేసే 10– 15 పైసలు దానం తీసుకోవటానికి వారికి నామోషీ అందుమూలాన వాళ్ళు విదేశీయులనే ఎక్కువగా బాదిస్తుంటారు మా ప్రక్కన కారులో ఒక ఫారినర్ వుండటం మూలంగా ఒక బిక్షగాడు అతన్ని యాచిస్తున్నాడు మా మెయిన్ బ్రోకర్‌కి ఎందుకో అటు వైపు దృష్టి మళ్ళి ఆ బిక్షగాడిని చూసి గబాలున కారు దిగి ఒక వంద రూపాయల నోటుని ఆ బిక్షగాడికి ఇచ్చి వెంటనే కారులోకి వచ్చి కూర్చున్నాడు హఠాత్తుగా జరిగిన ఈ సంఘటనకు నేను ఆశ్చర్యం నుంచి తేరుకోవటానికి పది నిముషాలు పట్టింది తేరుకున్న వెంటనే మా బ్రోకర్‌ని అడిగాను నువ్వు ఒక బిక్షగాడికి ఒక వంద రూపాయలు దానం చేయటం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది అన్నాను

అతను చిన్నగా నవ్వి వెంటనే ఒక గాఢమైన నిట్టూర్పు విడిచి ఇలా చెప్పాడు ఒకప్పుడు అతడు నా క్లయింట్ మొదట వచ్చిన కొన్ని లాభాలతో తనకు ఈ మార్కెట్ గూర్చి పూర్తిగా తెలుసు అన్న గర్వంతో శక్తికి మించి స్పెక్యులేషన్ చేయటం వలన అతనికి ఈ రోజు ఈ స్థితి పట్టింది అన్నాడు చాలా బాధపడ్డాడు

(మీకు స్పెక్యులేషన్ పబ్లిక్ ఇష్యూలని గూర్చి ముందు ముందు వివరించటం జరుగు తుంది అంత వరకు ఈ పేర్లను గుర్తుంచు కొండి)

కాబట్టి ఇటువంటి ఉదాహరణలు వాస్తవంగా వున్నాయి కాబట్టి నా ఈ వ్యాసాల సంపుటి పూర్తి ఐన తరువాత మాత్రమే ఈ మార్కెట్ లోకి ప్రవేశించండి లేకుంటే నాకు ముందు ముందు 100 రూపాయిల ఖర్చు సుమా!

మీకు ఒక అవగాహన వచ్చేవరకు అంటె మీకు గో ఎ హెడ్ అనే సిగ్నల్ ఇచ్చేవరకు మీ పెట్టుబడులకు ఈ మార్కెట్‌లో ప్రవేశానికి మా తరుపు నుండి రెడ్ లైట్ అన్న మాట మరి నాకు కూడా ఎడిటర్ గారు రెడ్ లైట్ చూపు తున్నారు కాబట్టి తాత్కాలికంగా ఈ వారానికి నేను కూడా స్టాప్ అన్న మాట వచ్చే వారం మళ్ళీ ఇదే కాలమ్‌లో కలుద్దాం ☐

# వ్యక్తిగతం

## వీడియో పత్రిక స్థాపకుడు ఏకనాథ్

దక్షిణాది నుంచి విదేశాలకు వెళ్ళిన వాళ్ళకు స్వదేశ సంస్కృతి గురించి, పరిణామాల గురించి తెలియజేసే అపూర్వ కృషిని చేపట్టి 'వీడియో లక్షాధిపతి'గా కీర్తిని, ధనాన్నీ గడించారు శ్రీ ఎస్. ఏకనాథ్. మద్రాసు ఫిల్మ్



ఇన్‌స్టిట్యూట్‌లో పట్టా పుచ్చుకున్న తర్వాత ఈయన ఈ కృషి ప్రారంభించారు విదేశాలలో ఉన్న యాభై లక్షల మంది దక్షిణాది ప్రజలకు ఆయన తన వీడియో కేసెట్లతో స్వదేశాన్ని సందర్శింపజేస్తున్నారు తాజా సినిమా కబుర్లు రాజకీయ పరిణామాలు, వంటలు అలంకరణ వంటి అనేక విషయాలకు ఈ కేసెట్లలో స్థానం ఉంది సమాచార ప్రసార మంత్రిత్వ శాఖ నుంచి యంత్ర సామగ్రి సంపాదించి నిర్మించిన ఈ కేసెట్ పత్రిక మూడు సంచికలను ఐదు వేల కాపీల చొప్పున ఆయన అమ్మారు ఒక్కొక్క కేసెట్ వెల రు 190

## ఎయిడ్స్ పేరు చెప్పి తప్పించుకున్న శిక్ష!

భయంకర వ్యాధి ఎయిడ్స్ కూడా ఒక్కొక్కసారి కొందరికి ఉపయోగకారి కావచ్చునని రుజువు చేసింది 25 ఏళ్ళ రీటా కలాని రింద్రి ఇటలీకి చెందిన ఈ యువతిని గత ఏప్రిల్‌లో కోవలమ్‌లో మాదక ద్రవ్యాలు అమ్ముతున్నదనే అభియోగంపై అరెస్టు చేశారు. కేసు విచారణలో ఉండగా ఆమెను త్రివేంద్రం సెంట్రల్ జైలుకు పంపించారు. ఈలోగా ఆమె తనకు ఎయిడ్స్ వ్యాధి ఉన్నదని చెప్పటంతో అనుమానం కలిగి వెల్లూరు, ఢిల్లీలలో పరిశోధనలు జరపగా ఆ అనుమానం నిజమేనని తేలింది. దానితో ఆమెపై అభియోగాన్ని ఉపసంహరించుకొని, ఇటలీకి పంపించి వేయాలని దేశీయాంగ శాఖ కార్యదర్శి ఆదేశించారు. ఆరు నెలల జైలు జీవితం తర్వాత ఆమె విడుదలయింది. ఆమెకు ఎయిడ్స్ ఉన్నదనేది నిజమా కాదా అనే అనుమానం కొందరికి ఉన్నది. ఎందుకంటే ఈ కేసులో ఆమెకు 20 సంవత్సరాల కఠిన కారాగారశిక్ష పడి ఉండేది. ఆమె ఇటలీలో అత్యున్నత స్థాయిలో



ఉన్న ప్రముఖునికి సన్నిహిత బంధువట

## అసమ్మతి వాదులను చీల్చడమెట్లా?

ఈ ప్రశ్నకు కర్ణాటక ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణ హెగ్డే చెప్పడానికి ప్రయత్నిస్తున్న జవాబు ప్రయోజనకరంగా ఉంటుందేమో! కర్ణాటక



జనతా లెజిస్లేచర్ పార్టీలో అసమ్మతి వాదులను బలహీన పరచడానికి, అదే, సమయంలో రాష్ట్ర పార్టీ అధ్యక్షుని ఎన్నికలో వారి సహాయం పొందడానికి ఆయన యుక్తి పన్నుతున్నారు. మొదట వారందరినీ ఒక బృందంగా అక్టోబర్ 7న కలుసుకున్న శ్రీ హెగ్డే సంభాషణలు ముగియక ముందే తనకు పని ఉందని, అసమ్మతివాదులందరూ రాలేదు గదా అని వెళ్ళిపోయారు. అక్టోబర్ 13న మళ్లీ సమావేశం ఏర్పాటు చేసి ఆయనే ఎగ్గొట్టారు. ఇప్పుడేమో, అసలు అసమ్మతి వాదుల బృందాన్ని తాను గుర్తించనని విడివిడిగా ఎవరికైనా అసమ్మతి ఉంటే మాట్లాడతానని సన్నిహితులతో చెపుతున్నారు....

## జూడోలో బ్లాక్ బెల్ట్ సాధించిన 90 ఏళ్ల ముదివగ్గు, 4 ఏళ్ళ పసిపాప!

అమెరికాకు చెందిన దామ్సన్ అనే తొంభై సంవత్సరాల అవ్వ జూడోలో బ్లాక్ బెల్ట్ సంపాదించి గిన్నిస్ ప్రపంచ రికార్డులలోకి ఎక్కింది ఇల్లినాయి రాష్ట్రంలోని డాన్ విల్లే నివాసి అయిన ఈమె 1897లో జన్మించింది ఇంత పెద్ద వయసులో బ్లాక్ బెల్ట్ సంపాదించిన ఘనత దామ్సన్‌కు దక్కితే నాలుగేళ్ల ప్రాయంలోనే జూడోలో బ్లాక్ బెల్ట్ కొట్టేసి గిన్నిస్ బుక్‌లోకి ఎక్కిన ఘనత కెనడాకు చెందిన ఎయర్ నెల్సా అనే బాలికకి దక్కింది

## రాజకీయ ఘర్షణల్లో ఆత్మహత్య!

మాజీ ప్రధాని కీ శే శ్రీ చరణ్‌సింగ్ కూతురు ఉత్తర ప్రదేశ్ లోక్‌దళ్ రాష్ట్ర కార్యదర్శి శాసన సభ్యురాలు శ్రీమతి సరోజ్‌వర్మ అక్టోబర్ 26న లక్నోలోని స్వగృహంలో ఉరివేసుకుని చనిపోయారు చిన్ననాటి నుంచి తండ్రికి ముద్దుల కూతురిగా పెరిగిన సరోజ్ కోరిన కోర్కెలన్నీ నెరవేరడంతో కాంక్షాపరురాలిగా తయారయింది.



ఆమె కులాంతర వివాహానికి కూడా చరణ్‌సింగ్ అంగీకరించారు. 1977 నుంచి క్రియాశీల రాజకీయాలలో ఉన్న శ్రీమతి సరోజ్‌కు తమ్ముడు అజిత్‌సింగ్ తండ్రి స్థానాన్ని ఆక్రమించడం అంత రుచించలేదు అంతేగాక అజిత్‌సింగ్ సరోజ్‌ల మధ్య పార్టీపై అధికారం విషయంలో ఎన్నో విబేధాలు తలెత్తాయి కుటుంబ జీవితంలో పూర్తి సంతృప్తిని అనుభవించే సరోజ్ ఆత్మహత్యకు ఈ రాజకీయ ఘర్షణలే కారణమై ఉంటాయని పరిశీలకులు అభిప్రాయ పడుతున్నారు □

# కన్న కలలు ఫలించాయి.

పైలట్! పైలట్ కావలనే మావాడు ఎప్పుడూ కలకనేవాడు. చిన్నతనంలో ఎప్పుడు మాట్లాడినా సరే దాని గురించే చెబుతూ ఉండేవాడు. మంచి బలంగా, ఆరోగ్యంగా, దారుఢ్యంగా పెరిగి పెద్దయ్యేందుకు రోజుకి రెండుసార్లు హార్లిక్స్ తాగమని వాడికి చెప్పేదాన్ని, నాకు జ్ఞాపకం ఉంది.

ఇప్పుడు అవన్నీ నిజం అయ్యాయి. రోజుకి రెండుసార్లు హార్లిక్స్ తాగడం వాడికి అలవాటు చేశాం. నాకు ఎంతో సంతోషంగా ఉంది. ఇన్నేళ్ళు కూడా అదే వాడిని ఆదుకుంది!



పెరిగే పిల్లలకు చాలా మంచిది.

మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు వన్నె గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికర మైన పానీయం. పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్ముతారు. 100 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముకున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?




మంచి పుష్టికరమైనది

HMM-9240.TEL

సీరియల్

# రేపటి మహిళ

## సి. ఆనందారామం

(గత సంచిక తరువాయి)

మహావీర్ ప్రెస్‌కి పంపడానికి ఆర్టికల్ తయారు చేసాడు జర్నలిజం కూడా ఒక ఆర్ట్ క్లుప్తంగా ప్రధానమైన అంశాలన్నీ కవరయ్యే లాగ ఆసక్తి కలిగించే లాగ ఉండాలి వ్యాసమే అయినా కదనం కథా ధోరణిలో సాగాలి ఈ కళలో మహావీర్ మంచి నిపుణుడు అందుకే అతని వ్యాసాలకి పత్రికా ప్రపంచంలో గిరాకీ యెక్కువ

ఆంధ్ర రాజధానీ నగరంలో కుసాయిగుడా ప్రాంతంలో విసిరేసినట్లుగా వున్న ఒక బంగళా ఆ బంగళాలో కొన్ని చీకటి గదులు ఆ గదుల్లోంచి ఏవో దీనంగా ఆర్తరావాలు వినిపిస్తున్నాయి అలా మొదలు పెట్టాడు వ్యాసం కలం చక చక పరుగులు తీసింది కావలసిన ఫోటోలన్నీ ఎక్కడెక్కడ ఏది ప్రచురించాలో మార్కు చేసి వ్యాసంతో పాటు క్లిప్ చేసి సంతృప్తిగా చూసుకున్నాడు వీధి తలుపు దగ్గిర ఏదో సవ్వడైనట్లు తోచింది ఇలాంటి విషయంలో అతడు చాలా అలర్ట్‌గా వుంటాడు ఎందుకంటె ఈ ప్రజాస్వామ్య దేశంలో జర్నలిస్టులకే మాత్రం భద్రత లేదు జర్నలిస్టుల భార్యల్ని రేప్ చెయ్యడాలు జర్నలిస్టుల్ని హత్యలు చెయ్యడాలు చిత్రహింసలు పెట్టడాలు – ఏదో ఒక నేరం ఆరోపించి జైల్లో పెట్టడాలు సర్వసాధారణమై పోయింది ఇటీవల ఫోటోలు తీయడానికొచ్చిన జర్నలిస్టుల్ని బాధ్యత గల ఉద్యోగస్థులు చావ చితక బాది వదిలి పెట్టారట అంచేత ప్రతీక్షణం తన జాగ్రత్తలో తనుండడం అలవాటు చేసుకున్నాడు మహావీర్ పైగా ఎవరికీ దొరకని రహస్యాలు సేకరించి సెన్సేషనల్ వార్తలు ప్రచురించడంలో పేరు పొందాడు కాబట్టి చాలా మందికి అతని మీద గుఱ్ఱుగా వుంది జర్నలిజం కూడా ఒక వ్యసనమేనేమో? ఒకసారి ఈ రంగంలోకి దిగాక ప్రాణాలని కూడా లక్ష్యపెట్టకుండా విషయాలని సేకరించాలనిపిస్తుంది

లేచి ఫ్రెంట్ డోర్ వెనక పక్కకి నిలబడి వ్యూ మిర్రర్‌లోంచి చూసాడు ముగ్గురు మనుష్యులు స్క్రూడ్రైవర్లతో కీ హోమ్ ఓపెన్ చెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు రోడ్డు మీద పార్క్ చేసిన కారు ముందు రాజభూషణం నిలబడి బోనెట్ ఎత్తి పట్టుకుని ఏదో రిపేర్ చేస్తున్నట్టు నటిస్తున్నాడు జరుగుతున్నదేమిటో క్షణంలో గ్రహించాడు మహావీర్ ఫ్లెమింగ్ లేబ్‌లో జరిగిందేమిటో రాజభూషణానికి తెలిసిపోయుంటుంది సహజంగానే అతడు

> **జరిగిన కథ – 16** మిస్టర్ అండ్ మిసెస్ భాగవతార్ పేరు మీద ఒక అత్యాధునిక పార్టీ ఏర్పాటు చేసి మృదుల ఫ్లెమింగ్‌ను దేవికను అక్కడికి వెళ్ళేలా చేస్తుంది ఆ సమయంలో మహావీర్ డాక్టర్ సౌగంధిలతో కలిసి ఫ్లెమింగ్ లాబ్ రహస్యాలు కనిపెడుతుంది ఈలోగా పార్టీలో గందరగోళం జరిగి పోలీసులు ఫ్లెమింగ్‌ను అరెస్టు చేస్తారు ఎయిర్‌పోర్ట్‌లో సౌగంధికి సెండాఫ్ ఇచ్చి తిరిగి వేస్తున్న మృదుల రాజభూషణం మనుషుల చేజిక్కుతుంది

విషయం ప్రెస్ కెళ్ళకుండా జాగ్రత్త పడడానికి శతవిధాల ప్రయత్నిస్తాడు తరువాత మృదులని అటాక్ చేసినా ఆశ్చర్య పడక్కర లేదు ఇప్పటికే ఆ ప్రయత్నంలో వున్నాడేమో? ఏం చెయ్యాలో ఆలోచించాడు మహావీర్ ఫోన్ చేసి పోలీసులకి ఇన్ఫార్మ్ చెయ్యొచ్చు కాని ప్రజాస్వామ్య పోలీసు స్టేషన్ నుంచి పోలీసు అధికారులొచ్చి ఆదుకునేసరికి అణ్యకాలం మించిపోతుంది అది తక్షణ కర్తవ్యం కాదు మొదట అక్కణ్ణుంచి బయట పడాలి మహావీర్ ఆలోచనలో ఉండగానే బయట తలుపు లాక్ విరిగిన చప్పుడు వినిపించింది క్షణం ఆలస్యం చెయ్యకుండా మెట్ల వేపు పరుగెత్తాడు మహావీర్ ఇలాంటి సందర్భాలలో ఎలా తప్పించుకోవాలో అతడు ముందుగానే ఆలోచించుకున్నాడు మెట్ల మీదుగా డాబా పైకి యెక్కేసాడు అవి హౌసింగ్ బోర్డ్ ఇళ్ళు కింద కొంచెం కాంపౌండ్ వొదిలినా పైన టెర్రేస్‌లు మాత్రం ఒకదానికొకటి ఆనుకునుంటాయి ఎట్ట గోడ మాత్రమే వేరు చేస్తుంది వాటిని పిట్టగోడ దాటుకుంటూ ఒక టెర్రేస్ మీంచి మరొక టెర్రేస్ మీదికి చేరుకుంటూ సందు చివరికి వెళ్ళిపోయాడు చివరి ఇంట్లోంచి మెట్ల మీదుగానే క్రిందకు దిగి దొడ్డి తలుపు తీసుకుని బయటపడ్డాడు కొంచెం దూరం నడిచి ఇంటి గోడ వెనక నిలబడి దూరంగా వున్న తన ఇంటి వేపు చూసాడు కారు బోనెట్ ముందు రాజభూషణం లేడు తలుపులు తెరుచుకున్నాయన్న మాట వాళ్ళంతా లోపలికి ప్రవేశించి ఉంటారు తను సరిగ్గా సమయానికి తప్పుకున్నాడన్నమాట వ్యాసం రాసిన కవరు ఫోటోలు తనతో తెచ్చుకోనందుకు కొంచెం నొచ్చుకున్నాడు ఫరవాలేదు ఇంకో సెట్ ఫోటోస్ నెగెటివ్స్ సౌగంధి దగ్గరున్నాయి ఎటొచ్చి ప్రచురణ కాస్త ఆలస్యమౌతుంది మృదుల సోమనాథ్ ప్రైవేట్ డిటెక్టివ్ ఏజన్సీస్ ఆఫీసుకు రాగానే లాయర్ యశోధరాదేవి గారికి ఫోన్ చేయించాలి మరో సందులోంచి కొంత దూరం నడిచి ఆటో ఎంగేజ్ చేసుకుని సోమనాద్ డిటెక్టివ్ ఏజన్సీస్ ఎడ్రస్ చెప్పాడు మహావీర్

★ ★ ★ ★

లాకప్ రూమ్‌లో ఫ్లెమింగ్ చేత నిజం కక్కించడానికి పోలీసులు పెద్దగా శ్రమపడవలసిన అవసరం లేకపోయింది అమెరికన్ జైల్లో అతనికి బాగా బ్రెయిన్ వాష్ అయిపోయింది తన ప్రయోగాలు కొనసాగించే సమయంలోనే అతడు జర్మనీలోనే కైసర్ విల్‌హెల్మ్ ఇన్‌స్టిట్యూట్ లో కెమిస్ట్రీ ఆఫ్ బ్రెయిన్ గురించి స్టడీ చెయ్యడానికి వెళ్ళాడు రహస్యంగా సాగే అతని ప్రయోగాలు జర్మనీకి రాకపోకలు ఇవన్నీ అమెరికన్ సి ఐ బి కి అనుమానం కలిగించాయి సడన్‌గా అతని లేబ్ మీద రైడ్ చేసారు విషయం బయట పడింది కాని అతను చేస్తున్న ప్రయోగాలు దేనికోసమో అర్ధం కాలేదు అరెస్ట్ చేసి మానసికంగాను శారీరకంగానూ చిత్రహింసలు పెట్టి ఆధునిక పద్ధతులన్నీ ఉపయోగించి బ్రెయిన్ వాష్ చేసి నిజం కక్కించడానికి ప్రయత్నించారు చివరికి అతడు చేస్తున్న ప్రయోగాలు

అమానుషమైనవైనా అతడికి రాజకీయాలతో సంబంధం లేదని నిర్ధారించుకుని డాక్టర్ డిగ్రీ రద్దు చేసి ఇహ ముందు ఎలాంటి ప్రయోగాలు చెయ్యడానికి వీల్లేదని ఆంక్ష విధించి ఫైన్ వేసి వొదిలేసారు అతడు విడుదల కావడానికి దేవకి ప్రమేయం చాలా వుంది

ఫ్లెమింగ్‌కి తన ప్రయోగాలు కొనసాగించుకోవాలనే కుతూహలం ఎంత వున్నా జైల్లో పొందిన భయంకర అనుభవాల కారణంగా పోలీసులు కంటపడగానే బ్రేక్ డౌన్ అయిపోతున్నాడు పోలీసుల లాఠీ దెబ్బలు వొంటి మీద పడగానే జరిగిందంతా చెప్పేసాడు

అమెరికాలో తన ప్రయోగాలు కొనసాగించడానికి ఏమాత్రం అవకాశం లేని ఫ్లెమింగ్ ఎలాగైనా ఇండియాకొచ్చి తన ప్రయోగాలు కొనసాగించాలని ఆశపడ్డాడు దేవకి రాజభూషణాన్ని కలుసుకుని ఒడంబడిక కుదుర్చుకుంది దేవకీ ఫ్లెమింగ్‌లు ఇండియాకి రావడానికి అక్కడ ప్రయోగాలు కొనసాగించడానికి ఏర్పాట్లన్నీ రాజభూషణం చేసేటట్లు ఫ్లెమింగ్ తను కనిపెట్టిన దీర్ఘకాలిక జీవితాన్ని ప్రసాదించే మందు ఫార్ములా రాజభూషణానికే అమ్మేటట్లు అలా దేవకీ ఫ్లెమింగ్‌లు ఇండియాకి వచ్చారు అమానుషమైన తన ప్రయోగాలు ఇండియాలో ప్రారంభించాడు ఫ్లెమింగ్ ఆడపిల్లలను వొద్దనుకొనే తల్లుల దృక్పథమూ అందుకు కారణమైన ఎనాటికీ మారని వరకట్న సమస్య అతడి ప్రయోగాలకి బలాన్నిచ్చాయి గర్భంలో వున్న శిశువు ఆడో మగో తెలుసుకోవాలనుకొనే అమాయక స్త్రీలను మోసగించి తన ప్రయోగాలు సాగిస్తున్నాడు ఫ్లెమింగ్ ఈ ప్రయత్నంలో తల్లుల ప్రాణాలకి ఆపద ఎదురైనా లక్ష్య పెట్టడంలేదు తల్లుల ప్రాణాలు కాపాడ్డానికి కావలసిన సాధన సామగ్రి ఫ్లెమింగ్ దగ్గరలేదు సమకూర్చుకోవడానికి డబ్బూ లేదు ఫ్లెమింగ్ ప్రయోగాలు ఎంతవరకూ సఫలమౌతాయో రాజభూషణం అంచనా వేయలేకపోతున్నాడు అంచేత ఫ్లెమింగ్ కోరినప్పుడల్లా డబ్బీయడంలేదు పదిసార్లు లెక్కలడిగి వివరాలు తెలుసుకుని అడిగిందాన్లో సగమో నాల్గోవంతో ఇస్తాడు దేవకి తన కేబరే డాన్స్‌లతో సంపాదించేదే అతనికి ప్రధానమయిన ఆధారం

ఇండియాకొచ్చాక దేవకి దృక్పథంలో చాలా మార్పు వచ్చింది ఫారిన్ డాక్టరనే వ్యామోహంతో పెళ్ళి చేసుకున్న ఫ్లెమింగ్ మీది వ్యామోహం చాలా వరకు తగ్గిపోయింది జైలు నుంచి వచ్చిన ఫ్లెమింగ్ జైలుకెళ్ళడానికి ముందున్న ఫ్లెమింగ్ కాదు విచిత్రమైన మృగంలాగ మారిపోయాడు అలాంటి మృగంతో కలిసి జీవించడం దుర్భరంగా తయారైంది దానికి తోడు లాయర్ యశోదరాదేవి మృదుల భాగవతార్ వీళ్ళందరినీ చూస్తున్నప్పుడు వీళ్ళతో మాట్లాడుతూన్నప్పుడు ఎలాంటి జీవితం వదులుకుని ఎలాంటి ఊబిలోకి వచ్చి పడ్డానా అనే ఆలోచనతో ఆమె మనసు విలవిల్లాడి పోయేది దానికితోడు నిద్రలోనూ మెలకువలోనూ వినిపించే సాటి స్త్రీల ఆర్తనాదాలు ఆమెను రోజు రోజుకి ఎచ్చిదాన్ని చేస్తున్నాయి ఇన్ని కారణాల వల్ల దేవకి ఏ ఒత్తిడీ లేకుండానే నేరం వొప్పేసుకుంది ఫ్లెమింగ్ రాజభూషణానికి తెలియబరుస్తే తమను బెయిల్ మీద విడిపిస్తాడని చెప్పాడు పోలీసాపీసర్ రాజభూషణానికి ఫోన్ చేశాడు అతడు వీళ్ళ విషయం తనకేమీ తెలియదని డాన్సర్‌గా దేవకితో మామూలు



పరిచయమేనని - దేవకి భర్తగా మాత్రమే ఫ్లెమింగ్ తెలుసునని సమాధానం చెప్పాడు. లాకప్ రూమ్‌లో ఫ్లెమింగ్ భయంతో గొడ్డులా అరిచాడు. దేవకి మాత్రం అలసటగా కళ్ళు మూసుకొని కటిక నేల మీద పడుకుంది.

★ ★ ★ ★ ★ ★ ★

మూతలు పడుతోన్న కళ్ళని అతి ప్రయత్నం మీద తెరిచింది మృదుల. కొన్ని క్షణాలు తనెక్కడుందో... ఏం జరిగిందో గుర్తుకు రాలేదు. చుట్టూ చూసింది. సరికొత్త పరిసరాలు. రోజ్ వుడ్ కాట్ మీద మెత్తని యుఃఫోమ్ బెడ్‌పైన పడుకునుంది. చేతులూ కాళ్ళూ ఏదో తాడుతో కట్టేసి వున్నాయి. తల విదిలించుకుని ఆలోచించడానికి ప్రయత్నించింది. టాక్సీలో ఎక్కడం - డ్రైవర్ ఏదో చెప్పబోతున్నట్లు వెనక్కి తిరిగి రుమాలు తనకి వాసన చూపించడం గుర్తొచ్చింది. ఆసమయంలో ఫ్లెమింగ్ లేబ్ గురించి - స్త్రీ శిశు హత్యల గురించి ఆలోచనల్లో వుండటం వల్ల జరుగుతున్న దాన్ని ముందుగానే గ్రహించి ఎదుర్కో లేకపోయింది. జూన్ 14 "ఇండియాటుడే" మేగజైన్‌లో తమిళనాడులోని ఉసిలిమ్‌పట్టి తాలూకా కల్లార్ జాతులలో జరుగుతోన్న స్త్రీ శిశు హత్యల గురించి వివరంగా వ్యాసం రాసారు. కట్నాలిచ్చుకో లేకనే తాము కన్న శిశువులను తామే నిర్దాక్షిణ్యంగా చంపేస్తున్నామని ఆ తల్లులు చెప్పారట.

"తన బిడ్డ ఒక క్షణం అవస్త పడితేనే చూసి భరించలేదు తల్లి. అలాంటిదిమేం కట్నాలిచ్చుకోలేని కారణంగా నా బిడ్డ జీవితాంతం కష్టపడుతూంటే చూసి భరించగలనా? అందుకే పుట్టగానే చంపేస్తున్నాం" అని చెప్పిందట తల్లి కన్నీళ్ళతో. అదంతా చదివిన రోజు ఎంత ప్రయత్నించినా కంటి మీద కునుకు రాలేదు. ఈనాటికీ అనాగరిక జాతులకు కుటుంబనియంత్రణ విధానాలు- బోధించే వారు - అమలు జరిపించేవారూ లేరా? శిశు హత్యల వరకు పరిస్థితి ఎందుకు రానిస్తున్నారు?

కల్లార్ తెగ మనుష్యుల వ్యాసం ప్రచురింపబడ్డ "ఇండియా టు డే" ఆఫీసు మీద దాడి చేసి ఇలాంటి ఆచారాలున్నది మా అనాగరిక జాతుల్లో మాత్రమేనా? నాగరికులు- విద్యావంతులు అయిన వాళ్ళల్లో కూడా ఎందరు గర్భంలో వుండగానే స్త్రీ శిశువుల్ని చంపేయడం లేదు"అని పోట్లాడారట.

ఎంత నిజం? అన్నిరకాల సమాజాల్లోను స్త్రీ శిశువు పట్ల ఇంత నిరాదరణా?ఒకవేళ స్త్రీల సంఖ్య తగ్గిపోయి మగవాళ్ళే సమాజంలో ఎక్కువగా వుంటే అప్పుడు మాత్రం స్త్రీ సుఖంగా వుంటుందా? ఇద్దరు ముగ్గురు మగవాళ్ళు ఒకే ఆడదాన్ని పెళ్ళి చేసుకొని, "నీకు ఆ మొగుడి మీద ఎక్కువ ప్రేమా- ఈ మొగుడి మీద ఎక్కువ ప్రేమా-" అంటూ ఆడదాన్నే కాల్చుకు తింటారేమో? ఒకప్పుడు సమాజంలో కన్యాశుల్కం వుండేది. అప్పుడు స్త్రీ ఎంత




సుఖపడిందో గురజాడ వారు చెప్పారు. తరువాత అది పోయి వరకట్నాలొచ్చాయి. అప్పుడు స్త్రీ ఎంత సుఖపడిందో వీరేశలింగం గారు చెప్పారు. ఇప్పటికీ ఎందరో చెప్తూనే వున్నారు.

పై పై ఆచారాలు ఏవి ఎలా మారినా స్త్రీ తన స్వతంత్ర వ్యక్తిత్వం సంతరించుకొనే వరకూ ఆమెకు విముక్తి లేదని ఎప్పటికి గుర్తిస్తుంది స్త్రీ జాతి.

ఈ ఆలోచనలలో మునిగిపోయిన మృదుల డ్రైవర్ చేస్తున్నదేమిటో గమనించలేదు. అతడు వెనక్కి తిరగ్గానే తనకేదో చెప్పబోతున్నాడనుకొని ముందు కొంగి మరింత సహకరించింది. జరిగిన మోసం ఇప్పుడర్థమయింది. ఇదెవరిల్లు? తనను ప్రత్యేకించి పిలిపించుకోవలసిన అవసరం ఎవరికుంది?

ఆమె ఆలోచనలకు సమాధానమా అన్నట్లు "హల్లో!" అనే రాజభూషణం పలకరింపు వినిపించింది.

వంకర నవ్వుతో మృదుల పడుకున్న మంచం దగ్గిరగా వచ్చి నిలబడ్డాడు రాజభూషణం.

"నిష్కారణంగా నన్ను కోర్టుకీడ్చి అవమానించావు. అందుకు బదులు తీర్చుకుంటాను. ఇప్పుడే నిన్ను బలాత్కారంగా అనుభవిస్తాను". కసిగా అన్నాడు.

మెత్తగా నవ్వింది మృదుల.

"బలాత్కారమా? అది దేనికి?"

తెల్లబోయి చూశాడు.

"నీమీద నాకెప్పట్నుంచో మనసుంది. ఎలా చెప్పాలో అర్థంకాలేదు. నువ్వు నా మనసు అర్థం చేసుకోలేదనే కోపం కూడా నీకెదురు తిరగడానికి కారణం"!.

మతిపోయినట్లైంది రాజభూషణానికి. ఇందులో ఏదేనా మోసం లేదు కదా! అనే అనుమానం రాకపోలేదు. మృదులలాంటి మోద్రను లేడీకి నీతి నియమాలేమిటనే ఛాందసపు వూహ అతని అనుమానాన్ని దూరంగా నెట్టింది. అయినా ఇప్పుడామె వంటింటి కుందేలు. ఎక్కడికి పోగలదు.? పైగా గది బయట, ఇంటి ముందు తన మనుష్యులు కాపలాగా వుండనే వున్నారు. ఈ మాటలు నమ్మటం వల్ల లాభమే కాని నష్టం లేదు.

అతడి మొహం చూస్తూ అతని ఆలోచనల్ని చదివింది మృదుల.

"ఈ కట్లు విప్పండి. చేతులకి, కాళ్ళకి కట్లతో శృంగారమేమిటి?" అంది గోముగా. ఆపె కట్లు విప్పేసాడు రాజభూషణం. ముందుకి వంగబోయాడు ముద్దు పెట్టడానికి.

"ఛ ఇలా వంటి నిండా బట్టలతో నా!" చిలిపిగా నవ్వుతూ అంది. ఆమె నవ్వూ, మాటలూ పిచ్చెక్కిస్తున్నాయి రాజభూషణానికి. ఆరాటంగా బట్టలన్నీ విప్పేసి మూలకి విసిరేసి, ఆమె మీదకి ఉరికాడు. ఒడుపుగా మంచం మించి కిందకి దూకి మంచం మీద పడ్డ రాజభూషణం చేతుల్ని కదలకుండా పట్టుకుని, తనక్కట్టిన తాడుతో నే గట్టిగా కట్టేసింది. కోపంగా లేవబోయే రాజభూషణాన్ని మెడ మీద అరచేత్తో ఒకటి కొట్టింది. అంతటి మగవాడూ విరుచుకు పడిపోయాడు వెనక్కి. అతడి కాళ్ళు కూడా తాడుతో కట్టేసి, చేతులకు కట్టిన తాళ్ళ కొసల్ని మంచం మొదటి కోడుకి, కాళ్ళకి కట్టిన తాళ్ళ కొసల్ని మంచం రెండో కొడుకి గట్టిగా ముడేసింది.

★ ★ ★ ★ ★ ★ ★

మహావీర్ సోమనాథ్ ప్రైవేట్ డిటెక్టివ్ ఏజన్సీస్ కార్యాలయం చేరుకుని జరిగింది క్లుప్తంగా సోమనాథ్‌కివివరించాడు.

"ఏదో అతి సామాన్య విషయంగా, భార్యాభర్తల తగవులాటగా ప్రారంభమైంది, చివరికి జాతీయ సమస్యలా వుందే", అన్నాడు సోమనాథ్ . మహావీర్ వచ్చేసరికి సోమనాథ్ వీడియో కేసెట్టు టి. వి. స్క్రీన్ మీద ప్లే చేసి చూసుకుంటున్నాడు. టి. వి. స్క్రీన్ మీద కనిపించే నల్లటి నీడల్లాంటి ఆకారాల్ని చూసి మహావీర్ నవ్వి, "ఇదేం వీడియో రికార్డింగ్. దేనికి పనికొస్తుంది ఇది?" అన్నాడు. నిట్టూర్చాడు సోమనాథ్.

# కొత్త రలక్

## మీ కుటుంబానికి ప్రత్యేక సబ్బు




మీ కుటుంబాన్ని ఆనందారోగ్యాల కుటుంబంగా రూపొందించండి. వారికి తెచ్చివ్వండి, కొత్త రలక్—మీ కుటుంబానికి ప్రత్యేక సబ్బు. రలక్‌లో సుప్రసిద్ధమైన తులసి సద్గుణాలున్నాయి. ఇందుచేత చర్మం శుభ్రంగా కళకళలాడుతూ రూపొందుతుంది. దీని తాజాతాజా సువాసనలతో వారికి సదా తాజాదనపు అనుభూతి కలుగుతుంది. హాయిగా ఆహ్లాదంగా ఉంటుంది.



## ఆనందారోగ్యాల కుటుంబం రలక్ కుటుంబం.

everest/87/WIL-511-TL

# రేపటి మహిళ

పొరపాటు ఎక్కడ జరిగిందో అర్థం కావడంలేదు బాగవతార్ ఇన్‌స్ట్రక్షన్స్ ప్రకారం ఆయన లేనప్పుడు ఆయన బెడ్ రూమ్‌లో మృదుల మీద తీసిన వీడియో కేసెట్టిది కొన్ని చోట్ల కాళ్ళు కొన్ని చోట్ల వీపు మరి కొన్ని చోట్ల నల్లని నీడలూ తప్ప మరేమీ కనపడ్డం లేదు దీన్లో

మృదులగారి మీదా? నమ్మలేనట్లు అడిగాడు మహావీర్ వెంటనే టి వీ స్క్రీన్ దగ్గిరకొచ్చి బేండ్స్ ఎడ్జస్ట్ చేసాడు

లైటింగ్ సరిగా లేనట్లుంది వీడియో కేసట్ ఎడ్జెస్ట్మమెంట్ కూడా సరిగా లేదు ఇప్పుడు ట్రై చెయ్యండి అన్నాడు

సోమనాద్ మళ్ళీ టి వి ఆన్ చేశాడు ఈసారి ఫిలిమ్ కాళ్ళ దగ్గర ఆగిపోక పూర్తిగా వచ్చింది తెరమీది స్త్రీ మృదుల కాదు గతుక్కుమన్నాడు సోమనాద్ నల్లటి నీడలు స్పష్టమైన ఆకారంలో కనిఎంచాయి స్త్రీ వ్యక్తి మృదుల కాదని రూఢైంది

ఈవిషయం వెంటనే బాగవతార్‌కి తెలియజెప్పాలి ఆయన ఇన్నాళ్ళూ తన బార్యకి ఎవరితోనో సంబందం వుందని భ్రమపడుతూ బాదపడుతున్నాడు అర్జంటుగా బయలుదేరబోతూ అన్నాడు సోమనాద్

మృదుల విషయంలో తన అంచనా తప్పు కానందుకు ఎంతో రిలీఫ్ పొందాడు మహావీర్ జరిగిందంతా వూహాంచుకుంటే అతనికి ఆపుకోలేనంత నవ్వొచ్చింది

వెంటనే వెళ్ళి ఈ విషయమంతా చెప్పి బాగవతార్ గార్ని ఇక్కడికి తీసుకురండి ఆయనొచ్చేసరికి బహుశామృదుల గారూ ఇక్కడే వుంటారు

తన సెకెండ్ హేండ్ హిందూస్థాన్ కారు మీద బయల్దేరాడు సోమనాథ్

గడియారం ముళ్ళు పరిగెడుతున్నాయి ఒకగంట గడిచేవరకూ మహావీర్ పెద్దగా పట్టించుకోలేదు రెండు గంటలు గడిచేసరికి ఆందోళన ప్రారంభమైంది. మూడో గంట కూడా గడచిపోయేసరికి స్థిమితంగా ఉండలేకపోయాడు 022 బొంబాయి ఎస్ టి డి నంబర్ డయల్ చేసి ఆ తరువాత తను నోట్ చేసుకున్న లాయర్ యశోదరాదేవి నంబర్‌కి డయల్ చేశాడు

★ ★ ★ ★ ★ ★ ★

హెూటల్ నాగార్జునా గేటు దగ్గిర ఘూర్ఖా సోమనాద్‌ని లోపలికి వెళ్ళనీయలేదు

లోపల ఎదో గలాబా జరుగుతోంది కొంతసేపటి వరకూ ఎవ్వరూ లోపలికి వెళ్ళడానికి వీలులేదు అన్నాడు

నాది అర్జెంటు పని లోపల సుప్రసిద్ధ కర్నాటక సంగీత విద్వాంసులు బాగవతార్ గారున్నారు వారితో ఒకమాట చెప్పాలి




అదేం కుదర్దు కాస్సేపు మీడొక్కు - అంటే డొక్కుకార్లోనే కూర్చోండి గొడవ సర్దుమణిగేక లోపలికి పోవచ్చు

ఏం చెయ్యాలో పాలు పోలేదు సోమనాథ్‌కి పర్సులోంచి పదిరూపాయలు తీసి ఘూర్ఖా చేతిలో పెట్టి పోనీ లోపలున్న బాగవతార్ గార్ని బయటికి పిలిఎంచే యేర్పాటు చెయ్యగలవా? అన్నాడు సోమనాథ్ అటు తిరిగి ఘూర్ఖాతో ఆతృతగా మాట్లాడుతున్న సమయంలోనే ఇట్నుంచి భాగవతార్ తనకార్లో వెళ్ళిపోయాడు

ఘూర్ఖా చప్పట్లు కొట్టి హోటల్ బోయ్‌ని పిలిచి లోపల బాగవతార్ గారున్నారేమో చూసి ఉంటే ఆయన కోసం యెవరో వచ్చారని చెప్పు అన్నాడు హోటల్ బోయ్ లోపలికెళ్ళొచ్చి బాగవతార్ గారు లేరట ఇప్పుడే వెళ్ళిపోయారట అని చెప్పాడు

ఎక్కడికెళ్ళారట?

ఇబ్బందిగా ముఖం పెట్టాడు బోయ్ మరో పదిరూపాయల నోటు తీసి హోటల్ బోయ్ చేతిలో పెట్టాడు సోమనాద్ బోయ్ లోపలికెళ్ళి తిరిగొచ్చి కుసాయిగుడా కెళ్ళార్ట అన్నాడు

కుసాయిగుడాలో ఎక్కడికి?

కళ్ళు చికిలించి చూసాడు హోటల్ బోయ్ మరో అయిదురూపాయలు తీసి అతని చేతిలో పెట్టాడు సోమనాథ్ వాడు మరోసారి లోపలికెళ్ళొచ్చి ఎక్కడికెళ్ళాడో ఎవరికీ తెలియదట అని చెప్పేసి తుర్రున లోపలికి పారిపోయాడు ఇహ తనకేమీ గిట్టుబాటు కాదని వాడికి తెలుసు

చేసేది లేక తనడొక్కుకార్లో కుసాయి గుడాకి బయల్దేరాడు సైరింజన్‌లా శబ్దం చేసుకుంటూ సోమనాథ్ కారు కుసాయిగుడా చేరుకుంది

సిటీ అవుట్ స్కర్ట్స్‌లో చిన్న పల్లెటూరులా వుంటుంది కుసాయిగుడ అయిదారిళ్ళు అక్కడక్కడ విసిరేసినట్లుగా వుంటాయి ఒక డాబాయింటి ముందు నిలబడి హాల్లో వున్న పెద్ద మనుష్యుల నుద్దేశించి ఈ ప్రాంతాలకి ప్రఖ్యాత సంగీత విద్వాంసుడు బాగవతార్ వచ్చారా?' అని అడిగాడు

సంగీత విద్వాంసుడి సంగతి తెలియదు కాని పక్క వీధిలో ఉంటోన్న కేబరే డాన్సర్ యింట్లో ఎదో గొడవ జరిగినట్లుగా వుంది వివరాలు తెలియవు అని చెప్పాడు ఒకపెద్దమనిషి

కేబరేడాన్సర్ అనగానే దేవకి గుర్తొచ్చింది సోమనాద్‌కి వెంటనే అక్కడికి వెళ్ళాడు నిర్జనంగా వుందా యిల్లు ఇంటిబయట రోడ్డు మీదే కారు పార్క్ చేసుకుని లోపలికెళ్ళాడు ఇంట్లో జనం యెవ్వరూ లేరు ఒక మూల స్టూలు మీద నడివయసు స్త్రీ కూర్చుని బెదురుగా చూస్తోంది భాగవతార్ గురించి అడగాలనుకున్న సోమనాథ్ మొదట దేవకి సంగతి తెలుసుకోవాలనుకుని కేబరే డేన్సర్ దేవకి గారుండేది ఇక్కడేనా? అని అడిగాడు ఆ అమ్మాయి సమాదానం చెప్పలేదు అలాగే బెదురు చూపులు చూస్తూ కూర్చుంది అంతలో మఫ్టీలో వున్న ఇద్దరు పోలీసులు సోమనాద్‌ని చెరోవైపు చేతులు పట్టుకుని

మిస్టర్! మీరు మాతో పోలీస్ స్టేషన్‌కి రావాలి అన్నారు

నేనా! పోలీస్ స్టేషన్‌కా? ఎందుకు? అడిగాడు సోమనాథ్ వాళ్ళు తమ ఐడెంటిటీ కార్డు చూఎంచి ప్లీజ్! స్టేషన్‌కి రండి అక్కడ ఇనస్పెక్టర్ గారితో మాట్లాడితే మీకే అన్ని విషయాలు తెలుస్తాయి అని పక్కసందులో పార్క్ చేసిన జీప్‌లో ఎక్కించుకోబోతూంటే నాకారు అన్నాడు సోమనాద్

దాన్నక్కడే వొదిలేయండి ఎవరూ ఎత్తుకుపోరు నవ్వుతూ అన్నాడు మఫ్టీలో వున్న పోలీసు

పోలీస్‌స్టేషన్‌లో ఎస్ ఐ కి తన విజిటింగ్ కార్డు చూపించాడు సోమనాద్

కూర్చోండి మీకు తెలిసినంత వరకు మా ప్రశ్నలకు సమాదానాలు చెప్పి మాతో సహకరించండి మర్యాదగా అన్నాడు ఎస్ ఐ కూర్చున్నాడు సోమనాద్ అడగటం మొదలు పెట్టాడు ఎస్ ఐ

## డాక్టర్ సలహాలు

### డా. కె. వెంకటేశ్వరరావు



**కె ఆర్ కె – శ్రీరాంనగర్**

తల్లిదండ్రులలో ఏఒక్కరికైనా ఫైలేరియా వ్యాధి వుంటే పుట్టబోయే పిల్లలకు వచ్చే అవకాశం వుందా? వివాహం కాక ముందు స్త్రీకి ఈ జబ్బు వుంటే గర్భిణీ సమయంలో గాని పెళ్ళయిన తర్వాత గాని పెరిగే అవకాశం వున్నదా?

**ఆ అవకాశం వుండదు ఏ రోగమైనా దానికి తగిన నివారణ మందుల వాడకం జరుగక పోతే ఉదృతమయ్యే అవకాశం ఉంటుంది అదే విదంగా వివాహానికి ముందున్న రోగం తర్వాత అదికం అయ్యే అవకాశం వుంటుంది పెళ్ళికీ గర్భిణీగా వుండటానికీ ఈ రోగానికీ ఏ సంబందమూ లేదు**

**ఎన్ ఎల్ – మదిర**

నాకు 15 సంవత్సరములు నాకు ఏడాదిలో పతే పోలియో వచ్చినది ఎన్ని ఆస్పత్రులు తిరిగినా ఎంత డబ్బు ఖర్చు పెట్టినా నయం కాలేదు నా కాళ్ళు వంకర తిరిగి పోయినాయి బాగా నెప్పిగా వుంటోంది

**మీరు ఆర్థోపెడిక్ డాక్టర్లకీ, ఫిజియో తెరపిస్టులకీ చూపించండి కాళ్ళు వంకర తిరిగినప్పుడు ప్రత్యేక బూట్లు వాడిగాని శస్త్ర చికిత్స వల్లగాని నయం చేసే అవకాశం వుంది**

**ఎం జి – ఒరిస్సా**

నా వయస్సు 25 సంవత్సరములు వివాహం కాలేదు కొంచంసేపు నిలబడ్డానంటే కుడికాలు బరువుగానూ నెప్పిగానూ వుంటుంది మంటగూడా వుంటుంది 10 నిమిషాలు నిలబడ్డానంటే నడుము దగ్గర నుండి కుడికాలు మొత్తం విపరీతంగా నెప్పిగావుంటుంది దానికి తోడు రెండు కాళ్ళపైన తెల్లటి మచ్చలు అల్లుకొని వున్నాయి పొట్ట మీద కూడా ఈ మచ్చలు వున్నాయి దురద గూడా వుంటోంది కాలువాపుకీ మచ్చలకీ ఎమైనా సంబంధంవున్నదా? ఏమందులువాడాలి?

**కాలు వాపుకీ, మచ్చలకీ ఏవిదమైన సంబంధమూ లేదనే చెప్పాలి మచ్చలకి పై పూతగా ఇకోనజాతా ఆయింట్ మెంట్ లోనికి ఫల్విన్ ఎం మాత్రలు రోజుకి 6 వంతున 20 రోజుల పాటు వాడండి కీళ్ళ నెప్పులకి నడుము బాగం ఎక్సరే తీయించి వైద్యులకి చూపించండి కీళ్ళ నెప్పులకి తాత్కాలికంగా న్యూరోబియన్ విటమిన్ బి 12 ఇంజక్షన్లు వాడటం మంచిది**

**వై టి – జంగంపల్లి**

నా వయస్సు 40 సంవత్సరములు ముగ్గురు పిల్లలు నాకు ఎప్పుడూ నీరసంగా ఉత్సాహం లేకుండా కాళ్ళూ చేతులూ లాగుతూ వుంటాయి ఏపని చెయ్యాలన్నా మద్యలో చేయలేక పోతు న్నాను ఒకసారి నడుమునెప్పి ఒకసారి కడుపు నెప్పి వస్తాయి ఒక్కోసారి గుండెల్లో మంటలాగ వస్తుంది

**మనసులో చీకాకువల్ల ఏ పనిపట్లా ఆసక్తి లేక పోవటం ఇలా ఒక్కోరోజు ఒక్కో లక్షణం రావటానికి కారణం అవుతూంది శరీరంలో బలం లేదనే అనుమానం తమను ఎవరూ సరిగ్గా చూసుకోవట్లేదనే అపోహ తమకందరూ వ్యతిరేకులే అని అనుకోవటం మానసిక బలహీనత లక్షణాలు క్రమబద్ధంగా ఆహారం తీసుకోవటం పులుపు కారం తగ్గించటం జీవితంలో మంచిని చూడటం నేర్చుకోవాలి ఇటు వంటి వాటికి మందులు వాడటం మంచిది కాదు** □

ఇంత మారుమూల ఈ ఇంటి కెందుకొచ్చారు మీరు?

బాగవతార్ గారి కొక విషయం చెప్పాలని

బాగవతార్‌కి ఈ యింటికి ఏం సంబందం?

అది నాకు తెలియదు

పోనీ మీకు బాగవతార్ గారికి ఏం సంబందం?

ఆయన నా క్లయంట్

ఆయనతో మీరు చెప్పాలనుకున్న విషయమేమిటి? తటపటాయించాడు సోమనాద్

నిజం చెప్పండి ప్లీజ్! మనం పరస్పరం సహకారంతో మన పనులు సాగించుకోవాలి

ఆయన బార్య అని ఆయన భ్రమపడుతోన్న వ్యక్తి ఆయన బార్య కాదని చెప్పడాని కొచ్చాను

వాట్!

నీడమీదకి వైటొచ్చింది మనిషి స్పష్టంగా కనిపించింది ఆమె మృదుల – కాదు

ఎస్ ఐ రెండు చేతులతో తల పట్టుకుని కాస్త అర్ధమయ్యేలా చెప్పండి ప్లీజ్! అన్నాడు

మంచినీళ్ళు తెప్పించుకుని తాగాడు సోమనాద్ క్లుప్తంగా జరిగింది చెప్పి మా టి వి సెట్‌లో లోపం కారణంగా చాలా దారుణమైన పొరపాటు జరిగిపోయింది వెంటనే వెళ్ళి బాగవతార్‌కి ఈ విషయం చెప్పక పోతే ఆయన ఏం చేస్తాడో నని ఆదుర్దాగా వుంది అందుకు నేనే కారణమని బాదగానూ వుంది హోటల్ నాగార్జునాలో బాగవతార్ ఇక్కడి కొచ్చారని చెప్తే వచ్చాను అన్నాడు

ఎస్ ఐ నవ్వి బాగుంది మీప్రైవేట్ డిటెక్టివ్‌ల పని బాగవతార్ ఇక్కడి కొచ్చినట్టు ఇక్కణ్నుంచి ఎయిర్ పోర్టుకి వెళ్ళినట్టు తెలిసింది అని, సోమనాద్‌కి షేక్‌హేండ్ ఇచ్చి పంపేసాడు

బాగవతార్ కారు రాజభూషణం ఇంటి ముందు ఆగింది గేటు దగ్గర ఘూర్ఖాకి బాగవతార్ బాగా తెలుసుకనక సలాం చేసి గేటు తెరిచాడు అంతకుముందు రాజభూషణం మనుష్యులు తీసుకొచ్చింది బాగవతార్ భార్యని ఘూర్ఖాకి తెలియదు అలాంటి విషయాలు అతను పట్టించుకోడు కాంపౌండులో కారు పార్క్ చేసి పరిగెడుతూన్నట్టుగా లోపలికి నడిచాడు రాజభూషణం ప్రైవేట్ రూమ్స్ అతనికి తెలుసు కాని అటు వెళ్తూండగానే రాజభూషణం మనుష్యులు అడ్డుపడి ఇప్పుడు లోపలికి వెళ్ళడానికి వీల్లేదు అన్నారు నేను వెళ్ళి తీరాను ఖండితంగా అన్నాడు బాగవతార్ అనడమే కాదు లోపలికి తోసుకుని వెళ్ళబోయాడు రాజభూషణం మనుష్యులు అతన్ని చెరో రెక్క పట్టుకుని ఇవతలికి ఈడ్చారు దిక్కులు పిక్కటిల్లేలా మృదులా అని అరుస్తూ వాళ్ళని తోసుకుని లోపలికెళ్ళబోయాడు

బాగవతార్ రాజభూషణం స్నేహితుడని అందరికీ తెలుసు మొహమాటంతో కొంచెం సంకోచించారు రాజభూషణం మనుష్యులు కాని బాగవతార్ పిచ్చివాడిలా అరిచి గోలచెయ్యడంతో ఇద్దరూ కలిసి బాగవతార్‌ని చావబాదారు ఆదెబ్బలు బాద భరిస్తూనే మృదులా అని అరుస్తూ లోపలికి పోవడానికి ప్రయత్నించాడు బాగవతార్ రాజభూషణం మనుష్యులు అతన్ని బయటి కీడ్చుకొచ్చి మరింత బాదారు ఒక్కొక్క దెబ్బ వంటి మీద పడుతున్నప్పుడల్లా శక్తి అంతా కూడదీసుకుని మృదులా అని అరుస్తోనే వున్నాడు బాగవతార్

(ఇంకా ఉంది)




# – ఒక్క ఆప్టానికాతోనే

ఆప్టానికా యొక్క నవతరానికి చెందిన జపాన్ సాంకేతిక విజ్ఞానం మీకోసం అందిస్తుంది ట్రూ లైఫ్ విజన్—సజీవ సాక్షాత్కారం. టీవీలో ట్యూనింగ్‌లో అధునాతనమైన తీరుకోసం సూపర్ మైక్రోచిప్, కలర్ మరియు కాంట్రాస్ట్‌లకోసం సూపర్ సెన్సిటివ్ ఆటో ట్రాకింగ్ వున్నాయి వీటితోపాటు మీ అధీనంలో ఇంకా మరెన్నో విశిష్టతలు



"పుష్పక విమానం"లో కమల్‌హాసన్, అమల

# విశేషాలు

—జి.వి.జి.

## కృష్ణ, శ్రీదేవి విజయ బాపినీడు దర్శకత్వంలో

"జనవరి నుంచి మార్చి వరకు ప్రతి 21వ తేదీ నుంచి ఆయా నెలాఖరు వరకు జరిగే మూడు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు విజయ బాపినీడు. ఈయన దర్శకత్వంలో అట్లూరి రాధాకృష్ణమూర్తి, కొమ్మన నారాయణరావు నిర్మించే శ్రీనివాసా ప్రొడక్షన్స్ వారి చిత్రంలో కృష్ణ, శ్రీదేవి నాయకా నాయికలు. వి. ఎస్. ఆర్. స్వామి ఛాయాగ్రాహకుడు. శ్రీనివాసబాబు సమర్పిస్తారు చిత్రాన్ని.



"మహర్షి"లో రాఘవ, నిశాంత



అంతిమ తీర్పు"లో సుమలత, కృష్ణంరాజు

## "డాన్స్ రాజా డాన్స్"

ఒక ఎఫైర్ పని మీద బెంగుళూరు వెళ్ళిన నేను అనుకోకుండా అక్కడ 14 థియేటర్లలో ఒకేసారి విడుదలై హౌస్‌ఫుల్ కలెక్షన్‌లతో ప్రదర్శింపబడుతున్న డాన్స్ రాజా డాన్స్" చిత్రాన్ని చూశాను. బ్రేక్ డాన్స్ ప్రధానంగా తయారైన ఈ చిత్రంలో సుప్రసిద్ధ కన్నడ నటి లీలావతి కుమారుడు వినోద్ రాజ్ అద్భుతంగా నటించడమే కాక బ్రేక్ డాన్స్‌లో పలు ప్రశంస లందు కున్నాడు. ఈ చిత్రాన్ని తెలుగు ప్రేక్షకులకు అందించాలన్న కోర్కె నాకు కలిగింది. ఈ చిత్రానికి మ్యూజిక్ కంప్యూటర్ ద్వారా సమకూర్చబడడం మరో ఆకర్షణ." అన్నారు జి. కె. రెడ్డి. ఈయన "లాయర్ భారతీ దేవి" అనంతరం శ్రీదేవి కళా ఆర్ట్స్ బ్యానర్‌లో నిర్మించే పై చిత్రంలో స్వాతి నాయిక. దేవరాజ్, కీర్తిరాజ్, సంగీత, శ్రీనాథ్ ఇతర పాత్రధారులు. రాజశ్రీ మాటలు, పాటలు రాశారు. విజయానంద్ సంగీతం, దేవీ ప్రసాద్ ఛాయ గౌతంరాజు కూర్పుతో జానకీదేవి సమర్పించే ఈ చిత్రానికి ద్వారకేష్ కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చి, డైరెక్ట్ చేశారు.

"డాన్స్ రాజా డాన్స్"లో స్వాతి, వినోద్‌రాజ్



శ్రీ హరిప్రియా సినీ క్రియేషన్స్ "జలాకర్ రాఖ్‌కర్ దూంగా". హిందీ చిత్ర కథానాయకుడు ధర్మేంద్రతో, ఆ చిత్ర కథా రచయిత శ్రీ భీశెట్టి

## సినిమా

### "ప్రేమ కిరీటం"

"నాలుగు పాటలలో రెండింటిని ఊటీలో చిత్రీకరిస్తాం. డిసెంబర్‌కి షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు యార్లగడ్డ శంభు ప్రసాద్. ఈయన సమర్పించే శ్రీ యార్లగడ్డ వెంకన్న చౌదరి మూవీస్ వారిపై చిత్రంలో కల్యాణ చక్రవర్తి, మురళీమోహన్, చంద్రమోహన్, జగ్గయ్య, గుమ్మడి, వేలు, సుహ్బూ, తులసి, అశ్విని, షావుకారు జానకి, శ్రీలక్ష్మి పాత్రధారులు. పాటిబండ్ల విజయలక్ష్మి కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చారు. వెటూరి గీతాలు, కె. వి. మహదేవన్ సంగీతం, నవకాంత్ ఛాయ, కొండపనేని పెదరామలింగేశ్వరరావు శిల్పం, ప్రకాష్ – సురేఖ నృత్యాలు, హర్సిమన్‌బాబు సాహసాలు, సాంబశివరావు కూర్పు. ఎం. తాండవకృష్ణ ప్రొడక్షన్‌తో యార్లగడ్డ ప్రభావతి నిర్మిస్తున్న ఈ చిత్రానికి జి. రామ్మోహనరావు దర్శకుడు.

"దొంగ కాపురం"లో కల్యాణ చక్రవర్తి, రజని



### "అమ్మకానికో అబ్బాయి

"నవంబర్ 19 నుంచి నెల్లూరు పరిసరాలలో నలభై రోజుల పాటు నిరవధికంగా జరిగే ఒకే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు కర్పూరపు ఆంజనేయులు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, సంభాషణలు సమకూర్చి తొలిసారి దర్శకత్వం వహించే శ్రీ వేంకట శుభలక్ష్మి విజయదుర్గ ఫిలిమ్స్ వారిపై చిత్రంలో ప్రముఖ రంగస్థల నటుడు ఎ. వి. సుబ్బారావు కుమారుడు ఎ. కోటేశ్వరరావుతో పాటు సాగరిక, స్వర్ణ, లత, జూనియర్ శ్రీదేవి, విజయరేఖ, రాజీ, సుశీల, కాకరాల, చంద్ర, మోహన్‌కుమార్,



అమ్మోయ్! నీకో శుభవార్త! అక్క స్కూలు కెళ్లకుండా సినిమాల్లో చేరటానికి మద్రాసెళ్ళింది!

మధుమూర్తి, బాబూరావు, రాసాన్ పంతులు ఆదిగా గల వారు పాల్గొంటున్నారు. ఆత్రేయ, దుత్తలూరి రామారావు, కర్పూరపు ఆంజనేయులు రచించిన గీతాలను విజయా కృష్ణమూర్తి స్వరపరిచారు. హెచ్. ఎస్. వేణు ఛాయ, శేఖర్ శిల్పం, అప్పాజీ సాహసాలు, శేషు నృత్యాలు, కె. శంకర నారాయణ సంయుక్త దర్శకత్వం, రాజ్‌వర్మ– ప్రసాదరావు సహకార దర్శకత్వం, కొంగర సాంబశివరావు ప్రొడక్షన్, వేమూరి రవి కూర్పుతో యు. కె. చంద్రు, ఉన్నం హనుమయ్య, సి. హెచ్. శ్రీదేవి నాయుడు నిర్మాతలు. వరకట్న సమస్య మీద సంపూర్ణ హాస్య రస ప్రధాన చిత్రమిది. □

# శత చిత్ర నటి సుమలత  సమాధానాలు

ఎం. విష్ణుప్రియ కొత్తకోట

ప్ర పదునైన కత్తికి వాడియైన స్త్రీ నాలుకకు ఉన్న బేదమేమిటండీ?

జ మొదటిది రక్తాన్ని చిందిస్తుంది రెండోది రక్తాన్ని ఉడికిస్తుంది

చిట్టూరి పద్మజాక్షి కాకినాడ

ప్ర మాతృత్వం వహించే స్త్రీ అనుభూతులు ఎలా ఉంటాయో చెప్పగలరా?

జ తొలి చూలు ఆనందం రెండో కాన్పు ఓర్పు, మూడో శిశువు నుండి సమస్య- అనుకుంటాను

సి నరసింహస్వామి బొబ్బర్లంక

ప్ర తమకు నటించుటకు ఛాన్సు ఇచ్చిన నిర్మాతనా తమకు పేరు ప్రఖ్యాతులు తెచ్చి పెట్టే దర్శకులనా? తారలు ఎవరి పేరును మరువకూడదు!

జ ముఖ్యంగా థామస్ ఆల్వా ఎడిసన్‌ను ఆ శాస్త్రజ్ఞుడు సినిమా ప్రొజెక్టర్‌ను కనిపెట్టి ఉండకపోతే, ఈ సినిమా రంగంలోని వారంతా మరే రంగంలో ఉండే వారో!

వి కామేశ్వరి, జగ్గయ్యపేట

ప్ర రాబడి తక్కువ ఖర్చు ఎక్కువ నేనేమైపోవాలంటారు!

జ ఇది మీ ఒక్కరి సమస్యే కాదు యావద్భారత సమస్య

మాస్టర్ ప్రదీప్, సామర్లకోట

ప్ర: పురుషుడు దారి తప్పితే ?

జ కొలంబస్ మాత్రం దారి తప్పడం వల్లే అమెరికాను కనుగొనగల్గాడు

ఇక్కుర్తి సత్యనారాయణ తిరుపతి

ప్ర స్త్రీగాని పురుషుడుగాని జీవితంలో ఏవేవో కోర్కెలు కోరుచూ కలలు కంటూ ఊహా సౌధాలు నిర్మించుకుంటూంటారు వారి ఆశలు ఒక్కటైనా నిజం కాక అన్నీ వ్యతిరేకంగా జరిగితే వారి జీవితం ఎలా ఉంటుంది?

జ: అలా డక్కా మక్కీలు తిన్న వారి జీవితమే సాఫీగా సాగుతుంది

అబ్బూరి బాస్కరమ్మ చీపురుపల్లి

ప్ర సినిమాలో నటించుట ప్రేక్షకాబిమానము పొందుటకా ధనమార్జించుటకా ఖ్యాతి గాంచుటకా?

జ ప్రేక్షకాబిమానం లబిస్తే దనం సంక్రమిస్తుంది అటు పైన ఖ్యాతి కూడా దక్కుతుంది

ఇ గోవిందరాజులు, రేణిగుంట

ప్ర, మానవుడు తెలిసి కూడా ఎందుకు పాపం చేస్తాడు?

జ ఆ తర్వాత పశ్చాత్తాపంతో విమోచనం పొందవచ్చనే కుంటిసాకుతో

కె ఇంద్రాణి బెంగలూరు

ప్ర మిస్ సుమలత ప్రస్తుతం మిమ్మల్ని బాధిస్తున్న సమస్య ఏమిటో కాస్త చెప్తారా?

జ ఎలాంటి తీవ్రమైన సమస్యతో నేను బాధపడగలనా అని

పి నవనీతంశెట్టి కోలారు

ప్ర అమ్మా! మా ప్రశ్నలకు ఇంత చమత్కారంగా జవాబులిస్తున్న మీ మెదడు బరువు ఎన్ని కిలో గ్రాములు?

జ మీరు సరకులు అమ్మే తూనిక రాళ్ళలో చెప్పమన్నారా? లేక మీరు పాత న్యూస్‌పేపర్లు కొనుక్కునే తూనికరాళ్ళలో చెప్పమన్నారా?

ముదునూరి శ్యామల నంద్యాల

ప్ర దనిక స్త్రీలు పేద స్త్రీలు సమానంగా అనుభవించే బాధ ఏమిటి?

జ ప్రసవవేదన కదా?

అల్లూరి ప్రేమలత విశాఖపట్నం

ప్ర మెరుపు అనగానేమి?

జ కారుమబ్బుల మధ్య చిరునవ్వు □

## గమనిక

ఈవారం ఉత్తమ ప్రశ్నగా ఏదీఎంపిక కాలేదు సం

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న

పంపినవారి పేరు

పూర్తి చిరునామా

# ప్రశ్నావళి — కె.రామలక్ష్మి



### రాజు, నారాయణపేట

★ ప్రస్తుతం దేశంలో రేకెత్తిన బోఫర్స్, ఫెయిర్‌ఫాక్సులపై మీ అభిప్రాయం

● ఎవరి అభిప్రాయాలూ అక్కరలేదిక అంత పనత వచ్చేసింది మనకి అందుకే నేనెప్పుడూ అంటూంటా పాపం ఏ స్టూఅర్ట్‌పురాన్నో పట్టుకుని క్రిమినల్ సెటిల్‌మెంట్ అనడం దారుణం మనదేశమే ఓ పెద్ద క్రిమినల్ సెటిల్‌మెంటు అయినప్పుడని నిజం కాదంటారా?

### వి ఎస్ కొవ్వూరు

★ అన్ని బాధ్యతలు తీరి కాలక్షేపం లేక యిరుగమ్మలు పొరుగమ్మలతో కాలం గడిపే మీ ఏజ్‌లో వుండే మహిళలకు ఏదైనా సత్కాలక్షేపం చూపించకూడదా?

● ఇంట్లో మాట్లాడే ప్రాణి లేకుంటే – ఇరుగు పొరుగులతో మాట్లాడ్డం- తప్పులేదు అమ్మమ్మలని నాయనమ్మలని కొంపలో ఆయాలుగా వాడుకునే యువజంటలు- ఆత్మపరీక్ష చేసుకోవాలి ముందు ఎవరికేనా బాధ్యతలు బంధాలు తీరడం- చచ్చినప్పుడే వయసు పెరిగేదే గాని మనసు కూడా పెరిగేదే అని గ్రహించ రెందుకు? సత్కాలక్షేపం ఎల్లా ఎల్లాలకి చాకిరి చేయడమేనా? మీ ప్రశ్న చదివాకే అన్పిస్తూంది- ఇప్పుడు ముసలివారు వసతి గృహాలున్నాయా అని ఎందుకు వెతుక్కుంటు న్నారో!! జీవితాన్ని వయసుతో కొలవకు అను భవంతో కొలవడం నేర్చుకో సుశీలా అప్పుడిలాంటి ప్రశ్న వెయ్యలేవు

### ఎస్ ఎస్ ఆర్ ఖర్గపూరు

★ నేను మీ స్వంత మనవడిని– పెద్ద రచయితనై పేరు సంపాదించుకోవాలని వుంది.

● నువ్వు పేరు సంపాదించు కొందుకు నాకు మనవడివి కానక్కరలేదు!

### సుదర్శన్, భీమవరం

కె ఆర్ గారూ ప్రస్తుతం అతి భయంకర రూపందాల్చిన వరకట్న సమస్య సమసిపోవాలంటే ఏం చేయాలి?

● అమ్మాయిలు- పెళ్ళికి ముందర ఆలో చించుకోవాలి తర్వాత ఆలోచించుకోవడం చేతులు కాలాక ఆకులు పట్టుకోడంలాంటిదే

### వెంకట్ జువారినగర్

★ తొందరపడి ఏ పనీ చేయరాదు అంటూనే మళ్ళా ఆలస్యం అమృతం విషం అంటారు- ఎందుకు?

● రెండూ ఒక్క దాని విషయంలో అనరు సందర్భాలువేరు వ్యాపారానికి తొందర శుభానికి ఆలస్యం మంచిదికాదని అంతే

★ ఇన్నేళ్ళుగా ప్రశ్నావళి శీర్షిక నడపడంలో మీ ఉద్దేశ్యం?

● ఎన్నేళ్ళుగా?! ఏ వారానికా వారం కొత్త నాకు!

### కె పి కె ఎల్ ఆర్ కోటబొమ్మాళి

★ చట్టం– కామెంట్?

● కాగితం పులి!

★ మీరిప్పుడేం నవల రాస్తున్నారు!

● ఏం రాయడంలేదు!

★ ఆడది ఆదిశక్తి కాదంటారా?

● ఎందుక్కాదు? మొన్నో మనిషి త్రాగుబోతు భర్తని చంపిందని తక్షణం- నిర్బంలోకి తీసుకో లేదూ?!

★ ప్రేమించేవాళ్ళు ఎందుకు లోకాన్ని మరిచి పోతారు?

● ప్రేమించుకునేటప్పుడు కళ్ళు పొరలు కప్పుతాయి లోకం తెలియదు పెళ్ళితో అవి కాస్త తొలగి– దారుణంగా కన్పిస్తుంది లోకం

★ తొలిచూపులో ప్రేమ పుడుతుందంటారు నిజమేనా

● నిజమే!

### వై బి కె తాడిపత్రి

★ అక్కయ్యా నేను ఒక అమ్మాయిని ప్రేమిం చాను తీమె వ్యభిచారి అని నిజమైంది ఆమెను కట్టుకోవాలా! వదిలేయాలా?

● ఎలా నిజమైందో మీరు చెప్తే– వ్యభిచారిగా ఎవరు మార్చారో తేలిపోతుంది కదా!!

### ఎస్ ఏ అక్కిరెడ్డిగూడెం

★ బుధవారం ఆడపిల్ల పుట్టితే అరిష్టం అంటారు నిజమేనా?

● ఈ రోజుల్లో ఆడపిల్ల అని తెలిస్తే గర్భంలోనే- చంపిపారేస్తూ వుంటే- యీ అనుమానం ఏమిటి? ఆడపిల్ల ఎప్పుడూ– తల్లి తండ్రుల మంచి చెడులు చూసేదే కాని ఆ తల్లి తండ్రులే ఆమెని చిన్న చూపు చూడడం– దారుణం కదూ!

### రవీ కాశీబుగ్గ

★ మీ అసలైన ఫొటో ప్రశ్నావళిలో చూడాలని వుంది

● చూస్తారు చూస్తారు ఏ ఫొటోగ్రాఫరూ ధైర్యం చేస ఫొటో తీస్తానని ముందుకి రావడంలేదు అలా తీయకల భూషన్ ఒక్కడు హైద్రాబాదు కొలువులో చేరిపోయాడు!!

★ నేటి సినిమాలపై మీ అమూల్యమైన అభిప్రాయం

● మూల్యం వెచ్చించి చూడడానికి తగినవి కాదంటున్నారు అంతే అంచేత అవి అమూల్య మైనవే అనుకోవాలి!

### కె వి ఆర్ బిలాయ్‌నగర్

★ రామకోటిగాని శివకోటిగాని రాయడంవల్ల ప్రయోజనం వుందా? తరవాత అవి ఎవరికి అంకితం యివ్వాలి?

● రోజులో కొద్ది సేపైనా చెడు వూహలు దూరకుండా మనస్సు నిలపడం కోసం– రామకోటి రాయడం ప్రయోజనం ఏమిటి? ఇక వాటిని భద్రాచలం పంపండి లేదా ఏ రామాలయం వారికి అంద చేసినా– చాలు □





"తీవ్రమైన
అగ్నిప్రమాదం నా
దుకాణాన్ని పూర్తిగా
కాల్చివేసినప్పుడు..."

# "నేను తిరిగి తెరిచాను, వెంటనే. యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్స్ సహాయంతో."

'నేను నా దుకాణాన్ని ఎంతో ఖర్చుపెట్టి మరెంతో గర్వంతోనూ కట్టుకున్నాను అయితే నేను కొంత దూరదృష్టి వుపయోగించాను యునైటెడ్ ఇండియావారి వ్యాపారస్తుల బృహత్తర భీమా పథకం తీసుకోవడం ఒక అగ్ని ప్రమాదం నా దుకాణాన్ని బూడిదగా మార్చివేసినప్పుడు నేను నా వ్యాపారాన్ని తిరిగి ప్రారంభించగలిగాను—అందుకు కారణం యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్స్ నాకు కావలసిన మద్దత్తు అందించడమే

అగ్ని, అల్లరులు దొంగతనాలు లేక నిర్లక్ష్యంగా వుండే ఉద్యోగులవలన మీకు చెప్పలేనంత నష్టం కలగవచ్చు మీది పెద్ద దుకాణమయినా లేక చిన్న కొట్టయినా కావచ్చు మీ అవసరాలకి ఎంతగానో తగిన యునైటెడ్ ఇండియావారి వ్యాపారస్తుల బృహత్తర భీమా పథకాన్ని స్వీకరించండి



**యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్స్ కంపెని లిమిటెడ్**

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియావారి అనుబంధ సంస్థ)

24 వైట్స్ రోడ్ మద్రాసు 600 014

**యునైటెడ్ ఇండియా వారి వ్యాపారస్తుల బృహత్తర భీమా పథకం**

యునైటెడ్ ఇండియా ఏజంట్ని లేక సమీపంలో వున్న కార్యాలయాన్ని సంప్రదించండి

HTA-7054

## సీరియల్

# డి.ఎస్.పి. విజయ్

## ఆమూరి సావిత్రి



(గత సంచిక తరువాయి)

క్రిష్ణా ఎక్స్‌ప్రెస్ చీరాల స్టేషన్ వదిలి నెమ్మది నెమ్మదిగా స్పీడందుకుంది

తన సీట్లో కూర్చుని హిందూ చూస్తున్నాడు విజయ్

కూలింగ్ బటర్ మిల్క్ టీ కాఫీ సమోసా అమ్మే వాళ్ళు పెట్టెలో హడావుడిగా తిరుగుతున్నారు

శనక్కాయలు ఉడక బెట్టిన శనక్కాయలు వేడి వేడి కాయలు అంటూ వచ్చిన కుర్రాణ్ణి ఆపి విజయ్ తప్ప అక్కడున్న వాళ్ళంతా కొనుక్కున్నారు

విండో దగ్గర కూర్చున్న వాళ్ళు కూడా ఆ తొక్కల్ని బయట పారెయ్యకుండా కంపార్ట్‌మెంటులోనే పడేస్తున్నారు

అప్పటికే లోపలంతా బత్తాయి తొక్కలు అరటి తొక్కలు మొదలైనవన్నీ చెల్లా చెదురుగా పడున్నాయి

తమ చుట్టూ ఉన్న పరిసరాల్నయినా శుభ్రంగా ఉంచుకోవాలనే జ్ఞానం లేని వాళ్ళని చూస్తే విజయ్‌కి మంట

ఇలాంటి వాళ్ళందరికీ తలో యాభై రూపాయలు ఫైనేసి ఖచ్చితంగా వసూలు చేస్తే అనుకుంటుంటే నవ్వొచ్చిందతనికి

మనది పథకాలు వేసే ప్రభుత్వమే గానీ వాటిని జాగ్రత్తగా అమలు జరిపే ప్రభుత్వం కాదు వాటి వల్ల మధ్య వాడు బాగుపడటమే గానీ అసలు ఉద్దేశ్యం నెరవేరదు

పేపర్ మడిచి పక్కన పడేశాడు విజయ్ బోర్‌గా అనిపిస్తోంది

నానీని తీసుకొచ్చినా బావుండేది

తప్పనిసరిగా ఓ పెళ్ళికి అటెండవాల్సొచ్చి వెళ్ళాడు తను నానీని తీసుకెడితే వాళ్ళ యక్ష ప్రశ్నలకు సమాధానాలివ్వలేక సతమతమవాలి అందుకని ఇంట్లోనే వదిలేసి వచ్చాడు

ఆ పెళ్ళిలో అదో పోర్స్!

అందరి కాన్‌సన్‌ట్రేషనూ తన పెళ్ళి మీదే!

ఒకమ్మాయిని చూపించటం ఆమె చదువు అర్హతలు గుణగణాలు ఇవ్వబోయే కట్నం వీటన్నిటినీ ఏకరువు పెట్టి తన నిర్ణయం చెప్పమని ఒత్తిడి చెయ్యటం

మొదట ఎవరి పిల్లని ఓకే అంటాడో అని మిగతా పిల్లల తలిదండ్రుల జెలసీ

[illegible]

వేపు మొగ్గు చూపక పోయే సరికి హఠాత్తుగా అందరూ ఏకమయి పోయి ఎక్కడా లేని ఐకమత్యాన్నీ ప్రదర్శిస్తూ ఏమయింది? ఎందుకు చేసుకోడు? ఎవర్నయినా ప్రేమించాడా? అయితే ఎందుకూరుకున్నాడు? కట్నం చాలదని ఇంతిమ్మని అడగటానికి మొహమాట మడ్డొచ్చి ఇలా కప్పదాట్లు వేస్తున్నాడా లేకుంటే ఎవత్తెనైనా ఉంచుకున్నాడా ఏం లేకుండా ఇన్నేళ్ళొచ్చిందాకా ఇంత నిష్ఠగా ఉండి ఇంకా పెళ్ళొద్దంటాడా? అనే అంశాల మీద ఒకటే చర్చలు

అందుకే ఇలా పెళ్ళిళ్ళ కటెండవటం మీద తనకంత ఇంట్రెస్టుండదు

వీళ్ళ ప్రశ్నలకేం జవాబు చెపుతాడు తను?

తన జీవితంలోకి తొలకరి మెరుపులా ప్రవేశించి పున్నమి జాబిలిలా వెన్నెలలు కురిపించి అనేక స్పందనలకు మూలాధారమై మానసికంగా పెనవేసుకుపోయి తనలో ఒక భాగమైన వైజయంతి గురించి ఇప్పుడేం చెప్పగలడు?

ఆమె ఎక్కడుంది అనే ప్రశ్నకు తన దగ్గర జవాబేది?

ఆమె తన నుంచి బలవంతంగా విడిచేత విడదియ్యబడి ఎటు కొట్టుకుపోయిందో ఇన్నాళ్ళూ తన ఉనికిని తెలియనివ్వకుండా ఎందుకు జాగర్త పడిందో ఆ రాక్షసుల చేత కెలా చిక్కిందో

వీటికి జవాబు తనకే తెలీదు ఇంకోరికేం చెపుతాడు?

పక్కనేదో గొడవ వినపడ్డంతో తల తిప్పి చూశాడు విజయ్

తల నొప్పి మాత్ర ఉందా? అని తన పక్కనున్న వాణ్ణి అడుగుతున్నాడొకతను

ఇందాకట్నుంచీ వెధవ సోది చెప్పి నాకు తల నొప్పి తెప్పించింది చాలక పైపెచ్చు నన్నే తల నొప్పి మాత్రలడుగుతున్నావా? అని ఆ పక్క వాడు అరవటంతో అంతా నవ్వాపుకుంటున్నారు

విజయ్ అటు తిరగటం చూసి చూడండి సార్! ఇహ ఆపవయ్యా బాబూ అని మొత్తుకుంటున్నా వినకుండా ఇందాకట్నుంచీ ఇతను తను చూసిన సినిమా గురించి అప్పుడే పూర్తి చేసిన నవల గురించి మొత్తం స్టోరీ అంతా చెపుతూ నాకు పిచ్చెక్కిస్తున్నాడు!

ఇలా ఎవరైనా సరే సినిమా కథలు నవలలు గురించి ఏటు జడ్ వరకూ చెప్పటం చూస్తే నాకు ఎలర్జీ సార్

అసలు నా దృష్టిలో ఇలాంటి వాళ్ళు కూడా నేరస్థులే!

ఎదటి వాడి మానసిక స్థితిని గుర్తించకుండా తమ అభిప్రాయాలన్నీ వాడి మీద రుద్దేసి మానసికంగా మర్డర్ చేసే వాళ్ళు మాత్రం నేరస్థులు కారా చెప్పండి? అన్నాడతను ఆవేశంగా

ఇతనిలా ఎదురు దాడి ప్రారంభించటంతో మొదటి వ్యక్తి మాట లాపేసి నోరు మూసుకున్నాడు

విజయ్ పెదవుల మీద కనీ కనిపించకుండా ఉన్న చిరునవ్వు ఇచ్చిన ప్రోత్సాహంతో ఇంకో గంట వరకూ గింజుకుంటూనే ఉన్నాడతను

అంకుల్! నానీ పిలుపు విని చివ్వున తల తిప్పి చూశాడు విజయ్ రసూల్ పక్కన నానీ!

**జరిగిన కథ – 18** డి ఎస్ పి విజయ్ ఒక నైట్ క్లబ్‌లో కాబరే డాన్సర్‌గా వింధ్యను చూస్తాడు వింధ్య కోసం ఒక వైపు రంగారావు మరో వైపు విజయ్ అన్వేషణ ప్రారంభిస్తారు వింధ్య ఇంట్లో దొరికిన గుర్తులతో విజయ్ ప్రయత్నం మొదలవుతుంది హేమలత నడుపుతున్న లతా నాట్యశాలలో వ్యభిచారం నడుస్తున్నదని వచ్చిన సమాచారంతో విజయ్ యుక్తిగా అక్కడ దాడి జరుపుతాడు

నువ్వెందు కొచ్చావమ్మా నానీ ' అని వాడిని దగ్గరకు తీసుకుంటూ

నానీని బయట తిప్పొద్దని చెప్పలా? అన్నాడు విజయ్

ఎంత చెప్పినా వినలేదు సర్ తనూ స్టేషన్ కొస్తానని ఒకటే ఏడుపు చివరికిహ బిర్యాని కూడా వెంట తీసుకుని నేనే వచ్చాను వినయంగా అన్నాడు రసూల్

ఇంటి కొచ్చాక ఇంకా విజయ్ చేతిని పట్టుకునే ఉన్నాడు నానీ

మీరు లేకపోతే నాకు బాగో లేదంకుల్! ఎంతో చలా! చంద్రావు గారు తీసుకెడతానంటే మురళీ అంకుల్ పంపనన్నారు నేనూ రానని చెప్పాను నాకెక్కడి కెళ్ళినా బోరే అంకుల్! మీరుంటేనే బావుంటుంది

ఎదైనా వండర్ జరిగి అంకుల్ ఒక రోజు ముందే వచ్చేసేలా చెయ్యి అని లార్డ్ వెంకటేశ్వరాకి మొక్కు కున్నాను కూడా! అబ్బ! ఇప్పు డెంత బావుందని! నానీ అమాయకంగా చెపుతుంటే ఆర్తిగా వాడిని గుండెల్లోకి లాక్కున్నాడు విజయ్

ఎందుకో ఇలాంటప్పుడు విజయ్ మనసు విపరీతంగా స్పందిస్తుంది

నానీ నిశ్చింతగా నిద్ర పోతున్నాడు

విజయ్‌కి నిద్ర రావటం లేదు

అతని మనసు నిండా వైజయంతి ఆలోచనలే

ఆ జ్ఞాపకాలు శరవేగంతో కొన్ని సంవత్సరాలు వెనక్కి వెళ్ళి ఆమె ఎక్కడ ఆగి పోయాయి

విజయ్ ఒక ఉన్నత కుటుంబంలో పుట్టాడు

ఉన్నత కుటుంబానికి నిర్వచనం డబ్బు హోదా అంతే గాని మానసిక మైన సంస్కారం కాదు అలాంటి సంస్కారం ఒక కుటుంబ సభ్యుల్లో పుష్కలంగా ఉంటే ఆ సంస్కారాన్ని ఎట్టి ఆ కుంటుంబాన్ని ఉన్నత కుటుంబంగా ఎవరూ పరిగణించరు

విజయ్ తండ్రి పరాశరరావు తల్లి శమంతకమణి

శమంతకమణి రాయల్ ఫామిలీ నుంచే వచ్చింది

ఎల్లల్ని కనటం పెంచటం వాళ్ళు చేసే నానా అల్లరీ భరించటం లాంటి వంటే ఆమె కసహ్యం కానీ కొత్త మోజు ఉదృతం తగ్గి వాస్తవంలో కొచ్చేసరికే ఆమెకు విజయ్ కడుపున పడ్డాడు

ఆ తరవాత ఇహ మళ్ళీ అలాంటివి జరక్కుండా జాగ్రత్త పడిందామె

అక్క చెల్లెళ్ళూ అన్నదమ్ములూ లేని ఒంటరివాడు విజయ్



## నాకు నచ్చిన సన్నివేశం

**ఈ** సీరియల్‌లో నాకు నచ్చిన సన్నివేశం శ్రీధర్ సౌందర్యల ప్రణయ సన్నివేశం ఈ సన్నివేశంలో మేకవన్నె పులిలాంటి పురుషుల (కొందరు)



విషవలయంలో సౌందర్యలాంటి అబలలు ఎలా చిక్కుకుంటారో చాలా బాగా చిత్రించారు

ఇందులో సౌందర్య పనిచేస్తున్న ఆఫీసుకు క్రొత్త యం డి గా శ్రీదర్ వస్తాడు వారిద్దరూ కలుసుకున్న క్షణం నుండి ఒకరినొకరు ఆకర్షింపబడ్డారు. శ్రీధర్ చెప్పే మాయ మాటల్ని నిజమని నమ్మి తన సర్వసాన్ని అర్పిస్తుంది సౌందర్య తర్వాత బాధపడుతుంది

ఈ సౌందర్య పాత్రను చూసైనా నేటి యువతులు శ్రీధర్‌లాంటి కామాందుల నుంచి జాగ్రత్తపడాలని సూచిస్తున్న ఆదూరి సావిత్రిగారు నిజంగా అభినందనీయులు

యిస్కా జనార్ధనరెడ్డి
జలదంకి (నెల్లూరు)

* * *

**డి.** ఎస్ ఎ విజయ్ రంగారావు స్థావరంలోకి ప్రవేశించి వైజయంతి కొడుకు నానీని తీసుకొని ఆ స్థావరం నుండి తప్పించుకోవటానికి అతి భయంకరమయిన బిలంలోకి దూకటం, నానీని వీపు మీద ఎక్కించుకొని చావుని సైతం లెక్క చేయక బిలంలో ఈదటము స్పృహ కోల్పోయే పరిస్థితి ఏర్పడినా లెక్క చేయక సరి అయిన



మార్గంలోకి రావటం బ్రతికి బట్ట కట్టటం ఓ అద్భుతం ఈ సన్నివేశం సావిత్రిగారికి సీరియల్‌కే ఓ హైలెట్

టి యూన్సీలక్ష్మి
నంబూరు (గుంటూరు)

* * *

**ఈ** సీరియల్‌లో నాకు బాగా నచ్చిన సన్నివేశం శ్రీధర్‌పై ఉన్న పగను



తీర్చుకోటానికి సౌందర్య విజయ్ సహాయాన్ని కోరటం. పతనమైన జీవితాన్ని తలచుకొంటూ కుమిలి పోకుండా తన జీవితం నాశనం కావటానికి కారకుడైన వానిపై కక్ష తీర్చుకోవాలనుకోవటం హర్షించదగ్గ విషయం అతి దారుణంగా ఏమాత్రం సిగ్గు పడకుండా పూస గ్రుచ్చినట్లు ఓ డి.యస్ ఎ కి తెలియచేయడం అభినందనీయం తనలాంటి దయనీయ స్థితి మరి ఏ ఆడదానికీ కలక్కుండా ఉండటానికి ఎన్ని అవాంతరాలయినా ఎదుర్కోవటానికి సిద్ధపడటం ప్రశంసనీయం ప్రతి స్త్రీ సౌందర్యలా ఆలోచించి ధైర్యంతో ముందడుగు వేస్తే సంఘంలో స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాల్ని కొన్నింటినైనా అరికట్ట వచ్చునేమో! సీరియల్‌లో ఓ స్త్రీ పాత్రను సందేశాత్మకంగా రూపొందించినందుకు రచయిత్రికి అభినందనలు

మంతెన విజయలక్ష్మి
విజయవాడ

* * *

**తి**య్యటి మాటలను నమ్మి ప్రేమ మైకంలో పడి పెళ్లి అనే పదాన్ని నమ్మి శ్రీధర్ ఎక్కడికి రమ్మంటే అక్కడకు వెళ్లింది సౌందర్య కాని తను మోసపోయిందని తెలుసుకొన్నాక ఎరికి దానిలాగ ఆత్మహత్య చెసుకోకుండా ధైర్యంగ నిలబడి తనకు జరిగిన అన్యాయానికి శ్రీధర్‌ని ఉరికంబం ఎక్కించడానికి నిర్ణయించుకొన్న ఈ సన్నివేశం ఈ నవలకే ఓ హైలెట్ అందుకే

## డి. ఎస్. పి. విజయ్

అతని పెంపకపు బాధ్యతంతా ఒక ఆయా చూసుకునేది.

అందంగా ఉండే విజయ్ నీట్‌గా.... ఫ్రెష్‌గా తయారయి నప్పుడు, "హలో!" అని ఓసారి పలకరించటంతో తన బాధ్యత తీర్చుకునేది శమంతకమణి.

విజయ్ కూడా ఆమె కొక స్టేటస్ సింబల్‌గా ఉపయోగ పడేవాడు. అతను అందగాడవటం చేత ఆ అదృష్టమైనా దక్కింది.




"శమంతా.... నీ కొడుకు అందంగా ఉంటాడు అని ఫ్రెండ్స్ అభినందించి నప్పు డామె గర్వపడేది. అప్పుడు విజయ్ బుగ్గలు పుణికి ముద్దు పెట్టుకునేది

పరాశర్రావు ఉదయం వెళ్ళాడంటే.... ఇహ అర్ధ రాత్రే ఇంటికి చేరేది అప్పుడు కూడా అతను స్పృహ ఉండలేని స్థితిలో ఉంటాడు

తనకు ఒక కొడు కున్నాడనే సంగతి చాలాసార్లు మర్చి పోతుంటాడు పరాశర్రావు. బిజినెస్ గొడవల్లో అతనికి తీరదు

కొడుకు గురించి చెపుతూ.... వాడి అల్లరిని వర్ణిస్తూ వాడిని బర్త సమీపానికి తీసుకొచ్చి ముద్దు చెయ్యమని కోరుతూ వాడిని బర్త పక్కన పడుకో బెడుతూ.... తండ్రీ కొడుకుల మధ్య సాన్నిహిత్యాన్ని కలిగించటం లాంటి అలవాట్లు శమంతకమణికి లేవు.

ఆమె దృష్టిలో అవి కేవలం లోక్లాస్ ఆడవాళ్ళు చెయ్యాల్సిన పనులు!

ఇంటి నిండా నౌకర్లు చాకర్లు లాంటి హంగులూ ఆర్భాటాలూ పుష్కలంగా ఉండటంతో శమంతకమణికి ఇంట్లో పనీ బాధ్యతా పట్టించు కోవాల్సిన అవసరం లేదు.

ఆ చుట్టు పక్కల పెద్ద ఎత్తున ఆడంబరంగా జరిగే ప్రతి కార్యక్రమానికీ శమంతకమణి ప్రత్యేక ఆహ్వానితురాలు. లేడీస్ క్లబ్ ప్రెసిడెంట్ ఇంకా అనేక సంస్థలకు సంబంధించిన ప్రమేయాలతో శమంతకమణికి కూడా ఒక్కక్షణం ఊపిరి సలపదు. ఇంటి ఖర్చులకు అవసరమనుకున్న డబ్బు పనివాళ్ళకు విజయ్‌కి కావలసినవి కొనటానికి ప్రత్యేకంగా కొంత డబ్బు ఆయాకి ఇవ్వటంతో



ఈ సన్నివేశం నాకు నచ్చింది. ఆడపిల్లలను పెళ్లి చేసుకుంటానని నమ్మించి మోసం చేసే శ్రీధర్ వంటి రోగ్స్‌ని తప్పకుండ ఉరి కంబం ఎక్కించాలి. పరువు ప్రతిష్ట అంటూ పడి చచ్చే మధ్య తరగతి స్త్రీకి పిరికితనమే ఊపిరి అని భావించే శ్రీధర్‌కి ఆడది అబల మాత్రమే కాదు ఆదిశక్తి అని శ్రీదర్ వంటి నీచుల్ని హతమార్చ డానికి తానేమైనా ఫరవా లేదనేకొనే సౌందర్యకి ధైర్యమే ఊపిరి అని శ్రీధర్ తెలుసుకోలేక పోయాడు

-కొల్లి శ్రీదేవి విశాఖపట్నం

★ ★ ★

ఎంతో సస్పెన్స్‌తో నడుస్తున్న డి. ఎస్ పి విజయ్ సీరియల్‌లో శ్రీధర్, సౌందర్య ప్రవేశంతో కొంత విసుగు కలిగింది. కాని శ్రీధర్‌లాంటి మంచి వ్యక్తి దయాగుణుడు ఎక్కడ ఉండరేమో అనుకున్నాను. కాని సౌందర్య దారుణంగా మోసం చేయబడడం చాలా బాధ కలిగించింది. యింత ఘోరంగా మోసం చేసేవారు., మోసపడేవారు ఉన్నారా? అనే ఆశ్చర్యం కలిగింది. సౌందర్య "డి. యస్. పి. విజయ్"ని సహాయం కోరడం కథ ఒక క్రొత్త మలుపుతిరిగింది. విజయ్‌లాంటి ధైర్యశాలి, సమయస్ఫూర్తి ఉన్నవారు ఉంటే, సౌందర్యలాంటి అమ్మాయిలు



సురక్షితంగా ఉంటారు. రచయిత్రికి, యిటువంటి మంచి నవల రచించి నందుకు పాఠకులెంతో ఋణపడి ఉంటారు.

- కె. బి. వి. జి. కృష్ణారావు, విశాఖపట్నం



రంగారావు నిర్మించిన భూగృహంలో బంధింపబడిన డి. ఎస్. పి. విజయ్ అక్కడి నుంచి తప్పించుకోటానికి కనపడిన బిలంలో వెనుకా ముందు చూడకుండా నానీతో సహా దూకేశాడు. వూహించన దానికన్నా భయంకరంగా వుంది దారి. అతి కష్టం మీద ఈదుకుంటూ బయటపడి స్పృహ తప్పిపోయాడు డి. ఎస్. పి. విజయ్. ఇది చదువుతున్నంత సేపు కళ్ళకు కట్టినట్లు వున్న -ఆ సంఘటన నిజంగా చూస్తే ఇంకెంత థ్రిల్లింగ్‌గా వుంటుందో వూహించుకుంటే నాకు ఎంతో ఆనందంగా వుంది.

. కోడూరు సరోజా చంద్రమౌళి, కదిరి (అనంతపురం)

రంగారావు స్థావరం నుండి మరో విధంగా బైటకెళ్లడం అసాధ్యమని ఆలస్యం చేస్తే శత్రువులు రావచ్చని ఆలోచించి ఎదురుగా కన్పించిన బిలంలోకి దూకిన విజయ్ నానీతో సహా మురికి నీటి ప్రవాహంలో పడిపోవడం, దుర్గంధపూరితమయిన దానిలో నానీని వీపు మీద పడుకోబెట్టుకొని ఈదడం ఎంతదారుణమయిన అనుభవం! ముందేం జరుగుతుందో విజయ్ నానీలు బ్రతికి బైటపడతారో లేదోనని ఉత్కంఠతో నిండిన ఆ సన్నివేశం నాకెంతగానో నచ్చింది ప్రాణాలకు



తెగించి కర్తవ్య నిర్వహణకై విజయ్ నానీని కాపాడడం నా మనస్సులో గాఢంగా ముద్ర వేసుకొంది.

. వి. భాగ్యవతి, విశాఖపట్నం □

---

తన బాద్యతలు చక్కగా నెరవేరు ఌస్తున్నట్లు తృప్తి పడేదామె

ఖరీదయిన డ్రస్సులు ఖరీదైన ఆటవస్తువులు విజయ్‌కి పుష్కలంగా ఉండేవి

ఎక్కడో అరుదుగా ఆయాలు తాము పెంచే ఎల్లల్ని కన్నతల్లుల్లా చూస్తారంటారు విజయ్ దురదృష్టం కొద్దీ అతనికి నియమింపబడ్డ ఆయా కూడా శమంతకమణి లాంటి మెంటాలిటీ కలిగిన మనిషే

విజయ్ మొదట్నుంచీ మానసికంగా ఒంటరి

కాన్వెంటులో అతనెవరితోనూ కలవకుండా రిజర్వుడుగా ఉంటూ తన లెసన్స్‌లో లీనమయేవాడు

అతని కెప్పుడూ ఫస్ట్ ర్యాంకే వచ్చేది

ఆ ఏకాగ్రతకీ ఇంటలిజెన్స్‌కీ అతని కొచ్చే మార్కులకీ టీచర్స్ అబ్బురపడేవారు

ఆ విషయం వాళ్ళు చెపితే చిరునవ్వుతో గర్వంగా తల పంకించేది శమంతకమణి అంతకన్నా ఆ ఇంట్లో విజయ్ కొచ్చే ర్యాంకులకూ ప్రయిజులకూ ఏ విధమైన రెస్పాన్స్ ఉండేది కాదు అసలతను ఎవరికీ వాటి గురించి చెప్పేవాడు కాదు

స్కూల్లో రకరకాల ప్రయిజుల్ని భావరహితమైన ముఖంతో క్యాజువల్‌గా అందుకునే విజయ్‌ని చూస్తుంటే ఆశ్చర్యంగా అతని గాంభీర్యం చూస్తుంటె కాస్త జంకుగా ఉండేది టీచర్స్‌కి

ఇది అతని స్కూల్ లైఫ్!

విజయ్ ఫోర్త్ క్లాస్ చదువుతున్నాడు

ఓ రోజు హోమ్ వర్క్ చూపించటానికి మేడం దగ్గర కెడుతు తూలిపడబోయి పక్కనున్న డస్క్‌ను పట్టుకుని ఆపుకున్నాడు విజయ్

ఎర్రటి కళ్ళతో కందినట్లున్న విజయ్ మొహాన్ని చూ ం ఎమయింది?



## డి. ఎస్. పి. విజయ్

అన్నది టీచర్ ఆదుర్దాగా.

"ఫీవర్". అన్నాడు విజయ్.

అతని నుదుటి మీద చెయ్యివేసి చూసింది టీచర్... ఫీవరుందని ఇంటికి పంపేసింది.

విజయ్ వచ్చేసరికి శమంతకమణి ఇంట్లో లేదు...

డాక్టర్ వచ్చి టెంపరేచర్ చూసి, ఇంజక్షనిచ్చి మందులు రాసిచ్చి ఎలా వాడాలో చెప్పాడు...

ఆ విషయాలు చూసుకోవాల్సిన బాధ్యత ఆయాది. విజయ్‌కి టాబ్లెట్ వేసి, కాఫీ ఇచ్చి, బ్లాంకెట్ కప్పి, కిటికీ కర్టెన్లు సరిగ్గా లాగి "ఏమన్నా కావాలంటే పిలు చినబాబూ". అంటూ బయటికెళ్లి పోయింది ఆయా.

ఒంటరిగా తన బెడ్ మీద పడుకుని ఉన్నాడు విజయ్... చెయి చాపి బెల్ నొక్కితే ఆయా వస్తుంది. కానీ... ఆమె అతని ఒంటరితనం పోగొట్టలేదు. అసలు విజయ్ అలా పిలవడు. ఎప్పుడూ లేనిది ఆ రోజు మనసంతా శూన్యంగా... దిగులుగా... బాధగా ఉంది విజయ్‌కి.

ఏదో కావాలనిపిస్తోంది...

కళ్ళలో నుంచి నీళ్ళు వెచ్చగా జారి బుగ్గల్ని తడిపేస్తున్నాయి... వాటిని




తుడుచుకోవాలని లేదు...

ఆ మధ్య ఓ తెలుగు పుస్తకంలో ఒక బొమ్మను చూశాడు విజయ్.

తల్లి తన కొడుకును ఒడిలో కూర్చోబెట్టుకొని లాలిస్తూ అన్నం పెడుతున్న బొమ్మ అది.

"చందమామ కన్న చల్లనిది ఏది?..." అని ఆమె అడుగుతుంటే "మా అమ్మ... మా అమ్మే" అంటున్నాడు వాడు.

"నా బాబే! నా బాబే!" అంటూ వాడిని ముద్దు మురిపాలతో ముంచెత్తుతోందా తల్లి.

ఆ బొమ్మ ... ఆ పద్యం చాలా అద్భుతంగా ఉన్నాయి విజయ్‌కి. ఏదో తెలియని స్పందనకు లోనయ్యాడు తను.

అమ్మ అలా ఉంటుందా!?

పిల్లలకి అంత చనువిస్తుందా!

తరవాత వెంటనే పక్క పేజీలో మరో బొమ్మ.

శుభ్రంగా ఉన్న పెంకుటింటి వరండాలో వాలు కుర్చీలో పడుకున్నాడు తండ్రి. తల్లి అతని ఎదురుగా చంటి బిడ్డను ఒడిలో పెట్టుకొని గుంజ నానుకుని కింద కూర్చుని నవ్వుతూ ఏదో చెపుతోంది. ఒక పాప ఆమె వెనుక... ఒక బాబు తండ్రి వెనుక నిలబడి, వాళ్ళ బుజాలు పట్టుకుని వేలాడుతూ కేరింతలు కొడుతున్నారు. తండ్రి మొహం ప్రసన్నంగా ఉంది...

ఇలా కుటుంబ సభ్యులంతా కలిసి ఒకచోట కూర్చోవటం... సరదాగా నవ్వుకోటం... పిల్లల మొహాల్లో అల్లరి, సంతోషం... వాటిని చూసిన తల్లిదండ్రుల మొహాల్లో ఆ తృప్తి... ఇదంతా ఆశ్చర్యంగా అనిపిస్తోంది విజయ్‌కి.

అలాంటి ఇళ్ళుంటాయా?

అమ్మా నాన్నా పిల్లలతో అలా ఆడుకుంటారా ఎక్కడయినా? విజయ్‌కి ఎక్కువ ఫ్రెండ్స్ లేరు. కొద్దిపాటి చనువున్న నలుగైదుగురు తమ సర్కిల్‌లో వాళ్ళే. వాళ్ళింట్లోనూ తమ ఇంట్లోలాంటి పరిస్థితులే ఉండటంచేత ఇలాంటి అనుబంధాల గురించి అతనికి తెలియదు.

ఆ రెండు బొమ్మలే విజయ్ మనసులో పదే పదే మెదులుతున్నాయి...

తన తల్లినలా ఊహించుకోబోయి అనేకసార్లు విఫలమవుతున్నాడు...

తన దగ్గర ఎవరయినా కూర్చుని జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి ఆప్యాయంగా నిమురుతూ కథలూ కబుర్లు చెపితే బావుండుననిపిస్తోంది.

మమ్మీ వచ్చి కూచో గూడదూ?

ఊహూఁ!

తను అలా అడిగినా కూడా విసుక్కుంటుంది.

అసలు తను అడగడుగా!?

నిస్సహాయతతో కళ్ళలోకి నీళ్ళూరుతున్నాయి విజయ్‌కి.

అంతకంతకూ జ్వర తీవ్రత ఎక్కువవుతోందతనికి...

వాకిట్లో కారాగిన శబ్దమయింది. శమంతకమణి కంఠం వినిపిస్తోంది. ఆమె ఈ రోజు చాలా బిజీగా ఉంది...

వాళ్ళ క్లబ్ తరఫున ఉత్తరప్రదేశ్ లాంగ్ టూర్ వేసుకున్నారు. అక్కడ చలి... వాతావరణంలో మార్పు మొదలైన వాటి వల్ల పిల్లలు ఏదో ఒక సిక్‌నెస్‌తో బాధపడి తమ ప్రాణాలకు సుఖం లేకుండా చేస్తారని... వాళ్ళు లేకుంటే ఫ్రీగా ఎంజాయ్ చెయ్యొచ్చనే ఉద్దేశ్యంతో పిల్లల్ని ఆయాల దగ్గరే వదలి వెళ్ళటానికి నిశ్చయించుకున్నారంతా. ఆ రాత్రికే ప్రయాణం.

కావలసిన వస్తువులు...బట్టలూ దగ్గరుండి సర్దించుకోటం ... ఇంకా మిసెస్ కరుణాకరం ఇంటి కెళ్ళాల్సి రావటం... ఓ పక్క టైమయిపోవటం...వీటితో ఊపిరి తిప్పుకునే వ్యవధి లేక శమంతకమణి ఎవరు పలకరిస్తే వాళ్ళని విసుక్కుని కసిరికొడుతోంది...

"అమ్మా". భయం భయంగా పిలిచింది ఆయా.

"ఏం? నీకేమొచ్చింది? ఏం కావాలి?" విసుగ్గాఅన్నది శమంతకమణి.

"చినబాబుకి జ్వరం".

"అయితే నేనేం చేస్తాను? డాక్టర్‌కి చూపించు. నువ్వున్నదెందుకు? ఇవన్నీ నాదాకా తేవటానికా?"

"డాక్టర్‌కి చూపించినా తగ్గలేదమ్మా ..."

"ఏం జ్వరంట?"

"మామూలు జ్వరమే అంటున్నాడు..."

"తగ్గకపోతే వేరే డాక్టర్‌కి చూపించండి... ఏం వాడమంటే అవి వాడండి. ఈ రెండు వేలూ ఉంచు.ఇంకా అవసరమయితే అయ్యగార్నడుగు. నువ్వు వాడిని జాగ్రత్తగా చూసుకో. పెద్ద డాక్టర్లందరికీ చూపించు..."

"మీరు ఆగిపోతే..."

"షటప్! ఒళ్ళు దగ్గరుంచుకొనే మాట్లాడుతున్నావా? ఎన్ని నెలల్నుంచీ ఈ ప్రోగ్రాం కోసం ప్లాన్ చేసుకుంటూ ఎదురు చూస్తున్నామో! అలాంటిది చివరి క్షణాల్లో నేను ఆగిపోవాలా! పిల్లాడికి జ్వరమని...

నో! ఇంపాసిబుల్!

అసలు... పిల్లలుంటే ఇదే పెద్ద డ్రా బాక్! ఇంకోసారిలా పిచ్చి పిచ్చిగా

పేలక... వాడిని మంచి డాక్టర్‌కి చూపించు. డాక్టర్లందర్నీ పిలిచి ఇక్కడ క్యూలో నుంచో బెట్టు

నేనుంటే మాత్రం ఇంతకన్నా ఏం చేస్తాను? చేత్తో తీసేస్తానా?" అని అరిచి, విజయ్ దగ్గరకొచ్చి, "బాబీ, ఆయా ఉంటుంది. నీకేం కావాలన్నా అడుగు. జ్వరం తగ్గిపోతుందిలే. మంచి డాక్టర్ని పిలిపించమన్నాను. మరి నే వస్తాను. టైమయిపోతోంది" అని వాచీ చూసుకొంటూ హడావుడిగా వెళ్ళిపోయింది శమంతకమణి.

మౌనంగా చూస్తూ వుండి పోయాడు విజయ్.

తన దగ్గర కూచోమని తల్లిని బ్రతిమాలలేదు.

"అమ్మలంటే తన మమ్మీ... అరుణ్, వంశీ, వైణిక.. వీళ్ళ మమ్మీల్లా ఉంటారు గానీ.. అలా పుస్తకంలో వేసినబొమ్మల్లా ఉంటారా?

ఎలా ఉంటారు? అబద్ధం.

మమ్మీ తన జ్వరం సంగతి కూడా పట్టించుకోకుండా టూరెళ్ళి పోయిందిగా?

అలాంటిది...అస్ట్రాల్! అన్నం తినకపోతే అంతగా దగ్గరకు తీసుకుని బ్రతిమాలతారా!?"

ఆ చిన్ని మనసు ఈ రెంటికీ సమన్వయం కుదుర్చుకో లేకపోతోంది.

అయినా... అలాంటి ఆప్యాయతను ఎలాగోలా తను కూడా పొందగలిగితే బావుండుననే ఆశ ఆ పసి మనసులో సుడులు తిరుగుతోంది...

ఆ ఆశతో పాటే అతనూ పెరిగి పెద్దవాడయ్యాడు గానీ ఆ కోరిక మాత్రం ఎప్పుడూ తీరలేదు విజయ్‌కి.

ఆ విషయం చేదుగా అనిపించినా... దాన్ని నిశ్శబ్దంగా భరించేవాడు.

రానూ రానూ అతను తన చుట్టూ ఓ గిరి గీసుకొని, ఆ ఒంటరి ప్రపంచంలో తానొక్కడే తన ఊహల వెంట విహరిస్తూ ఉండటం అలవాటు చేసుకున్నాడు.

ఇంకోరి గురించిన ఆలోచన తన మనసులో చోరనివ్వకుండా జాగర్త పడేవాడు.

వయసుకు మించిన గాంభీర్యం... నిర్లక్ష్యం అతని మొహంలో ప్రతిఫలిస్తూ ఉండేవి.

విజయ్ బి. ఎ. లో కొచ్చేసరికి తండ్రి హార్ట్ ఎటాక్‌తో చనిపోయాడు...

ఆస్తి, అధికారం పూర్తిగా హస్తగతం చేసుకున్న శమంతకమణి అహంభావానికి, దర్పానికీ పట్టపగ్గాల్లేవు... ఔట్ హవుస్‌ను ఓ కుటుంబానికి అద్దెకిచ్చిందామె.

"వాళ్ళు బీదవాళ్ళు. ఏదో... సాయం చేసినట్టూ వుంటుంది. కొంపకు కాపలాగానూ వుంటారు అనిపించి ఆ ఇల్లు అతి తక్కువ అద్దెకు వాళ్ళకిచ్చాను. వాళ్ళను చూస్తే నాకు జాలి. మావారికెక్కడో దూరపు చుట్టాలవుతారట". అని వాళ్ళ గురించి తన ఫ్రెండ్స్‌తో చెప్పుకుని అహానికింకాస్త వన్నె పెట్టుకుంది శమంతకమణి...

ఔట్ హవుస్‌లో దిగిన కుటుంబపు యజమాని మాధవరావు. స్కూల్ టీచరు. ఆయన భార్య అరుంధతి. వాళ్ళకిద్దరమ్మాయిలు, ఒక అబ్బాయి.

పెద్దమ్మాయి వైజయంతి. ఇంటర్ చదివేది.

చిన్నమ్మాయి సెవెంత్... అబ్బాయి ఫిఫ్త్.

మొత్తం అయిదుగురు సభ్యులు.

మాధవరావు సాయంత్రం స్కూలు నుంచి వచ్చాక అంతా కలిసి వరండాలో కూర్చొని కబుర్లు చెప్పుకునే వారు. అప్పటికి అరుంధతి కూడా పని ముగించుకుని, తను చేసి వుంచిన టిఫిను ఒక పళ్ళెంలో పెట్టుకొచ్చేది.

సరదాగా మాట్లాడుకుంటూ ఆప్యాయంగా తినేవారు. ఒక మిపపరొట్టెను తెచ్చి అయిదు ముక్కలు కోసేది. తలాఒక ముక్కా తీసుకునేవారు...

చిన్న పిల్లలు పోట్లాడుకుంటుంటే వైజయంతి వాళ్ళని విడదీసి సర్ది చెప్పేది. వాళ్ళు మళ్ళీ స్నేహంగా కలిసిపోయేవారు. ఆ అమ్మాయి మొహంమీద చిరునవ్వు ఎప్పుడూ చెదిరినట్టు కనిపించేది కాదు.

తమ ఇంటి డాబా మీద బాల్కనీలో కూర్చుని, పేపరో, పుస్తకమో అడ్డు పెట్టుకుని వాళ్ళని కుతూహలంగా గమనించేవాడు విజయ్.

తను చిన్నప్పుడు చదివిన తెలుగు పుస్తకం ... అందులో బొమ్మలు గుర్తొచ్చేవతనికి.

ఆ బొమ్మకిలా రూపకల్పన జరిగి తన కళ్ళెదుట నిలబడటం థ్రిల్లింగ్‌గా ఉండేది విజయ్‌కి.

సాధ్యమయినంత వరకూ సాయంత్రాలు ఆ దృశ్యాన్ని మిస్సవకుండా చూసుకొనేవాడు.

ఎప్పుడయినా వాళ్ళలా సమావేశం కాకపోతే అతనికి దిగులుగా. ఏదో పోగొట్టుకున్నట్టుగా ఉండేది.

విజయ్ వాళ్ళ తోటలో ఒక వేపు చెట్ల మధ్య ఆడుకొంటానికి వీలయేలా కొంత ప్రదేశం అమర్చబడింది.

అందం కోసమేగానీ దాన్నెవరూ ఉపయోగించేవారు కాదు.

సాయంత్రాలు శమంతకమణి ఇంట్లో ఉండక పోవటంతో... ఆదివారం పూట... ఆ చాటు ప్రదేశంలో... తమను అభ్యంతర పెట్టేవారెవరూ ఉండరు గనక




వైజయంతి, ఆమె చెల్లెలూ తమ్ముడు ఫ్రీగా ఆడుకునేవారు.

సెలవు రాగానే ఆటల కోసం అక్కడికి వెళ్ళిపోయేవారు. అలాంటప్పుడు వాళ్ళేం ఆడుకుంటారో చూడాలని కుతూహలంగా ఉండేది విజయ్‌కి.

మేడమీద నుంచి చూస్తే... చెట్లు అడ్డం ఉండటం మూలాన పూర్తిగా కనపడేది కాదు.

మరీ పైకి వెళ్ళి చూడటం మొదలెడితే... వాళ్ళు పొరపాటున తలెత్తితే తను కనపడతాడు. వాళ్ళిహ ఆటలాపేసి వెళ్ళిపోతారేమోనని భయపడేవాడు.

ఒక రోజు కుతూహలం ఆపుకోలేక చెట్ల చాటున నిలబడి వాళ్ళని గమనించసాగాడు విజయ్...

వాళ్ళ ఆటలు సరదాగా... తమాషాగా ఉన్నాయతనికి... ఇసకని పొడుగ్గా కుప్ప పోసి, అందులో ఒక పుల్లని దాచి పెట్టారు. దానిమీద రెండు చేతుల వేళ్ళని మెలికవేసి పట్టుకుని కుప్ప మీద ఒక చోట అడ్డంగా పెట్టారు. మిగినవాళ్ళు చేతికి అటూ యిటూ ఉన్న ఇసకని వెతుకుతారు... పుల్ల దొరికితే గెలిచినట్టు. లేకుంటే చేతులతో మూసిన వాళ్ళు గెలిచినట్టు.

గెలిచినవాళ్ళు ఓడిన వాళ్ళ చేతిలో ఇసక, పుల్ల పెట్టి, కళ్ళు మూసి ఎక్కడో పోయించి, వెతకి పుల్ల తెమ్మంటారు మళ్ళీ.

# ప్రమదల ప్రాముఖ్యం




ధర్మపథం

వెనుకటి కాలంలో స్త్రీలను అన్ని విధాలా అడుక్కి త్రొక్కి వేశారనీ, పురుషులతోపాటు సమాన ప్రతిపత్తి యిప్పుడు ఉన్నందున అన్ని రంగాలలోనూ మహిళలకు అభ్యున్నతి కలుగుతున్నదనీ చాలామంది అనుకుంటున్నారు.

మన ప్రాచీనులు మహిళలకు తగిన మర్యాద ఇవ్వలేదని అనుకోవడం పొరపాటు. మానవుల్లోనే కాదు, దేవతలలో కూడా స్త్రీలకే ప్రాధాన్యం. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టి, స్థితి, లయాలకు కారణభూతులు. అయితే మనిషి సుఖజీవనానికి అత్యంతావసరాలైన విద్య, సంపద, విజయం కావాలంటే వారి సతీమణులనే ఆశ్రయించాలి. అనాది నుంచీ ఆది విద్య అయిన వేదం బ్రహ్మ యొక్క ముఖం నుండి వెలువడినా, మనకు విద్య రావాలంటే సరస్వతీదేవినే ఆరాధించాలి. ఆమె విద్యల కధిదేవత. ఆమె అనుగ్రహం లేనిది చదువు అబ్బదు. అందువల్ల విద్యకోసం సరస్వతీదేవినే పూజిస్తారు కాని, బ్రహ్మను ఎవ్వరూ పూజించరు.

"నహిత ద్విద్యతే కించిత్ యదర్థేన నసిద్ధ్యతి" అనేది ఆప్త వాక్యం. ధనంవల్ల సాధింప రాని దేదీ లేదని దీని భావం. శ్రీసూక్తంలో "ధనం మే జుషితాదేవి! సర్వ కామార్థ సిద్ధయే" అని ఉన్నది. "నా కోరికలన్నీ తీరుటకు అవసరమయిన ధనాన్ని నా కనుగ్రహించు" అని దేవిని ప్రార్థించడం దానిలోని భావం. ఆ సంపద కోసం లక్ష్మీదేవిని పూజించాలి. ఆమె లేని గృహంలో దరిద్ర దేవత తాండవిస్తుంది. వ్యాపారస్తులు మరే దేవతనూ పూజించినా, పూజించక పోయినా సంపద కారణంగా లక్ష్మీదేవిని తప్పక పూజిస్తారు. ఆపదల నుండి రక్షించడానికి, కార్యంలో విజయం సాధించడానికి దుర్గను పూజిస్తారు. పూర్వం రాజులు దుర్గాదేవిని పూజించి యుద్ధాలకు వెళ్ళి విజయం సాధించేవారు.

పూర్వం మహిళ గృహంలోనే ఉండేది. కాబట్టి గృహిణి అనే పేరు ఆమెకు సార్థకమయింది. అతిథ్యభ్యాగతులకు భోజనం పెట్టడం విధిగా భావించేది. బిచ్చగానికి బిచ్చం ఆమెయే వేస్తుంది. బిచ్చగాడు "అమ్మా! బిచ్చం" అంటాడు గాని, "అయ్యా! బిచ్చం" అని అడుగడు కదా! పిల్లలకు నీతినీ, విద్యనూ ఆమే బోధించేది. వాళ్ల బాగోగులు చూచుకునేది ఆమెయే!

పురుషులతో సమాన హక్కులూ, స్వాతంత్ర్యం గల నేటి మహిళల్లో చాలా మంది ఉద్యోగాలు చేస్తున్నారు. వారు ఆఫీసులకూ, ఇతర ఉద్యోగాలకూ పోయి సాయంత్రంగాని ఇల్లు చేరడం సాధ్యం కాదు. పిల్లలను చూసుకోడానికి సమయం ఉండదు. పిల్లల్లో సత్ప్రవర్తన లోపించడానికి ఇదొక కారణం. మహిళలు హక్కులతోపాటు బాధ్యత వహించి, పిల్లల భవిష్యత్తు గమనిస్తూ, తమ ప్రాముఖ్యాన్ని నిలుపుకోవడం అవసరం.

- బులుసు వేంకటరమణయ్య

## డి. ఎస్. పి. విజయ్

ఆ ఆట పేరు దూదుం పుల్లాట!

కొంచెంసేపు ఆ ఆట ఆడాక దాక్కుంటే కనుక్కోవటం ఆట మొదలెట్టారు.

దాక్కోటానికి విజయ్ ఉన్న చెట్టు చాటుకొచ్చింది వైజయంతి. ఆమె తననెక్కడ గమనిస్తుందోనని ఊపిరి బిగపట్టి చూస్తున్నాడు విజయ్. తను కదిలితే... ఆ అలికిడి కామె వెళ్ళిపోతుందేమో. ఇద్దరికీ మధ్య కొద్దిగా చాటుంది.

వెనక్కి చూసుకోకుండా ముందుకే చూస్తూ నెమ్మది నెమ్మదిగా వెనక్కు జరుగుతోంది వైజయంతి. ఆమె చూపులన్నీ దొంగ అయిన తమ్ముడి వేపే ఉన్నాయి....

అతనికి బాగా సమీపంగా వచ్చిందామె. ఆమె జడలో మల్లెపూలు అంటీ అంటనట్లతని షర్టుని తాకాయి. చివ్వున వెనక్కు తిరిగిన వైజయంతి అతని మెడ వరకూ వచ్చింది. తనకంత దగ్గరగా నిలబడ్డ విజయ్‌ని చూచి బిత్తరపోయి కెవ్వునబోయి బలవంతాన ఆపుకుంది...

ఉన్నట్లుండి తూనీగలాగ బయటకు పరుగెత్తింది వైజయంతి...

అలాగే నిలబడిపోయాడు విజయ్ ఏమీ తోచనట్లు...

ఒక్క పరుగున వచ్చి వైజయంతిని పట్టుకుని "నువ్వు ఔట్! ఇహ నువ్వు కుంటుతూ వచ్చి మమ్మల్ని పట్టుకో అక్కా!" అంటూ నవ్వాడు వైజయంతి తమ్ముడు.

"నువ్వూ స్రవంతీ ఆడుకోండి వాసూ. నేనీ బెంచి మీద కూర్చుని చూస్తుంటాను" నెమ్మదిగా అన్నది వైజయంతి.

ఆమె ముఖం సిగ్గుతో కంది ఉన్నది.

ఆమెకు విజయ్ తెలుసు. ఇద్దరూ ఒక కాలేజీలోనే చదువుతున్నారు. అతనంటే ఆమెకు చాలా ఇష్టం. ఆ ఇష్టాన్నామె మనసులోనే దాచుకుంది. అతని గురించి ఆమెకు కొంత తెలుసు. కొంత ఊహించింది. అతని కళ్ళలో కనపడే నిర్లక్ష్యం ఆమెకు బెదురునూ... ఒంటరితనం జాలినీ కలిగించేది.

తనను చూడగానేఅతని మొహం ప్రసన్నంగా మారటం ఆమె గమనించింది. కానీ... అతనెప్పుడూ ఆమెను పలకరించే ప్రయత్నం చెయ్యలేదు.

(ఇంకా ఉంది)

# ఫ్యాంటసీ టివి వెనకనున్న అత్యుత్తమ సాంకేతికత మిగతా సాధారణ టివిల కంటే ఫ్యాంటసీని ముందుంచుతుంది.

### ఫ్యాంటసీ కలర్ టివి ప్రత్యేకత ఏమిటి ?

ఫ్యాంటసీ టివి మాత్రమే ప్రపంచంలో కెల్ల ఉన్నతమైన సాంకేతిక పరిజ్ఞానం ఉన్న ఫిలిప్స్ వారి సర్క్యూటరీ,పిక్చర్ ట్యూబు మిగితా విడి భాగాలతో సంతరించుకున్నది.

ప్రతి టివి సెట్టు ఎంతో జాగ్రత్తగా మీ కోసం మలచబడుతుంది. ప్రతి ఫ్యాంటసీ టివి నిజ జీవితాన్ని పోలిన రంగులు, ఉత్తమ గ్రహణ శక్తి ఉండేలా తీర్చిదిద్దుతారు.

ఫ్యాంటసీ టివి ఒక సంవత్సరం వారంటిలో వస్తుంది. అత్యుత్తమమైన పిక్చర్ ట్యూబుకి మూడు సంవత్సరాల గ్యారంటిని అందిస్తుంది.

ఇన్ని హంగులిని సంతరించుకున్న ఫ్యాంటసీ టివి, అద్భుతమైన సేవా సౌకర్యాన్ని ఫోనంతదూరంలో అందిస్తుంది.

ఫ్యాంటసీ టివి మీరు కలలుకన్న టివి.వెంటనే మీ దగ్గరలో నున్న టివి డీలరు దగ్గరకు వెళ్ళి చూడండి. ఫ్యాంటసి అందచందాలు మీరు నిర్ణయించేలా చేస్తాయి.








MAA(S) VE.R 87

# FANTASY

జీవితాంతం జాగ్రత్తలో మీ పెట్టుబడి.

## పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

"చిన్నారి బాలల దీనగాథలు 'చదువుతుంటే. వింటుంటే కఠిన మనస్కులయినా చలించక మానరు. ఎందుకిలా జరుగుతోందని తలచుకుంటే లక్షల కారణాలు. పిల్లలకోసం ప్రభుత్వం సమకూరుస్తున్న సౌక




ర్యాలు మధ్యలోనే 'గుటకాయస్వాహా' అయిపోతున్నాయి. కేవలం కాయితాలమీదనే పథకాలు అభివృద్ధి చెందుతున్నాయి తప్పితే ఆచరణలో జరుగుతోంది శూన్యం!?... కారణం ఏమిటి? మనం పిల్లలమీద కనీస ఆదరణని చూపలేకపోతున్నాం. అం మనకెందుకులే అనుకుంటున్నాం!! ఈ విధమయిన అలసత్వం ముఖ్యంగా, చాలా ఎక్కువగా రాజకీయ నాయకుల్లోనూ, అధికారుల్లోనూ కనిపిస్తుంది. 'పిటీ' ఏమిటంటే బాలల సంక్షేమం గురించి వేదికలెక్కి మైకులు పగలకొట్టే రాజకీయ నాయకులు, కాయితాలు ఖరాబుచేసే అధికారులు స్వంతం పిల్లలచే వెట్టిచాకిరీ చేయించుకుంటున్నారు. ఇది భరించరాని నిర్లక్ష్యం - అధికారంలో ఉన్నవారు నిర్మించుకొన్న రెస్టారెంట్లలోనూ, ఫ్యాక్టరీల్లోనూ బాల కార్మికులు వెట్టిచాకిరీ చేస్తున్నారు. ఇది బాధాకరమయిన విషయం!

అంతెందుకు, దీపావళి సామానుకు ప్రసిద్ధి చెందిన 'శివకాశి'లో టపాసులు తయారీకి శ్రమ పడేది, చాకిరీకి గురైయ్యేది మైనారిటీ బాలలుకదూ? అక్కడ పనిచేసే వారిలో సగానికిపైగా అంటే 60 నుంచి 80 శాతం వరకూ పిల్లలే! చాలా పల్లీగ్గా, హోల్‌సేల్‌గా పిల్లలచేత వెట్టిచాకిరీ చేయించబడుతోందక్కడ! ఏవైనా ప్రమాదాలు సంభవిస్తే ఆ లేత వాళ్ళని కాపాడ్డానికి కనీస రక్షణావసరాలు ఉండవక్కడ! మరి రాజకీయవాదులకు, 'అభ్యుదయం' అంటూ అరిచే ఆదర్శవాదులకు ఆ నగ్న సత్యం కనిపించటం లేదా? 'దీపావళి'నాడు మనం వందలు వందలు, వేలకు వేలు ఖర్చు పెట్టి కొన్ని గంటల కాలాన్ని టపాసులు కాలుస్తూ వృధాగా ఖర్చు పెడుతున్నామే కానీ ఒక్క క్షణం... కనీసం ఒక్కటంటే ఒక్కక్షణం వారి బాధాతప్త జీవితాల గురించి ఆలోచిస్తున్నామా? లేదు. మన కెందుకులే అని మన్ని మనం మోసం చేసుకుంటున్నాము. మనలో నే లోపం వుంది.

'పిల్లలు దేమునితో సమానం' అని




ఒకప్పుడు అన్నారు. అవున్నిజమే. ఇప్పుడు చాలామంది ప్రజలు దేముణ్ణి మరచినట్టే పిల్లల్ని కూడా మరచిపోతున్నారు. బాలల దీన పరిస్థితి చూస్తుంటే గుండె తరుక్కుపోతుంది. మహాత్మాగాంధి, చాచా నెహ్రూలు కలలుగన్న రేపటి పౌరులు వీరేనా అనుకునేట్టు పరిస్థితి తలక్రిందులయిపోయింది. పెద్దలు పిల్లలపట్ల ఆప్యాయతానురాగాలని చూపాలి. సమాజం అంటే మనమే! మనమంతా చిన్నారి పిల్లలపట్ల వక్ర చూపు చూడకూడదు. అలా మనం ప్రవర్తిస్తే ఈ బాలల్లోంచే మరో చార్లెస్ శోభరాజు ఉదయిస్తాడు. మరో పూలన్‌దేవి జనిస్తుంది. మన సమాజానికే అది ముప్పు కాగలదు.

బాలల సంక్షేమం పట్ల ఏ జనవరి 26 నో, ఆగస్టు 15 నో, నవంబర్ 14 నో నాలుగు పడికట్టు మాటలు మాట్లాడి పిల్లలకి నాల్గు చాక్లెట్లు పంచి, సలామ్ కొట్టించుకొని, పూలదండలు వేయించుకుంటే సరిపోదు - ఎవిరికైనాను. ప్రస్తుతం ఉన్న చట్టాల్లోని లోటుపాట్లని సరిదిద్దాలి. బాలలను హింసించి పని చేయించుకునే వారిపట్ల నిర్దయగా ప్రవర్తించాలి. కఠిన చర్యలను అమలు పరచాలి. బాల సంక్షేమం పట్ల శ్రద్ధ చూపించటం ప్రభుత్వ కర్తవ్యం అని మనం భావించ కూడదు. ప్రభుత్వం అంటే మనమే కదా!? మన వంతు ధర్మాన్ని మనం నిర్వహించాలి.

మతకల్లోలాలు, టెర్రరిజం వంటి అరాచకత్వాలవలన అనాథ బాలలు ఎక్కువయ్యే అవకాశం ఉంది. అటువంటివాటిని సమర్థవంతంగా మళ్ళీ తలెత్తకుండా అణిచివేయాలి. ఈ అణచివేతలో మనమూ పాలు పంచుకుందాం!...

అంతా, మనమంతా బాలల సంక్షేమం పట్ల శ్రద్ధ చూపుదాం! దీక్ష పూనుదాం!! ఇక భవిష్యత్తులో చిన్నారి బాలల దీన గాథలు కాన రాకుండా చేయి చేయి కలిపి పని సాధిద్దాం!...: ఇది మనందరి ప్రప్రథమ కనీస కర్తవ్యం!!

-తమ్మన దుర్గాప్రసాదరావు,
తిరువూరు

---

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు: ..............................

పూర్తి చిరునామా: ..............................

..............................

..............................

పిన్‌కోడ్:




# శ్రావణి

పాలడుగు వెంకటేశ్వరరావు

నల్ల నల్లగా తెల్లగా తెల్లగా ఆకాశాన్ని కప్పేసాయి మబ్బులు. చినుకు మీద చినుకు. ఎముకల్ని గజ గజలాడించే చలిగాలి. శాలువ కప్పుకున్నా ఆగని దాని దూకుడుతనం. వకొకప్పుడు విధి విధానాలూ అలాగే వుంటాయ్.

కిటికీ దగ్గర కూర్చుని శూన్యంలోకి ఆలోచిస్తూ వుంది వసంత. శూన్యంలోకి. ఆలోచిస్తూ ఉంది వసంత. శూన్య అనంతంగా నల్లని తెరలు కప్పుకున్న శూన్యం. అయోమయంగా అన్పిస్తున్న నీరవ నిశ్శబ్దం.

మువ్వలు మోగించుకుంటూ బరువయిన బండిని లాగుకుని పోతున్న ఎద్దుల అడుగులు చప్పుడు. 'ఎహెయ్' బండిని తోలేవాడి అరుపులు. రిక్షాల మోతలు.

వసంత తల తిప్పింది., వెనుకవయిపు బరువుగా.

ఆమె వెనకాల మెత్తగా, అడుగుల చప్పుడు. చిరపరచితమయినవే ఆ అడుగులు.

"వసంతా! వసంతా"

"నేను ఇక్కడ వున్నాను నాన్నా" అంది వసంత.

"చీకట్లో వంటరిగా కూర్చుని ఏం చేస్తున్నావమ్మా?" ఆప్యాయంగా తలమీద చెయ్యి వేసి నిమిరారు ఆయన.

"స్టేషన్‌కు నువ్వూ వస్తావా?" అడిగారు.

రానన్నట్టు తల అడ్డంగా వూపింది వసంత. "మీరు వెళ్లి రండి నాన్నా" అంది.

"నువ్వు వస్తే కృష్ణ సంతోషిస్తాడమ్మా".

"బాగా చలిగా వుంది నాన్నా. రావాలనిపించటం లేదు."

"సర్లే నేను వెళ్లి వస్తానులే? నీరసంగా అన్నారు.

"వస్తాను తల్లీ" భారంగా అని-

# శ్రావణి

నాన్న గారు వడి వడిగా వెళ్ళిపోయారు ట్రయిన్ వచ్చే టయమయినట్లుంది కొన్ని నిముషాల్లోనే కారు స్టార్టు అయి వడిగా దూసుకు పోయిన సవ్వడి విన వచ్చింది; పోర్టికో నుంచి.

కృష్ణ నించి మూడు రోజుల క్రిందటనే వుత్తరం వచ్చింది. అప్పటి నుండీ, ఇంట్లో ఎంతో హడావిడి. నాన్న కాలు వక చోట నిలవదు. అమ్మ సంగతి చెప్పనే అక్కరలేదు. పద్మ మాటలలో ఎంతో ఎక్సయిట్‌మెంట్! కృష్ణ రాసిన లెటర్ ప్రకారం, అతను ఆ రోజు 'తమిళనాడు'లో దిగాలి. అతన్ని రిసీవ్ చేసుకోవడానికే నాన్నగారు హడావుడిగా స్టేషన్‌కి వెళత! పద్మకూడా వెళుతున్నట్లుంది.

సుమారు పదిహేనేళ్ళ క్రితం నాన్న వూరెళ్ళి, వారం రోజులుండి పోయారు. వారం తరువాత వస్తూ వస్తూ తన కూడా వక పన్నేండ్ల కుర్రాడ్ని తీసుకుని వచ్చారు. బెరుగ్గాచూస్తూ చూస్తూ కొత్త కొత్తగా నిలబడి వున్న ఆ కుర్రాడు ఎర్రగా బుర్రగా జాంపండులా వున్నాడు. వసంతా, పద్మా దూరంగా నిలబడి చూసారు అతన్ని. అతను వాళ్ల ఇంట్లోనే వుండి పోయాడు. వసంతా వాళ్ళతో పాటే, వాళ్ళ స్కూలులోనే చేరేడు అతను.

అమ్మా నాన్నా అనుకుంటూ వుండగా వింది వసంత. అతను తనకి మేనబావ అవుతాడు. అతని తల్లి నాన్నకి వక్కగానొక్క చెల్లెలు. తండ్రి చిన్నప్పుడే పోయాడు. తల్లి పోగా- అప్పుడు, నాన్న వెళ్ళి అతన్ని తనతో తీసుకుని వచ్చాడు.

"కుర్రాడు బుద్ధిమంతుడు. మనకి మాత్రం తక్కువేముంది? మన దగ్గరే వుంచి పెద్దవాడ్ని చేద్దాం" అని నాన్న అనగానే, అమ్మ సంతోషంతో వప్పేసుకుంది.

పద్మ వట్టి చిలిపిది. కృష్ణని ఆట పట్టించేది. ప్రతి దానికీ, వసంతే, పద్మని కంట్రోల్ చెయ్యటాన్కి ప్రయత్నించేది. అయినా పద్మ వినదు. చిలిపితనం.

కృష్ణ తెలివితేటలు అమోఘం. ప్రతి క్లాసులోనూ ఫస్టు మార్కు అతనిదే. పద్మ ఉడుక్కునేది. తమ ఇద్దరికీ అత్తెసరు మార్కులు వచ్చేవి. అందుకని పద్మ అతన్ని సూటి పోటి అనేది. కృష్ణ అవేమీ పట్టించుకొనేవాడు కాదు. నవ్వేసేవాడు.

యస్సెస్సీ ఫస్టు క్లాసులో పాసవగానే, అతన్ని పట్నంలో మంచి కాలేజీలో చేర్పించేరు నాన్నగారు. అక్కాచెల్లెళ్ళిద్దరూ ధింకీలు కొడూ వుండిపోయేరు. సెలవుల్లో తమ ఇంటికి వచ్చి అక్కడే గడిపి వెళ్ళేవాడు కృష్ణ. అతనున్నన్నాళ్ళూ సర్దాగాగడిచిపోయేది.

అతనంటే నాన్నకి ఎంతో గారాబం. అమ్మ కూడా అంతే. స్వయంగా కనకపోయినా, పెంచిన ప్రేమ ఆమె గుండెల్ని అమృతభాండాల్లాగా చేసింది.

శ్రావణమాసం. వర్షంలో తడుచుకొంటూ ఇల్లు చేరేడొకసారి, కృష్ణ.

"అయ్యో! అయ్యో! పూర్తిగా తడిసిపోయేవు, నాయనా! అంది అమ్మ లబలబలాడూ.

"ఫర్వాలేదు అత్తయ్యా!- కృష్ణ పెదాలపై చిరునవ్వు. కృష్ణ చేతిలో తడిసి ముద్దగా అయిన పొట్లం సోఫాలో కూర్చుని అదేం పట్టనట్లు వీక్లీలు తిరగేస్తున్న అక్కచెల్లెళ్ళ దగ్గరికి వచ్చి పొట్లాం విప్పి, ఎదురుగా టీపాయ్ మీద పెట్టేడు, శ్రద్ధగా.

"వసంతా! ఇవి మీ కోసం తెచ్చాను! అన్నాడు.

వసంత కళ్ళు విప్పార్చుకుని చూసింది. పెద్ద పెద్ద మల్లెలు సువాసనల్ని గుభాళిస్తూ తెల్లగా, అందంగా, స్వచ్ఛందంగా, స్నేహపిచ్చిలంగా.

"చాలా కష్టపడ్డట్టున్నావ్ బావా" ఎగతాళిగా అంది పద్మ.

"నీ గురించి కాదులే పద్మా" నవ్వాడు.

"వసంత సిగ్గుపడింది. పద్మ రోషంతో ముక్కుతెగరేసింది.

"ఈ కాలంలో ఇవి దొరకటం అరుదు అందుకే అందమయిన అమ్మాయిల కొరకు అపురూపమయిన ఈ పువ్వుల్ని ఎంతో కష్టపడి సాధించి తెచ్చాను" గర్వంగా అన్నాడు కోపంతో షద్మ లేచి అవతలికి వెళ్ళిపోయింది

"ఎందుకే అంత కోపం". అమ్మ అంది

"థాంక్సు బావా" అంది వసంత.

"వెల్‌కమ్".

సన్నని దారాల్లాగా ఆకాశం నించి జారి దొర్లుతున్నయి వర్షపు ధారలు. వాటినే తదేకంగా చూస్తూ కిటికీ దగ్గర కూర్చుని వుంది వసంత. కాలేజిలో ఏదో ఫంక్షనుంటే వెళ్ళిన పద్మ ఇంకా రాలేదు. అమ్మ నాన్నగారు, షాపింగుకని వెళ్ళేరు. ఇంకా రాలేదు.

ప్రకాశంజిల్లా పోలీసు క్రీడోత్సవాల సందర్భంగా ఒంగోలులో జరిగిన సాంస్కృతిక కార్యక్రమంలో కూచిపూడి నృత్య ప్రదర్శన చేసిన కుమారి వి. వి సత్యరంగ.



రెండు చేతులు వెనుక నుండి కళ్ళు మూసేయి మృదువుగా, సుతారంగా.

"అమ్మో!" వులిక్కిపడింది వసంత. ఆ చేతుల్ని విడదీస్తూ, కంగారుగా.

"అమ్మాయిగారికి అంత కంగారయితే ఎలా?నాకెంతో ఇష్టమయిన ఆ పెద్ద పెద్ద కన్నుల్ని అంతసేపు అల్లా విప్పార్చి చూస్తే ఎల్లాగ?"

"నువ్వా బావా! ఎప్పుడొచ్చేవు?"

"ఇప్పుడే.ట్రయిన్ దిగి నిన్ను చూడాలని ఆత్రుతతో వేగిరపడి వచ్చేశాను. నా దురదృష్టం. అమ్మాయిగారి ఆలోచనలు వాన చినుకులకే అంకిత మయినట్లున్నాయ్!"

వసంత సిగ్గుపడింది బుగ్గలు కెంపులయ్యాయి సన్నగావణుకు

"బాత్ రూమ్‌లో వేడినీళ్ళున్నాయ్. స్నానం చేసి రా బావా. వేడి వేడి కాఫీ ఇస్తాను" అంది ఆనందంగా.

అనర్సుతో ఇంజనీరిగ్ పాసయిన కృష్ణ, ఆ మరుసటి ఏడాది ఐ ఏ. ఎస్. లో ర్యాంకు తెచ్చుకొన్నాడు. ట్రయినింగ్‌కని 'ముస్సోరీ' వెళ్ళేడు. తెలిసిన నలుగురూ అభినందిస్తూ వుంటే నాన్న కళ్ళలో గర్వం! అమ్మ ఆనందానికి అవధుల్లేవు!

శ్రావణ శుక్రవారం. స్నేహితురాలు సరళ పేరంటానికి పిల్చింధి. తిరిగి వచ్చేసరికి, కుండపోతగా వర్షం. కారులోంచి దిగి, చీర అంచుల్ని ఎత్తిపట్టుకుని సుతారాంగా - తడి అవకుండా, గుమ్మం దగ్గరికి వచ్చి కేకేసింది వసంత.

"నీళ్ళు నీళ్ళు".

తక్షణం నీళ్ళతో వున్న స్టీలు చెంబు ప్రత్యక్షమయింది. అందుకుని, కాళ్ళు కడుక్కుంటూ- అనుకోకుండా, అప్రయత్నంగా,

పసుపు రాసిన పాదాలు- వాటి నలంకరించిన వెండి పట్టాలు, బొటన వ్రేళ్ళకి మట్టెలు- వాట్నే చూస్తూ పరవశంతో ఆనందిస్తున్న, కృష్ణని గమనించి వులిక్కిపడింది.

"నువ్వా బావా! ఎప్పుడొచ్చావ్!-" ఆనందం! తత్తరపాటు. "ఇందాకే. దేవిగారు పేరంటానికి వెళ్ళగానే... దురదృష్టవంతుడ్ని. దేవి దర్శనం ఇంత సేపటిగ్గాని..."

"అయామ్ సారీ బావా! ఆ చెంబుతో నీళ్ళు..."

"ఇటీజ్ మై ప్లెజర్ వసంతా! ఆమాత్రం కష్టపడక పోతే, ఈ సుందర మనోజ్ఞమయిన దేవి పాద దర్శనం నాకు అయ్యేది కాదు గదా! అది నా అదృష్టం అనుకుంటున్నాను వసంతా!"

"చాల్లే. ఇక ఎప్పుడూ ఇటువంటి పన్లు

చెయ్యొవద్దు"హెచ్చరించింది, చిరు కోపంగా.

"ఇందులో తప్పేముంది? ఇంట్లో ఎవరు లేనప్పుడు ఆమాత్రం సేవ చేసుకొనే భాగ్యం నాకు లేదా?"

"ఏమో. నాకు సిగ్గు బాబూ! అని లోపలికి తుర్రుమంది వసంత.

ట్రైనింగయాక,కృష్ణని ఏ పీ కేడర్‌కి ఎలాట్ చేసి సబ్ కలెక్టర్‌గా పోస్టింగ్ ఇచ్చారట!

ఒక రోజు అమ్మతో నాన్నగారు అంటుండగా వసంత చెవినపడింది.

"మన వసంత అదృష్టవంతురాలు".

"ఆ సంగతి నాకు తెలుసు" అంది అమ్మ, ఆనందంగా.

"కృష్ణ క్రితంసారి వచ్చినప్పుడు, ఆ సంగతి నాతో ప్రస్తావించాడు. మనకి అభ్యంతరం లేకపోతే వీలయినంత త్వరలో ముహూర్తాలు పెట్టించమన్నాడు".

"అలాగే"- సంతోషం నిండిన అమ్మ గొంతు.

"తమర్ని ఇక నించి కలెక్టరుగారి అత్తగారు అని గౌరవిస్తారు కాబోలు, జనులు".

"తమర్ని మాత్రం! అసలు ఈ ప్రయోజకత్వం అంతా ఎవరిదటా?".

గుసగుసలు- ఆ తర్వాత.

పోర్టికోలో హడావుడి. కారు ఆగిన చప్పుడు.

"మా అందరికీ ఇష్టమయింది. అతనికి అంతా తెలుసు. నేనూ చెప్పాను. అతను మనస్పూర్తిగా ఒప్పుకున్నాడు. నీకేమిటి అభ్యంతరం?"- నాన్న కోపంగా అన్నారు.

"నాకు ఇష్టంలేదు నాన్నా" అంది వసంత, నిశ్చిత స్వరంతో.

"ఎందుకిష్టం లేదూ అంటున్నాను. అమెరికాలో వున్న తన ఫ్రెండ్స్‌తో సంప్రదించాడట. ఒకసారి వెళ్ళి ఆపరేషన్ చేయించుకుంటే నీ చూపు బాగుపడవచ్చుని అంటున్నాడు.

"వచ్చుని గదా అతను ఆశించేది! గ్యారంటీ లేదు గదా!! అయినా అతనెవ్వరు నాన్నా అంత రిస్కు తీసుకోవటాన్కి? అతనంటే నాకిష్టం లేదు- అంటున్నాను గదా?

చాలాసేపు అలాగే ఉండిపోయి చివరకి నిట్టూర్చారు నాన్న

"నాకు తెలుసమ్మా. నువ్వు ఈ నిర్ణయానికి రావటానికి, కారణం నాకు తెల్సు". గద్గద స్వరంతో అని భారంగా అవతలకి కదిలిపోయారు నాన్న.

యవ్వనం పుష్పించి పరిమళించవలసిన ఆ సమయంలో తను విష జ్వరం పాలబడి, చూపు పోగొట్టుకుని, పునరుజ్జీవితురాలు కావటం తన దురదృష్టం. పోయినా బాగుండేదేమో!

కృష్ణ వుండిన ఆ నాలుగు రోజులూ- వసంత మొండిగా, నిర్దయగా, కర్కశంగా ప్రవర్తించింది అతన్తో. కావాలనే- పొంగివస్తున్న అనురాగాన్ని అణగద్రొక్కి, లేని వైముఖ్యాన్ని ప్రదర్శించింది. అతన్ని గాయపరచి, విముఖుడ్ని చేయటానికి రకరకాలుగా ప్రయత్నాలు చేసింది. రాక్షసివలె అతన్ని విదిలించి కొట్టి దూరం చేసుకొంది.

శ్రావణ మేఘాలు కసిగా వర్షిస్తున్నాయి. కృష్ణ వెళ్ళిపోయేది ఆ రోజే.

కిటికీ దగ్గర కూర్చుని, వున్న వసంత ఆ అడుగుల్ని గుర్తించింది. అవి కృష్ణవి!

"నేను వెళ్ళిపోతున్నాను వసంతా. మళ్ళీ ఇక ఈ ఇంటికి రానేమో-"- బాధగా.

వసంత మౌనం. ఆ మౌనంలో అనంతమయిన పెను తుపానులు.

"వసంతా!-కనీసం ఒక స్నేహితుడుగానన్నా నన్ను జ్ఞాపకం పెట్టుకుంటావా? నీ నిరాదరణకి మోడుగా అయి, ఆజన్మాంతం బ్రహ్మచారిగానే వుండాలని ప్రతిజ్ఞ చేసిన ఒక అభాగ్య ప్రేమికుడుగానయినా, నీకు గుర్తు వుండి వుంటే అది అదృష్టంగా భావిస్తాను. వస్తాను వసంతా. నన్ను క్షమించు"" తల మీద చెయ్యి వేసి స్నేహంగా నిమిరి, కృష్ణ వెళ్ళిపోయాడు, వెళ్ళలేక వెళ్ళలేక. వసంతకి తెలుసు, అతని గుండెల్లో ప్రళయకాల, మేఘ గర్జనలు, సుడిగుండాలు. నీలవర్ణపు శ్రావణ మేఘాలు, గుండెల్ని తోడేసినట్టు వర్షించాయి. □



## నిత్య నూతన సీరియల్




(గతసంచిక తరువాయి)

మరునాడు ధర్మారావు వుదయముననే లేచి సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ఆలయమునకు పోయెను. అచట గణాచారి ఉండెను గణాచారి ధర్మారావును చూచి "మిగిలిన వెన్ని?" అనెను ధర్మారావు "కన పడుచునే ఉన్నవికదా, రెం"డనెను. గణాచారి 'అందులో ఒకటి మాసిపోయినది దానికి మఱల ఆకృతి తేవలయును" ధర్మారావు తనలో ఇదియాయర్థ" మనుకొనెను. అతని గర్భ గోళము నుండి ఒక విషాద తరంగము లేచి నాభి యొద్ద సూది పొడిచినట్లు పొడిచి, హృదయముదాక పొడిచి, హృదయ మావరించి, దానికి చేతనత్వ మాపాదించి గొంతుక పఱకెగదట్టెను మహాను భావుడైన ధర్మారావా, దుఃఖ వీచికను శివుడు హాలాహలమునువలె కంఠగోళమున్న గదించెను. అదియు అటునిటు పోలేక అందే తిరుగుళ్ళు పడుచుండెను గణాచారి చూచినది "ఇంక పదియేళ్ళ మాట!" అన్నది. ఇరువురును స్వామి వంక చూచిరి - అనంతు డీ ఆకార మేల తాల్చవలె? ఇట్లు బాధా కుటిలత లేల పొందవలె? మాయ భగవంతునకు లీల కావచ్చును. మాయా సంహిత లైన తమకు ప్రాణములమీద కూర్చున్నది -పిల్లికి చెలగాటము ఎలుకకు ప్రాణ సంకటమన్నట్లున్నది గణాచారి ధర్మారావులు కలసి దారి వెంట పోవుచుండిరి. ఒక పంచము డెదురుగా వచ్చు చుండెను గణాచారి తొలగిపోబోయినది అతడు మరియు సమీపమునకు రాబోయెను. ధర్మారా వాతనితో "ఒక్క పది యేండ్లాగుము. అప్పుడు గణాచారియే ఉండదు అప్పుడు మన మందర మును కలసి దేవాలయములో నికే పోదము. స్వామి కప్పుడు గణాచారి ప్రసక్తి ఉండదు మూలమైన బీజాక్షర పీఠమున శక్తి అప్పటికి సమూలముగా నశించును నేను నీ వాడను. పద" అనెను. అతనికి తెలియలేదు. ధర్మారావు వంక వెఱ్ఱి వెఱ్ఱిగా చూచుచు అతడు దూర దూరముగా పోయెను మఱల గణాచారి ధర్మారావులు కలసి పోజొచ్చిరి దూరమున పసరిక కన్పించి తొందర తొందరగా నడచి పోయెను గణాచారి; గ్రామములో మెట్ట పొలము మిగిలినట్లు లేదు. ఊరంతయు పల్లమైనది. ధర్మారావు . ప్రాగ్దిగ్భాగమున కొంత ఉన్నది. గణాచారి · అవు నత డా దిక్కుననుండియే కదా వచ్చుచున్నాడు.

ఇద్దరును మరికొంత దూరము నడిచి పోయిరి. దారిలో శివరావు కనపడెను. గణాచారి వెంట వచ్చుచున్న ధర్మారావును చూచి అతడు కలవర పడెను శివరావు మనసులో "ఈ నాగరకు డేమి? ఈ జానపదురా లేమి? ఈ ప్రాపంచిక వేత్త యేమి? మూఢ విశ్వాసము గల యీ గణాచారి యేమి? నవ నాగరక లక్షణములుగల యీ పురుషుడేమి? ఆటవికురాలివంటి యీ స్త్రీ యేమి?అనుకొనెను. ధర్మారా వూహించెను; "గణాచారి దేవతా స్వరూపురాలు, నేను మనుష్యుడను. ఆయమ లింగ భేద జ్ఞానమున కతీతురాలు. నేను పురుషుడను. ఆమె ప్రకృతి కచ్చమైన బిడ్డ నేను వికారమూర్తిని." ఇరువురును కలసి మరికొంతదూరము పోయిరి. దేవదాసి ఎదురుగ వచ్చుచుండెను. దేవదాసి గణాచారికి నమస్కరించెను గణాచారి కన్ను లరమూసి నోరు కుదించి, పరిహాసపు సమాదరపు వికృతపు లేత నవ్వు నవ్వి తల ఆడించెను దేవదాసి సిగ్గు పడెను ధర్మారావు "అమ్మా ఎచ్చటికి "

గిరిక. అచ్చటికే

ధర్మారావు ఎండ యెక్కినది భోజనము చేసెతివా?

గణాచారి అచ్చట పాలు పెరుగు దొర కవా?-గణాచారి పరియాచకమాడుట కిది మొదలు

ధర్మారా వామెను నివ్వెఱవోయి చూచెను పూర్వము గణాచారి బ్రహ్మమయమూర్తివలె ఉండెడిది. ఇప్పు డామె త్రిగుణములు విభాగించు కొన్న మూర్తివలె ఉండెను ఆమె ఎడమ కన్ను కొంచెము నీలిమ వర్ణమును పొందెను మూడవ గుణమే వృద్ధిపొందునట్లున్నది. "ఈ పరమ సాత్త్వికమూర్తికి వికృతి యేల?"

ధర్మారావు మఱల చూచెను

ఆమె అంతస్సు వినిర్మలమై రాజహంసవలె ప్రకాశించుచుండెను. "ఓహో! ఇది బహిశ్చిహ్నము మాత్రమే! మఱల నిరువురును కలసి నడచు చుండిరి హరప్ప దక్షిణ దిక్కునకు వాహ్యాళి పోయి నడచి వచ్చుచుండెను యువరాజునకు బదునా రేండ్లు వచ్చినవి ఆయన బుగ్గలు పూడియున్నవి శరీరచ్ఛాయ పండిన గేదంగి రేకను పరాచికము లాడుచున్నది కట్టిన పంచె ముఖమల్ చెప్పుల-మీద జరీ అంచుతో నృత్యము చేయుచున్నది

ఆయన ధర్మారావును చూచి వినయముచేత నమస్కరించినట్లు తలయు మూపులును వంచెను. ధర్మారావు వెనుక ముందులు చూచెను ఎవ్వరును లేరు

ధర్మా . "ప్రభువుగారూ! ప్రొద్దెక్కి వచ్చుచున్నారో" అనెను

హరప్ప : ఆమెతో నే నెన్నడును మాటాడలేదు ఆమెకు నా నమస్కారములు చెప్పుడు. గణాచారి విన్నది. ఆమె మొగము పరిదీనాకృతి దాల్చినది. హృదయములో ఆనందరేఖ ఆడుచున్నది. హరప్ప దుర్గాభిముఖుడై పోయెను. ఇరువురును మఱల కలసిపోవుచుండిరి. రామేశ్వర మెదురుగా వచ్చుచుండెను. మారీచ సముద్రాంతః పతనవేళ శ్రీరామమూర్తి ధనుస్సు బిట్టుగా ఉభయకోటి పరామర్శమగునట్లుగా సమాకర్షింపబడినట్లు గణాచారి భ్రూయుగము భయద కుటిల నర్తన వికృతమై దారి తొలగి ఆమె ఒక సందున పడిపోవు చుండెను. ధర్మారావు రామేశ్వరమును నిలుచుండి చూచుచుండెను. రామేశ్వరము జరుగుచున్న

**జరిగిన కథ – 33 :** రంగారావుగారు దొరసానిని వివాహం చేసుకుంటారు. గవర్నరు పురపాలక సంఘ భవనాన్ని ప్రారంభిస్తారు. శివరావు జాతీయకళాశాలకు క్రొత్త అధ్యక్షుడుగా వస్తాడు. రామేశ్వరము సుబ్బన్నపేటలో సినిమాహాలు కట్టిస్తాడు. రామేశ్వరము జోస్యుల భార్యను లోబరుచుకుంటాడు. శివరావు తాను కృష్ణావతారమని అదో కధోరణిలో ఉంటారు. జోస్యులుకి భార్య మీద అనుమానం కలుగుతుంది. గిరిక నాట్య శాస్త్రంలో మంచి ప్రవేశాన్ని సంపాదిస్తుంది.

దంతయు చూచుచునే ఉండెను. అతడు తన్ను కాదన్నట్టుగా ప్రక్కగా నడచిపోయెను. అతడు పోయినంతమేఱ ధర్మారావు చూచెను. ధర్మారా వనుకొనెను. "నడచినంత మేర చూచితిని. ఇట్టు పోయినాడని చూచుటయే కాని, అతని ఆవగలిగి తినా? నన్నతడును చూచుచునే లెక్కలేకుండ పోయెను. ఇప్పుడత డెక్కడ, నేనెక్కడ? గణాచారి కత డెంత దూరముగా ఉన్నాడో, నే నంత దగ్గఱగా ఉన్నాను. నేను గణాచారి దగ్గర నుండి యేమి లాభము? గణాచారి శక్తి యేమో ఉడిగిపోయినది."

ధర్మారా వొక్కడు ఎండలో నిలుచుంటినని తెలిసికొనెను. ఎండ శిరోభాగమున మలమల మాడ్చెను. కాలము వసంతము, అతపములకు దైక్ష్ణ్యము గ్రైష్మ్యము. ధర్మారావు తిరిగి గృహమునకు పోయెను. సావిత్రమ్మగారికి తలనొప్పిగా ఉండి పండుకొన్నది. అరుంధతి వంట చేసినది. భర్త ప్రొద్దుననే బయలుదేరిపోయెను. భర్త ఎచ్చటికి పోయి ఉండును? రంగాపురము వెళ్ళినా? రంగాపురములో ఎవ్వరున్నారు? తన పెట్టి తీసికొని వచ్చుటకు వెళ్ళినేమో? ఆ పెట్టిలో రంగాజమ్మగారు పెట్టిన చీర ఉన్నది. ఆ చీర తాల్పవలయునని తన కెంత ఉన్నది! మఱల అటువంటి చీర దొరకదా! అయినను తామిప్పుడు ఖద్దరే ధరించుచుండిరికదా! ఉప్పాడ చీర నిప్పుడు కొనుమన్నచో ధర్మారావు కొనడే! విదేశపు చీరమీద తన కంత ప్రేమ ఎందులకు? అది విదేశపు చీరకాదు, రంగాజమ్మగారు పెట్టిన చీర అది. ఆ చీర యిన్నాళ్ళు పెట్టిలో చిమ్మటలు కొట్టక పాడైపోక ఉన్నదా? ఆహా! ఏమి తల్లిదండ్రులు! తన్ను చూచుటకైనను రాలేదే! తన తమ్ముడెట్లున్నాడో? అతని కిప్పుడు పదుమూడు పదునాలుగేండ్లుండును. అన్నిటికన్న చిత్రము రెండు క్రోసుల దూరములో నుండి ఒకరి కొక రెప్పుడును కనిపించనైన కనిపించకపోవుట. కుమారుడు పోయిన తరువాత రాజ్యలక్ష్మమ్మగారు మంచము పట్టినదట. ఆమె కెట్లున్నదో? తనకు తన భర్తకు మహానురాగము గలిగించినవి రెండు. ఒకటి రాజ్యలక్ష్మమ్మగారు; రెండు రంగాజమ్మగారు పెట్టిన చీర. ఆమె యేమో మంచానపడినది. చీర చిమ్మటలపాలబడి ఉండవచ్చును. ఆహా! తన ప్రేమ యింకెన్నాళ్ళు నిలుచునో? రాజ్యలక్ష్మమ్మగారు చనిపోవునో! పోయిన తర్వాత తన ప్రేమ యింకను నిలుచునో? నిలువక ఏమి అగును? తాను పోయి పుట్టినింట ఉండునా? ఆ ఊహలో అరుంధతికి నవ్వు వచ్చినది. నవ్వు వచ్చినంతలో ధర్మారావు వచ్చెను. అతడు "గ్రుడ్డిదానా! రేగుచెట్టు లేకుండ నవ్వెదవి" అనెను.

ధర్మారావు : నీలో నీవేమో అనుకొని నవ్వుచుంటివి. నేను లేనప్పుడును నీకు చక్కగా కాలము గడచునుగదా! నన్నెప్పుడు ఇంటివద్ద ఉండుమని పోరు పెట్టెద వెందుకు?

# E & BLUE




It's rich: the blend of choice Virginia tobaccos.

It's true: the taste, the smoke, the satisfaction.

It's blue: unmistakably so.

It's Berkeley Filter: rich, true and blue.

**FILTER**

# Rich tobacco, true taste.

LINTAS (CAL)/BFT/2740/1

అరుం : రంగాపురముపోయి పెట్టి ఎప్పుడు తెత్తురు?

ధర్మా : ఇదియొక క్రొత్త పల్లవి మొదలు పెట్టితివి.

అరుం : ఆ ఊరు మన మిద్దఱము కలిసి పోదము.

ధర్మా : ఇది బాగుగా ఉన్నది. నేను దొంగతనముగా నా భార్యను తెచ్చుకొంటిని. నిన్ను వెంటట్టుకొని నే నచ్చటికి పోయినచో దొంగ సొమ్ముతో సహా దొరికినాడని వారు నామీద అభియోగము చేసినచో నేనేమి చేయుదును?

అరుంధతి : పరాచికములకు కాదు. మూడేండ్ల నుండి రాజ్యలక్ష్మమ్మగారిని చూచి వత్తమని అనుకొనుట, చూచి రాలేకపోవుట అన్ని రోజులు ఇట్లే గడచుచున్నవి.

ధర్మా . ఒక సంగతి జరిగినది రాజ్యలక్ష్మమ్మగారి యింటిలో జోస్యులని ఒక బోర్డు స్కూలు మాష్టరు కాపుర ముండెను రామేశ్వర మున్నాడే, ఎరుగుదువా?

అరుంధతి : అవునవును. శిశుపాలుడా?

ధర్మా : అవునతడే! ఆయన తాలూకా బోర్డు ప్రెసిడెంటు., ఆ జోస్యుల భార్యకు ప్రెసిడెంటుగారికి దుర్వృత్తి కలిగెనట! జోస్యుల నీ ఊరు బదిలీచేసి శిశుపాలుడు తన దుర్వ్యవసాయమును సాగించుచుండగా, పాపము జోస్యుల కది తెలిసి, దుఃఖించి, శత్రువు నేమైన చేయ సామర్థ్యము చాలక భార్యను పుట్టినింటికి పంపివేసెనట. ఇంకొక పది రోజులలో సెలవులైపోవును. జోస్యులు మఱల వచ్చును రామేశ్వరము జోస్యులత్తవారింటికి పోయి తమ అల్లుని అభివృద్ధిలోనికి తెచ్చిన వాడుగా వారిచేత గౌరవింపబడి వారి కీ సంగతి తెలియదు కనుక, ఏదో కొంచెము కోపము వచ్చి భార్యను దండించెనేగాని వేరు గాదనియు, మఱల పాఠశాలలు తెఱచిన వెంటనే మీ కెందుకు పిల్లను తీసికొని వచ్చి దిగపెట్టి మీ దారిని మీరు వచ్చివేయుడు; తక్కిన వ్యవహారము నేను చేయుదునుగదా! అనియు చెప్పి వచ్చెనట. వీని దుర్మార్గత ఎట్లు పర్యవసించునో తెలియదు.

అరుం : అయ్యో! పాపము! ఇచ్చటికి వచ్చిన తరువాత వారి సంసారము మరి ఎంత గగ్గోలు చేయునో! మీరైనను పోయి ఆమె తలిదండ్రులతో ఈ సమాచారము చెప్పి వారిచ్చటికి పంపించకుండ చేయరాదా?

ధర్మారావు · ఇది బాగుగా ఉన్నది. నా కిదియే పనియా?

అరుంధతి : మీ రంత నిర్దయులేమి?

ధర్మారా : దయయు నిర్దయయు ఎవరికి? ఇది కష్టమిది సుఖమనుకొన్నవారికి. నా కేమి నిర్దయ?

అరుం · మీ కేమియు సుఖ మక్కఱలేదు పాపము!

ధర్మా : అక్కఱలేక కాదు. తద్గత భావమునందు పరినిష్ఠ లేదు - ధర్మారావు స్నానము చేసి భోజనము చేయుచుండెను

అరుంధతి : నా పెట్టి ఎప్పుడు తెచ్చెదరు.

ధర్మా · నీవా ప్రశ్న వేసినప్పుడెల్ల నాకు విసుగుగా ఉన్నది దానిలో వజ్రము లున్నవా, వైడూర్యము లున్నవా? నీ వెపుడైనసరే! ఇది మొదలొక్క యేడాది వఱకు పెట్టి సంగతి ప్రస్తావించకుండ ఉంటివా, అప్పుడు తెచ్చెదను.

అరుం · నే నెప్పుడును పెట్టి విషయమే మాటాడుచుందును.

ధర్మా . అట్లయినచో నీకు వేయేండ్లాయుస్సు

అరుం . ఏమిటా లెక్క?

ధర్మారావు పరిహాసముగా "నీ వడుగుచుందువు, నేను తేను, ఏ సంవత్సరము గాదు ఏ సంవత్సరము గాకుండ మన మెట్లు చనిపోదుము? ఏదో ఒక సంవత్సరములో గదా మనము చనిపోదుము! నీ వెప్పుడు అడుగుచున్నచో అది ఏ సంవత్సరమును గాదు అప్పుడు నీ వమరుత్యరాల వగుదువు"

అరుంధతి నవ్వుచు, "పిల్లల కిట్టి చదువేనా చెప్పునది! వారందఱకు తర్కశాస్త్రము వచ్చినట్లే; బాగుపడినట్లే!

నాడు ప్రొద్దువాటారువేళ దేవదాసి వచ్చెను. ఆది కృష్ణపాద్యమి. ఆమె నల్లని అంచుగల తెల్లని చీర కట్టినది అది ఖద్దరు చీర. అరుంధతి చూచి "ఇది మీ బృందావనములో నేసిన చీరయా? అవునచ్చట రాటములు మూలపడలేదుకదూ?" అనెను

గిరిక . కృష్ణునకు.. .

అరుం : ఆ పేరు చెప్పుచునే అంత సిగ్గెందుకు?

గిరిక : ఇందులో సిగ్గేమున్నది? భగవంతుని పేరెవరైనను చెప్పవచ్చును.

అరుం . అబ్బో! గడుసుదనము!

గిరిక · ఆయన పుట్టిన తరువాత పండ్రెండేళ్ళకు గాని తలిదండ్రులకు బాధలు వదలలేదు బృందావనములో ఆయన పుట్టిననాడే మొదలు బాధలు లేకుండుటకు

అరుం దేవకీదేవికన్న గోపికలే పుణ్యాత్ములు. సావిత్రమ్మగారీ మాటలు వినుచున్నది ఆమె "దేవకీదేవియే పుణ్యాత్మురాలు. అంతకన్న పుణ్యాత్మురాలు యశోదమ్మ. ఈ తల్లి కొడుకును చూసిన బాధయే ఎరుగును. ఆ తల్లి ఏ బాధ ఎరుగక చన్నిచ్చిన సుఖమే ఎరుగును.

ధర్మా : అవునుగాని, ఆలయములోనికి గిరిక వెంట నీవా, నేనా?

అరుం : నన్ను చూచినచో స్వామి సిగ్గుపడును గిరికతో సరిగా ఉండడు. చెల్లెలి సమక్షమున ఎవరైన భార్యతో చనువుగా ఉందురా!

ధర్మా · మరి నేనైనచో సిగ్గులేదా ఏమి ఆయనకు?

అరుం · అది మీకుమీకు దెలియవలయును. గిరికా ధర్మారావులు దేవాలయాభిముఖముగ పోయిరి ధర్మారావుగారి యింటినుండి కోటరోడ్డున పోకుండ స్వామి ఆలయములకు పోవు మార్గమున్నది. ధర్మారావు దారి కోట రోడ్డునకు దీసెను. ధర్మారావు ముందు నడచినంతనే గిరిక తనలో తాననుకొన జొచ్చెను. ఆమె పాదములే నడుచుచున్నవి "స్వామికి కల్యాణ మెప్పుడో! అంత వఱకు నేనిట్లె కన్యగా ఉండవలయునా? రంగారావుగారు స్వామికి కల్యాణములు చేయుటలేదు. ఆయన మనమతములోననే లేదు. ప్రభువునకు కళ్యాణ మెప్పుడో? ఆ కళ్యాణము నాడు నేనెట్లుందునో! నేను రాధను, గోపికను , రుక్మిణిని, సత్యభామను స్వామికి కల్యాణోత్సవమే జరుగవలయును గాని ఆయనకు నేనేమి కాను!! ఆయన కాలిదుమ్ము నగుదును. ఆ స్వామి హస్తాంగుళులు వేణువును మోసి మోసి అలసియున్నవేమో! నేనా వేణువును దీసికొని ఆయన వ్రేళ్ళకు విశ్రాంతి కలిగించెదను. స్వామి కల్యాణము నాడు ఆలయములో నుండి



## 12

వ్యవహారం సాఫీగా, సజావుగా నడుస్తున్నంత కాలం బాధలేం ఉండవు. ఇల్లాంటి మనఃక్లేశ కారకాలైన వ్యవహారా లొచ్చినప్పుడే పట్టింపు లొస్తాయి. మా ఊళ్ళో ఇప్పుడు పంచాయితీ ఆఫీసు ఉన్నచోటుని పూర్వం "ప్రభలవారి దిబ్బ" అని పిలిచేవారు. తీరిక రోజుల్లో సాయంవేళ, మా తాతయ్య, అక్కడ కూర్చుని భాగవతం చదివే వాడుట. బ్రహ్మయ్యగారు ముందు కూర్చునేవాడు ఊరంతా చుట్టూ కూర్చుని వినేవారు. ఆయన భాగవతం చదువుతూనే ఉన్నాడు. బ్రహ్మయ్యగారు వింటూనే ఉన్నాడు. అయినా ఇద్దరిమధ్యా మాటల్లేవు ఊరందరికీ విచిత్రంగా ఉంది ఇలా ఏడాది గడిచింది

అంతలో బ్రహ్మయ్యగారి పెద్ద కుమారుడు గోపాల కృష్ణయ్యగార్కి పిల్ల నిద్దామని, పెళ్ళివారు వచ్చారు. ఆరోజు తాంబూలాలు గూడవల్లివారి పురోహితుడు వత్సం శ్రీరాములుగారు ప్రఖ్యాత సినీ సంగీత దర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావుగారి మామగా రీయన. బంధువర్గం, పెద్దా చిన్నా అంతా వచ్చారు. బ్రహ్మయ్యగారు గదిలోంచి తెమిలిరాడు. ఆయన్ని తొందరచేసే దమ్ము ఎవడికీ లేదక్కడ. తాంబూలాల ముహూర్తం దాటిపోతోందని అంతా గాభరా పడుతున్నారు పురోహితుడవటాన శ్రీరాములుగారే ధైర్యం చేసి, "అయ్యా! ముహూర్తం దాటిపోయే



# పట్టు విడుపులు

టట్టుంది, తమరు తెమిలి రావాలి" అన్నాట్ట.

"ఎవరయ్యా తెమిలి రావల్సింది? తెమిలి




రావాల్సిన మనిషేమొ రాడాయె?" అన్నాడట బ్రహ్మయ్యగారు అందరూ ఆశ్చర్యపోయారు "వెళ్ళండి, వెళ్ళి శోభనాద్రిబావని పలుచుకురండి' అన్నాట్ట.

మనుషులు పరిగెత్తారు శోభనాద్రిగారు ముస్తాబై అరుగుమీద కూర్చుని ఉన్నాడు 'మిరెవరోయ్ పిలవడానికి? పిలవాల్సినవారు పిలిచినప్పుడు చూద్దాంలే అన్నాడట.

అప్పుడు బ్రహ్మయ్యగారే వచ్చి, 'ఏమిటయ్యా, ఏమిటి నీ దర్పా? ఓహ్! బిగిశావు, బిగిశావు, ఎడాది బిగిశావు! ఎన్నాళ్ళు బిగుస్తావు? ఇక్కడ నువు బిగుసుక్కూర్చుంటే, అక్కడ నీ మేనల్లుడి పెళ్ళి తాంబూలా లెవడు పుచ్చుకుంటాట్ట?' అన్నాట్ట శోభనాద్రిగారు నవ్వుతూ, "నేనుండగా ఇంకెవడు పుచ్చుకుంటాట్ట?" అంటూ ఉన్నవాడు ఉన్నట్టుగా లేచి బయలు దేరాట్ట.

వాళ్ళ ఆప్యాయతలు, వాళ్ళ అనురాగాలు, వాళ్ళ దర్పాలు, వాళ్ళ పట్టు విడుపులు అల్లాంటివి.

సరిగ్గా ఈ వ్యవహారాన్నే కొద్దిగా మార్చి వేణుగోపాలస్వామి గుడి సంప్రోక్షణ అప్పుడు కృష్ణమనాయుడు, రామేశ్వరశాస్త్రిగారల మధ్య జరిగినట్టుగా వ్రాశాడు మా నాయనగారు

(ఇంకా ఉంది)

- విశ్వనాథపావని శాస్త్రి

కళ్యాణమంటపము వఱకు కదలివచ్చునా? ఆ ఎఱ్ఱ తామరపూల వంటి పాదములు కందునేమో! కందినచో పాదములే ఎఱ్ఱనివి కనుక కందినట్లు తెలియదు. ఏమి సేయవలయును. తెలిసికొనుట ఎట్లు?" –గిరిక ఆగి నిలుచుండెను. ధర్మారావు వెనుకనే గిరిక వచ్చుచున్నట్లు తోచక వెనుదిరిగి చూచి కొంతదూరమున నిలిచియున్న ఆమె వద్దకు పోయి "ఎట్లు తెలియునో నేను చెప్పెదను రమ్ము" అనెను. గిరిక దిగ్భ్రాంతయై చూచెను. మఱల దారి వెంట సాగి పోవుచుండిరి గిరిక మఱల తనలో తాననుకొన జొచ్చెను. "దీనికొక ఉపాయమున్నది. నేను తెల్లని చీరకట్టుకొని పోయి స్వామి అడుగుంచిన చోట నెల్ల వేయుదును సన్నని తెల్లని వలిపపు చీరమీద స్వామి పాదకాంతులు వ్యాపించును. ఆ వ్యాపించిన కాంతుల చిక్కదనము పలుచ దనములచేత పాదములు కందినవో కందలేదో తెలిసికొన వచ్చును. స్వామి అడుగు చేసిన చోట నెల్ల పుణ్యురాలైన భూమి ఉండుగాని, దౌర్భాగ్యురాలనయిన నా హస్తము లుండరాదా! స్వామి హస్తములు నా చేతులలో తాల్చి కళ్యాణ మంటపమునకు తీసికొనిపోయి కూర్చుండ పెట్టుకొందును లజ్జలో నన్ను నేనదుముకొని స్వామి మొగమువంక నేను చూడలేక పోయెదను నా హస్తములు తన చరణ పద్మములకు తాక స్వామి కపోలములు పులకరించునో! అతని నేత్రముల యందు ప్రేమామృతము వెల్లి విరియునో! పాడు సిగ్గు నన్ను చూడనీయదు కాబోలు. ఆయన సుప్రసన్న మందహాససుందర వదనారవిందము కనులార చూచు భాగ్యము నాకు లేదు కాబోలు! లేదే కావలయును. నేను పుట్టిన దెక్కడ? పెరిగిన దెక్కడ? వాంఛించుచున్నదెక్కడ? నా జన్మము కలుషిత మైనదా! నన్ను స్వామి అంగీకరించడా? ఏల అంగీకరించడు? నా తల్లి పవిత్రమైన విద్య చదువుకొన్నది. కులవృత్తి చేసినది! ఆకులవృత్తిలో కూడా తక్కిన నారి వలె గాక మహాగౌరవముతో మెలగినది. నా తండ్రి మహానుభావుడు. వేదవేదాంగములు చదివినవాడు. ఆయనకున్న గౌరవము చెప్పరానంత. మఱల అంత గౌరవము కలవాడు సుబ్బన్న పేటలో ఎవడు పుట్టును? నా జన్మ మేమంత చెడ్డది. స్వామి నన్ను తిరస్కరించుటకు? నా తండ్రి సత్రాజిత్తుకన్న చెడిపోలేదే! అతనికి స్వామియెడ ఒకప్పుడు గాక పోయిన ఒకప్పుడైన అవిశ్వాసమున్నది నా అన్న రుక్మికన్న చెడిపోలేదె! రుక్మి నాస్తికుడు. శిశుపాలునకు స్నేహితుడు. మా అన్నకు శిశుపాలునకు ఏమి సంబంధము? శిశుపాలుడు శిశుపాలుడు! పిడుగుపడి చావనైనా చావలేదు. సాత్త్వికగుణరాశియైన స్వామికి తమోగుణరాశిని నే నెట్లు పనికి వత్తును? నా మనస్సు తమోదూషితమై చేయుదును?" గిరిక కన్నుల వెంట నీరు కారు చుండెను ఇద్దరును దేవాలయమునకు పోవుటకు తిరుగవలసిన వీధి దాక వచ్చిరి. అది దాటి కొంత దూరము పోయిన గాని, కోటగుమ్మము లేదు ధర్మారావచట నిలబడెను. గిరిక తానును నిలబడెను. ధర్మారావచట ఐదు నిముషములదాక నిలు చుండెను గిరికయు నిలుచుండెను. ధర్మారా వెవరికొరకో ఎదురు చూచుచుండెను

సుబ్బన్నపేట పట్టణమై సర్వవిధముల బస్తీకళలు పెంచుకొన్నను పేటను గూర్చిన పురాతన కథలు సర్వజనములకు తెలియుచునే వచ్చెను. అచట నివాసమున్న మిషనరీలకు కూడ దేవాలయము, కోట, గణాచారి –యీ సందర్భము లన్నియు తెలియును. వారు విశ్వసింతురు, విశ్వసించరు – అది వేరుమాట సామాన్యముగ అందరకును దేవదాసి ధర్మారావుల సంబంధము తెలియును. అందరకును దేవదాసి కథ తెలియును. ఆమె దారివెంట పోవుచుండగా ఒక్కడును తల ఎత్తి చూడడు. ఆ పట్టణములో విమర్శింపబడని వ్యక్తులిద్దరు ఒకరుత్తక దేవదాసి, మరియొకరుత్తక గణాచారి. క్రొత్త క్రొత్త ఉద్యోగస్తులు వచ్చు చుందురు కాలేజీకి క్రొత్త క్రొత్త విద్యార్థులు వచ్చుచుందురు వచ్చిన క్రొత్తవారు దేవదాసిని

గూర్చి ఏదైన పొల్లు మాట అనినచో ప్రాతవారామె కథ వారికి చెప్పి మఱల అట్లనకుండ చేయుదురు కొందరు "ఛీ పో! ఇట్టి కట్టుకథలు ముసలమ్మల దగ్గర చెప్పుము. ఈ కాలములో అట్టి వెచ్చట నుండు?" నందురు. కొందరు తుండు తుపాకి ఎగురగొట్టి అసలిట్టి విషయముల సంభవమును గూర్చియే నిరాకరింతురు. వారు వారెట్లయిన నేమి? తక్కినవారు దేవదాసిని గౌరవింతురు. ధర్మారావును, దేవదాసియు వీథిలో కలిసి అట్లు నిలుచుండగా అందరును దూరదూరముగా పోయిరి. కొందరు తేరిపార చూచుచు పోయిరి సజీకృతమై ఒకచోట నిలువలేని ఉత్తమ జాత్యశ్వము వలె గిరిక నిలుచున్న చోట నిలువలేకుండెను ఆమె పాదములు దేవాలయము వైపునకు తిరిగియే ఉండెను నిలుచున్న కొంతసేపటికి హరప్ప నాయడు కోటద్వారము నుండి వచ్చుచుండెను అచ్చటికి కోటద్వారము పందగజముల దూర ముందును హరప్ప సన్నని పొందూరుబట్టలు కట్టును. అవి స్వదేశివో విదేశివో తెలియని వారికి తెలియదు. రంగారావును నాగేశ్వరరావును అవి విదేశ వస్త్రములనియే అనుకొందురు ఆయన తలగుడ్డ లేక ఎన్నడును బయటికి రాడు. తెల్లజరీ పట్టు ఉత్తరీయము తప్ప ఎన్నడును మరొక్కటి తలగుడ్డ చుట్టడు. పంచయే కట్టును. షరాయి తొడుగడు ఏరంగు పొక్కా తొడిగినను పైని రతనాల హారము దాల్చకుండ ఉండడు. ధర్మారావు కంటికి హరప్ప నాయడు బాలసూర్యు డుదయించి నట్లే ఉండును. కృష్ణమనాయని తనకన్న వృద్ధుడుగా హరప్పనాయని తనకన్న బాలుడుగా ధర్మారా వెరుగును. అతనికి సమవయస్కుడైన నాయడు లేడు. అతని ప్రభువు బాలుడో, వృద్ధుడో! హరప్పనాయడు దగ్గరకు వచ్చెను. దేవదాసి కనులు మూసికొని నిలుచుండెను. హరప్పకు పదు నారేండ్లు. పదునారేండ్లకే అతని మొగమున లోకజ్ఞుడైన వాని ముఖలక్షణములు కనపడు చుండెను. అతడు సర్వదా నడచునేకాని గుఱ్ఱము నెక్కడు. మోటారతనికి పడదు. రెండు మూడు సారులు మోటారెక్కి, ఒకసారి తలతిరిగి పడిపోవుట, ఒకసారి డోకు కొనుట తటస్థించెను అతడు మోటారును చూచి ధర్మారావుతో ఒకసారి అనెను. "ఇది ఏమి జంతువు? తలయు తోకయు లేనిది ఏనుగువలె ఉన్నదను కొందమా మనము దీని కడుపులో గూర్చుండ వలయును. ఏనుగునకు వెన్ను పైని గూర్చుందుము ఏనుగు ఘీంకారము భయమో శ్రవణ సుఖమో కల్పించును. దీనికూత చెవులకు గఠోరమనిపించును – హరప్ప ధర్మారావుతో రహస్యముగా "ఈమె యేనా దేవదాసి! ఈమెను కొన్నాళ్ళ క్రిందట స్వామివారి ఆలయము ముందు చూచితిని. ఆమెయు నన్ను చూచినది. నేనామెకు నమస్కరించ వలయునా?" అనెను.

ధర్మా : వీథిలో ఎవరైనను చూతురు. మీరట్లు చేయరాదు.

హరప్ప : ఎవరును లేనప్పుడు చేయవచ్చునా?

ధర్మా : మీరు జమీందారులు. ప్రభువులు. ఎవరికీ నమస్కారము చేయరాదు అందురును · మీకే చేయవలయును.

హరప్ప : ప్రతిరోజును మీకు నేను నమస్కరించుట లేదా?" ధర్మారావు నవ్వి, "నేను నమస్కరించుచుంటిని. మీరు నమస్కరించు చుంటి రని అనుకొనుచుంటిరి" అనెను. హరప్ప "అవునవు" నని తెల్లబోయెను.

హరప్ప . దేవదాసికి నేను నిజముగా నమస్కరించెదను

ధర్మారావు : నిజముగా ఇప్పుడుకాదు.

హరప్ప : "నేనామెతో మాట్లాడ వచ్చునా?" – "ఇప్పుడామె ఏదో ఊహించుచున్నది. ఇప్పుడు పలుకరించిన పలుకదు" అని ధర్మారావనెను.

హరప్ప : ఈ రాత్రి నాకు నిదుర పట్టదు.

ధర్మా : మీ తల్లిగారితో పాటీమెయు ఒకతెయ? హరప్ప నివ్వెఱ పోయిచూచి, "మీఱవరు?" అనెను.

దేవదాసి హరప్ప వంక చూచెను. వయస్సుచేత దేవదాసి పెద్దది. హరప్ప చిన్నవాడు. హరప్ప



## కార్టూనిస్టులకు సూచనలు !

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !

★ వ్యాఖ్య చిన్నదిగా, క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్ మీదే పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

బ్రహ్మచారి. హరప్ప అవివాహితుడు. హరప్పలో స్త్రీ పురుషజ్ఞాన మింకను వృద్ధి కాలేదు. పట్టిపసివాడు. అట్లు చూచిన హరప్ప, మనసులో చిత్రముగా ఎదిగిపోయిన ప్రకృతి సహజముకాని ఒక ఊహ ఊహించెను. "దేవదాసి తన కూతురువలె ఉన్న" దని ప్రభుదృష్టిలో ప్రసన్నత, సమాదరణ దేవదాసి చదివెను. ఆమె ఏమనుకొన్నదో మొగమున ఆనందమును మందహాసమును కనపరచినది.. మరునిముషములో ధర్మారావు ముందు నడచుచుండెను. దేవదాసి వెనక నడచుచుండెను. హరప్ప ఆవెనుక నడచుచుండెను. అన్నగారును తండ్రియు వెంట నిడుకొని అత్తింటికి తీసికొని పోవుచున్న పిల్లవలె దేవదాసి మహానంద పరివృత అయ్యెను. ఆలయద్వారము వరకు పోయిరి. హరప్ప కన్ను మూసి కన్ను తెఱచినంత సేపు తానచట నిలుచుండి నెమ్మదిగా వెనుకకు వచ్చెను. దారివెంట అందరు నాయని పలకరించిరి. నాయడు నేలవంక చూచుచుండెను. నాయని నేత్రములు పరాఙ్ముఖములై ఉన్నను వెనుకకు తిరిగి దేవాలయములో చూచుచుండెను. నాయడు కోటలోనికి నెమ్మదిగా నడచి చనెను. అతడు తనగదికి ముందున్న మల్లె పందిరి క్రింద చూచెను. అచ్చట నీడలలో చీకటులు పెనగొనుట తెలిసికొని ప్రొద్దు క్రుంకెనని భావించెను. హరప్ప ఏనుగుల సాల వద్దకు వెళ్ళెను. అచ్చట ఒక ఏనుగున్నది. దానిని చూచెను. రంగన్న వచ్చి "బాబయ్యగారూ! ఈ యేనుగు పేరు హనుమంతు మనకోటలో పూర్వము లక్ష్మణస్వామి అని ఒక ఏనుగుండెడిది. పెదబాబయ్య గారికి బట్టాభిషేక మైననాడె అది చనిపోయినది. అది మీ తాతగారెక్కెడిది" అని చెప్పెను. హరప్ప దేనికిని సమాధానము చెప్పడు. ఊ, అనడు. ఇదిఏమియు అనకుండగనే రంగన్నకు హరప్ప ప్రశ్న వేసెనో, ఊఁ, అనెనో తెలియును. రంగన్న మరియు చెప్పనారంభించెను. "లక్ష్మణస్వామిని నేను బాగుగా ఎరుగుదును పట్టాభిషేకమునాడు తన్నెక్కి బాబయ్యగారు ఊరేగవలయునని లక్ష్మణస్వామి ఊహ. స్వామి ముసలిదై ఒడలంతయు గొలుసు కొట్టు చుండెను. బాబయ్యగారందు చేత వద్దన్నారు, స్వామికి రోషము వచ్చి చనిపోయినాడు". హరప్ప ఒక చూపుచూచెను. రంగన్న 'అవునుబాబూ! స్వామి గాంధి గారి వంటివాడు. తరువాత బాబయ్యగారు మరియేనుగును, గుఱ్ఱమునుగాని ఎక్కలేదు. మోటారే ఎక్కిరి.'

హరప్ప అటనుండి నడవసాగెను. రంగన్న వెంటనే నడచుచుండెను. ఒక ప్రాత గోడ పడి ఱాళ్ళన్నియు గుట్టగాపడి ఉండెను, ఆ వెనుక కోట గోడ చెడిపోలేదు. ఈ రెండు గోడలకును మధ్య విశాలమైన ప్రదేశము కలదు అది దక్షిణము నుండి ఉత్తరము వఱకును వ్యాపించి సరిగాకోట అంత




కోనసీమ సైన్సు పరిషత్ 41 వ మహాసభ అంబాజీపేటలో జరిగినపుడు పరిషత్ అధ్యక్షుడు శ్రీ సి. వి. సర్వేశ్వర శర్మ ప్రసంగిస్తున్న దృశ్యం. శ్రీయుతులు జొన్నలగడ్డ సత్యనారాయణ, ఎం. మాధవరావు, అంబాజీపేట మండల ప్రజా పరిషత్ అధ్యక్షుడు పేరి కామేశ్వరరావు ప్రభృతులను చిత్రంలో చూడవచ్చు.

పొడుగు ఉన్నది. ఒక్క అరమైలు కుతక్కువుండదు. ఆస్థల మంతయు పూర్వము రాజకుమారులు గుఱ్ఱముల స్వారీ నేర్చుకొనుటకును, ఏనుగుల నడపించుట నేర్చు కొనుటకును, సాము గరిడీలు నేర్చుకొనుటకును నియమింపబడిన స్థలము. ఇప్పుడది అంతయు క్రూరసర్పములకు నివాసమై ఉన్నది. హరప్ప దానివంక చూచెను. రంగన్న "బాబు గారూ! ఇప్పుడు మన మక్కడకు పోలేము. దానినిండ వేయిపాములున్నవి" హరప్ప వెనుదిరిగి మఱల తన గది దగ్గరకు వచ్చెను. గదిలో భోజన మమర్పబడి ఉండెను. హరప్ప మాంసమును భుజించడు. శాకాహారమే చేయును. ఏకాదశి నాడుల్లిపాయలు కూడ ముట్టడు. ఏకాదశులయం దేకభుక్త ముండును. ఎందుకని ఎవ్వరడుగరు. అతడు చెప్పడు. ధర్మారా వెప్పుడో రుక్మిణమ్మా రావుగా రేకాదశులుండెడిదని చెప్పెను. ఆనాడామె కేకభుక్తమని చెప్పెను. హరప్ప మనస్సులో తన నాయనమ్మకును తల్లికిని భేదములేదు. ఆమె ఎట్లు చేసినదో తన తల్లియు అట్లు చేసెడిదే అని అతని నమ్మకము. అతడు భోజనము చేసి మల్లె పందిరి వద్ద కొంత సేపు పచారుచేయును. చేసిన తరువాత దీపమువద్ద కూర్చుండి చదువును. చదువు గ్రంథములలో ప్రధానమైనవి భాగవతము, భారతము, కృష్ణకర్ణామృతము, ఆంధ్రనాయక శతకము, ఇంగ్లీషునవలలు. ధర్మారావును సంస్కృతము చెప్పుమని హరప్ప చాలసారు లడిగెను ధర్మారావు ప్రారంభించెను రాత్రి జాము జాముమున్నర ప్రొద్దు పోవువఱకు హరప్ప చదువు కొనుచుండును. తరువాత శయనించును నిద్రపట్టదు. ఊహించును "మాఅమ్మగా రెట్లుండెడిదో? చిన్నతనములో ఆమె ఏమి చూచితినో నాకు జ్ఞాపకము లేదు. ఆమె శచీదేవివలె ఉండి ఉండును. ఆమెకు నామీద చాల ప్రేమ కాబోలు! చనిపోవునపుడు నన్ను దగ్గరకు తీసికొని నాకు తెల్లని పట్టు జరీ ఉత్తరీయము తలకు చుట్టించినదట! నే నామె చెప్పినట్లే చేయుచున్నాను. నాయనమ్మయు మా అమ్మయు ఒక్కసారియే చనిపోవుటేల? మా కోట వెనుకనున విహారస్థలము మఱల బాగు చేయించెదను. గుఱ్ఱములను స్వారీ చేయుట, ఏనుగులన నడపుట నేర్చుకొందును. కత్తిసాము, కఱ్ఱసాము నేర్చుకోవలయును. లేకపోయిన రాజులు శత్రువు నెట్లు పరిమార్తురు? మా అమ్మగార మహాపతివ్రత. ఆమెవంటిది చనిపోయిన తరువా మానాయనగారు మఱల పెండ్లి చేసి కొని రేలనో పెండ్లి ఏల చేసికొనెను? ఎవరినో తెచ్చి ఉంచుకొనెను. అది పెండ్లి ఎట్లగును".

ఇంతలో ఒక గాలి వచ్చి ప్రక్కనున్న పోకచెట్టును కదలించెను. "మా కోటలో చెట్లన్నియు ఎక్కడి వక్కడ విరిగిపోయినవి. రంగన్న చెప్పినాడు. కోట అంతయు నందనోద్యానము వలె ఉండెడిదట? నేను పెద్దయైన తరువాత మఱల కోట అంతయు వృక్షములు పెంచెదను. గాలి పొన్నకులలో దూరి మృదువుగా జారును. పోక మొవ్వలలో దూరి మర్మరధ్వనులు చేయును. ఫలవృక్షాదుల మీదికి పరువులెత్తును. అరటి ఆకులమీద బరువులెత్తి వానిని చించివేయును. మల్లెపందిరి మీది నుండి నాగదిలోనికి వచ్చును, నేను ముసుగు పెట్టుకున్న దుప్పటిలోనికి దూఱవలెనని గాలి ప్రయత్నించును నేను దూఱనీయను. అది గిలగిల లాడిన తరువాత నేను దుప్పటి తీసి వేయుదును ఇద్దఱమును పకాలుమని నవ్వి స్నేహితులవలె కౌగిలించు

# ఇ·వేమన·పద్యాలు

డాక్టర్ గారూ! ఆయనకి మోక్షం ఎప్పుడు?



మా యిల్లని మా పొలమని
కాయము తన సొమ్మటంచు కామాతురుడై
మాయని పదవిని గోరక
దాయాదుల పాలుజేయ దగదుర వేమా.

## వేయి పడగలు

కొందుము. మాఅమ్మగారు కోటలో తిరుగుచున్నప్పుడు లక్ష్మీదేవి వైకుంఠములో తిరుగుచున్నట్లుండి ఉండవలయును. అమె వంటినిండ రతనములు మాణిక్యములు ధరించి, తెల్లని పట్టుచీర తాల్చి, మొగమున కుంకుమతిలకముగా ధరించి, పునుగు జవ్వాది కస్తూరివాసన లామె నిలిచిన చోటున నెల్ల వాసనా ప్రవాహములు కట్టగా అమె ఎట్లుండి ఉండును. జగన్మోహిన్యవతారమువలె ఉండి ఉండును.' ఆ మహాపతివ్రత, సర్వ పుణ్యక్షేత్రములవలె పవిత్రయై ఉండవలయును.

"విశాలా కల్యాణీ స్ఫుటరుచి రయోధ్యా
కువలయైః
కృపాధారా ధారాకిమపి మధురా భోగవతికా,
అవంతీ దృష్టిస్తే బహునగర విస్తారవిజయా"

అన్నట్లు మాతల్లి మహారాణియై తన పాలించిన రాష్ట్రము మీద పణిపిన దృష్టి యిట్లుండును. మేము వేణుగోపాల స్వామికి ధర్మకర్తలము. నాగేశ్వరస్వామికి ధర్మకర్తలము. ఈదేవతలందరును మా చేత ప్రతిష్ఠింప బడిరి. ఎప్పుడో ఏనాటి మా పూర్వుల దయవలననో వీరందరు ఇచట దలదాచుకొనిరి. నేడు ఛీ! మీదారిని మీరు పొండనగా వారెచ్చటికి పోదురు? అశ్రయించిన కొంప వదలి పెట్టి పోవుట అంత తేలికా! "మీరు బొబ్బిలి వదలిపొం"డనుట చేత గదా రావువారు కత్తుల మీద పడి చచ్చిరి! తన స్వదేశము వదలి ఎవడు పోవును? దేవతలు మాత్రమేమి పోదురు? వారు ధూపదీప నైవేద్యములకు లేక, కల్యాణములకు లేక అవసిపోవుచున్నారు మాఅమ్మ బ్రతికి ఉన్నచో మానాయనగారిట్లుండరు. అమె యేకాదశులుండి ప్రతియేకాదశినాడును స్వామిదర్శనము చేసి ఉపవాసములుండెడిదట. ఆమెకంత యిష్టమైన భగవంతుని ఇంత తిరస్కరించి ఉండువా మాతండ్రి? చేసి ఉండడు. ఈనాగేశ్వరరావుగారొకరు. వీరికి విగ్రహారాధన గిట్టదట. వీరు కేషబ్చీని ధ్యానింతురు. విగ్రహమనగా ఱాతితో చేసినదే విగ్రహమా? కరచరణాద్యవయవములు గల మూర్తిని మనసాకల్పించుకొనిన అది విగ్రహము కాదా! విగ్రహములయందు భగవద్భావనమయినను గలదు. అతడు మనుషుడు కాడన్న ప్రత్యయమైనను కలదు. కేషబ్చీ మనుష్యుడు కాడనుట ఎట్లు? దివ్యమైన శక్తులుగల పురుషుడు కావచ్చును. విగ్రహారాధనలో తప్పేమి? దున్నపో తీనెననగా దూడను కట్టివేయుమన్నట్లెవడో వికృత బుద్ధి కాదన్నాడు! తక్కిన వారందరును కాదు కాదని గంతులు వేయుటతక్క మరి ఒక్కడు కనిపించలేదు. విగ్రహారాధన మంచియో చెడ్డయో ధర్మారావు-గారు వాదింతురు. ఎవరితో వాదించవలయును? ఎదుటికి వచ్చి నిలబడెడువాడే లేడుగదా! ఏదైన అన్నచో పరమతముల యందు ద్వేషము కలిగియుండుట అన్న సూత్రము పట్టించి శిక్షించుటకు ప్రయత్నింతురు హిందూమతమున ఎన్ని తిట్టినను తప్పులేదు. ఇతర మతములు వచ్చి మామతమును కుద్దాలించినచో తప్పులేదు. మా వేణుగోపాల స్వామి పిడికెడు బిచ్చము దొఱకని దేవుడైనాడు. నాగేశ్వరస్వామియేనయము. అలవాటు పడివచ్చిన బిచ్చగాడు. తాదూర కంతలేదు. మెడకొకడోలన్నట్లీయనకు గతిలేదు, దేవదాసి నొకతెను తెచ్చుకొన్నాడు. వీరిద్దరికి భుక్తి గడచుట ఎట్లు? ఈ స్వామికి కల్యాణము జరుగుట ఎట్లు? ఒక్కసారి భగవంతున కుత్సవములు చేసిన తరువాత నేను చనిపోయినను ఫరవాలేదు" అంతలో కోళ్ళు కూసినవి. భగవంతుని కల్యాణ సమయముల విచిత్ర ఫణితి గల మంగళహారతి పాడినట్లు కోళ్ళు క్రొత్త స్వరము వేసి కొక్కొరోకో అనెను. తూర్పునందు వాడిపోవుచున్న వెన్నెలలు వాడి ఒక్కుచున్న ఉషఃకిరణములు దుఃఖములో అనంధము కలిగినట్లు కలిసి మెలిసి ఉండెను. కోళ్ళు "మేలుకొండోయి జను"లని కూసెను. హరప్ప నిదుర పోయెను. తక్కినవారెవరును నిదుర లేవలేదు. తెల్లవారుజాము కోడికూత వినపడి పాతికేండ్లయినది. అదియు శాస్త్రగత విషయమువలెనే నిశ్వసించెడు వారికే విశ్వసనీయమైన విషయమైపోయినది సర్వజనులకు పని చేసికొనెడి దినావేళ పది గంటలకు ఎనిమిది గంటలకు లేచిన చాలును, ఈ పిచ్చి కోడి తెల్లవారిన తరువాత ఏడు గంటలకు కూయరాదా? ఎవ్వరును వినిపించుకొనని యీ కూత తెలవారుజామున కూయుట ఇంకెన్నాళ్ళకు మాని వేయునో!

(ఇంకా ఉంది)




## మనసుగుర్రం – లేదుకళ్ళెం

రచన : ధర్మవరపు సుబ్రహ్మణ్యం డైరెక్షన్ . దేవదాసు కనకాల. సినిమా గొడవ ప్రొడ్యూసరు బావమరిదికి హీరో కావాలి కాని అక్క ఒప్పుకోదు ఉద్యోగం చెయ్యమంటూంది ఇంతలో కొడుకు వచ్చి పిలిచాడు – అదీ కథ.

సినిమా జీవితం చాలా బాగా చూపించారు రచన రాయప్రోలు సుబ్బారావు. ఎస్. రాజ్యలక్ష్మి పాట ఫరవాలేదు.

## తెనాలి రామకృష్ణ

గిన్నెలు పిల్లలు పెట్టినయ్యని ఒక పీనాసికి ఎక్కువ గిన్నె లిచ్చి నమ్మించిన తరువాత గిన్నెలు చచ్చి పోయినాయని చెపుతాడు రామకృష్ణుడు.

రాయల వారి దగ్గరకు ఈ కేసు వెడుతుంది. అయ్యా గిన్నెలు పిల్లలు పెట్టినప్పుడు తీసుకున్నాడు .. మరి అవి చచ్చినప్పుడు ఆ నష్టం భరించాలి అంటాడు రామకృష్ణుడు. పాతకథ బాగుంది.

## బహదూర్ షా జఫర్

బహదూర్ షా పెద్ద కొడుకు కాబోయేవాడని అసూయ పడిన సవిత్తల్లి విషం పెట్టి చంపిస్తుంది. జీనత్ మహల్ సవితితల్లి పేరు. ఆమెకి ఇద్దరు కొడుకులున్నట్లున్నారు. ఆమె కొజ్జా మొహబత్ కబాబ్‌లో విషం కలిపి చంపటం చాలా అందంగా తీశారు. మొగలాయి దర్బారులో ప్రతివాళ్ళ ఉంగరంలోనూ భయంకర విషం ఉంటుందని చరిత్ర మాలికాయా ఆలం అంటే మహారాణి– పాపం కొడుకు చనిపోయాడు. అదీకథ.

## కిస్సా ఖాట్మండూమే

సత్యజిత్‌రాయ్ సమర్పణ రచన ఓంమణి పద్మేహం – ఇది మన నారాయణ అష్టాక్షరిలాటిది బౌద్ధులందరూ – ఈ మంత్రాన్ని జపిస్తారు ఖాట్మండులో – టిబెట్‌లో – నేపాల్‌లో – ఈ మంత్రం జపిస్తూ పానంజూదం లాటివి నడుపుతూ ఉంటారు

దేవేంద్ర మిత్ర ప్రసిద్ధ బెంగాలీ డిటెక్టివ్ కలకత్తాలో హత్య జరిగితే ఖాట్మండు వస్తాడు. శశికపూర్ బాగా నటించాడు సత్యజిత్‌రాయ్(రే)కి బౌద్ధ మంత్రం వచ్చును అని చెప్పాలి. అంతకన్న మణిమంత్రానికి కారణం లేదు

## మనోరంజన్

ఫిల్మ్ స్టార్ల ఇళ్ళ మీద ఇన్‌కంటాక్స్ రైడ్ జరిగిందని పేపర్లో చూసిన – ప్రొడ్యూసరు రైటరు మొదలయినవారికి కొత్త అయిడియా వస్తుంది వాళ్ళే వెళ్ళి వేషం కూడా మార్చుకోకుండా కపిల్ కుమార్ ఇంట్లో పడి గాజు సామాను పగలగొట్టి భయంతో ఉన్న హీరో చేత ఫలానా పిక్చరులో నటించేట్లు అగ్రిమెంటు చేయిస్తారు హీరో హీరోయిన్లు చాలా తెలివి తక్కువవాళ్ళు లాగా ఉన్నారు. ఏమయినా వాళ్ళు అదృష్ట వంతులే గాని తెలివిగల వాళ్ళు కారు.

## సుప్రభాతం

కొత్త సీరియల్‌లో మొదటి భాగం – రచన – ఎ. హెచ్. వి. వి. సుబ్బారావు సమర్పణ – మురళీ మోహన్ కాంచన – రావికొండలరావులాటి సినిమా నటులు పాల్గొన్నారు దర్శకత్వం ముంజులూరి భీమేశ్వర్రావు– ఇందులో ఉన్న అన్నమయ్య సంకీర్తన బాగుంది– బ్రహ్మ కడిగిన పాదముగదా?

అన్నమాచార్యుల వారి వంశీకుడైన రఘునాధుడుకి అమెరికాలో కోట్లు సంపాదించినా తన జన్మభూమీ తన దైవం వెంకన్న – తన తల్లీ తపస్సంపన్నుడైన తాతగారూ తోబుట్టువూ బావగారూ – ఎప్పుడూ జ్ఞాపకం వస్తారు. పాత్రల పరిచయం బాగుంది. కథ డైలాగులు బాగున్నాయి. అమెరికా ఇండియాల మధ్య ఉన్న జీవిత భేదం అన్నీ బాగున్నాయ్. కథా రచన ఎక్సలెంట్. రఘునాధ్ అన్నమయ్య వంశీకుడవటంతో కథకి కళవచ్చింది. 

"జౌర్ భీ హై రాస్తే"లో ఒక దృశ్యం



'ఉత్తరాలు' శీర్షికకి
రాసే వారు
తమపేరు, పూర్తి చిరునామా
తెలుగు లిపిలో రాయాలని
మనవి చేస్తున్నాము.
—సంపాదకుడు.



# వారఫలం

## 27-11-1987 శుక్రవారం మొదలు 3-12-1987 గురువారం వరకు

★ మేషం: మీకు ప్రసిద్ధుల సహాయం లబ్ధమవుతుంది. ఆశించినంత ధనం లభిస్తుంది. కృషియందు రాణింపు చెప్పదగిన అంశం. స్థితియందు పెంపు చేకూరుతుంది. స్త్రీలకు : సుఖసంపదలు, ఆనందం, ఆరోగ్యాభివృద్ధి.

★ వృషభం: ఈ వారాంతాన ఈ రాశి జాతకులకు శుభప్రదం. రాజకీయాలందు పరిచయం గల వారికి అనుకూల సమయం. శుక్రగ్రహానుకూలత వలన శుభకార్య ప్రస్తావనలుంటాయి. స్త్రీలకు : అన్ని రంగాలలో సదవకాశాలున్నాయి. గమనించండి.

★ మిధునం: ప్రసిద్ధులైన వారి స్నేహం లభిస్తుంది. ఆశించిన వ్యక్తుల సమాగమం రాజకీయంగా అనుకూలం. ప్రయాణాల మూలంగా లాభదాయకం గాదు. చిత్ర విచిత్ర విశిష్ట వస్తువులు సేకరించుకోగలరు. స్త్రీలకు : ఉద్యోగానుకూలం. శుభకార్యాలోచనం. బంధు సమాగమం.

★ కర్కాటకం: ఆదాయమున్నది. మిత్రులో బంధువులో యింటికి రాగలరు. చిత్ర విచిత్ర వస్తు సేకరణకు అనుకూలం. అనవసరంగా ధనం వ్యయించే సమయం. గ్రహించి మెలగటం శ్రేయస్కరం. స్త్రీలకు : బంధు సమాగమం. ఆశించిన విధానాన అనుకూలత చేకూరుతుంది.

★ సింహం: అఖండ యోగదాయకమయిన సమయం. వారమంతా విజయప్రదం. కళా సాహిత్య రంగాలందు ప్రావీణ్యం గలవారికి శుభదాయకం. రాజకీయ నాయకులకు అనుకూల సమయం. ఆటల్లో పాటల్లో ప్రావీణ్యం గల వారికి అనుకూలం. స్త్రీలకు : కొందరకు విదేశ ప్రయాణం, మరి కొందరకు వృత్తియందు అనుకూలం.

★ కన్య: 'కన్య'లో జన్మించిన వారికి గ్రహానుకూల సమయం. గురు గ్రహానుకూలతగల సమయం. ప్రసిద్ధుల సాహచర్యం లభిస్తుంది. వృత్తియందు అనుకూలమున్నది. ఆదాయమున్నది. వ్యాపారం ప్రారంభించా లనుకొన్నారా? మేలే. నూతనోద్యోగ యత్నాలకు అనుకూల సమయం. స్త్రీలకు : ఇంట శుభ ప్రశంసలు, వస్తు సేరణకు అవకాశం. బంధు సమాగమం.

★ తుల: మీ వలన మేలు పొందిన వారు, తిరిగి చూడరు. మీ వ్యవహారాలలో జోక్యం చేసుకొని మేలు పొందండి. మీకు కోర్టు సంబంధమయిన వ్యవహారాలున్నాయా. ఉంటే వారాంతంలో అనుకూలమే. రాజకీయాలందు మేలు గాదు. స్త్రీలకు : అధిక ఆదరణ, ఉద్యోగరీత్యా అనుకూలం. స్వల్పాదాయం.

★ వృశ్చికం: దూర ప్రాంతాలకు వెళ్ళటం మానటం న్యాయం ఏదో లాభం గడింపనున్నారు. వృత్తియందు అలక్ష్యం చేయటం ఏమాత్రం తగదు. సభా మర్యాదకు ఆస్కారమున్నది. పత్రికా ప్రశంసకు అనుకూలం. బంధు ద్వేషం రావచ్చు. గమనించండి. స్త్రీలకు : అనుకూల వార్తాశ్రవణం. ప్రచారంగాన మేలున్నది.

★ ధనుస్సు: వస్తు వాహన సేకరణకు అనుకూలం. సాంఘిక సేవా పరాయణత్వానికి అనుకూల సమయం. వృత్తిరీత్యా సర్వానుకూలం సమయం. వృత్తి, ఉద్యోగాలందు ఆశించిన ఫలితం లభ్యమవుతుంది. ఇది మేలా? అని ఒకానొక వ్యవహారాన వెనుక ముందుకు వెళ్ళుట మానండి. స్త్రీలకు : వారాంతం మేలు. వస్తు సేకరణకు అవకాశం.

★ మకరం: స్థితియందు అనుకూలం. మాటకు విలువ యున్నది. బంధు ప్రీతికి ఆస్కారం. వ్యాపారమందు అనుకూలత యున్నది. మీది 'జాయింటు' వ్యాపారమయితే లాభిస్తుంది. వస్తు వాహన సేకరణకు మేలైన వారం. స్త్రీలకు : అభివృద్ధికరమయిన సమయం. సభా గౌరవం కొందరకు, పత్రికాగౌరవం కొందరకు లభిస్తుంది.

★ కుంభం: ప్రయాణం చేయనున్నారా మేలైన సమయం. కళారంగ ప్రీతిగల వారా? యత్నిస్తే మేలే. చలనచిత్ర రంగ ప్రసిద్ధి గల వారా? యత్నిస్తే అనుకూలమే. ధన వసతికి ఆస్కారమున్నది. స్త్రీలకు : శుభ ప్రస్తావనలుంటాయి. కుటుంబానందానికి లోటు లేదు.

★ మీనం: స్థిగతులందు చెప్పదగిన మార్పులున్నాయి. లభ్యంకాని 'ప్రమోషన్'కు ఆస్కారమైన వారం. రాజకీయ నాయకుల వలన మేలు చేకూరుతుంది. యత్నించండి. ఆదాయానికి ఎలాంటి లోటు లేదు. అభిమానించే వారున్నారు. గమనించండి. స్త్రీలకు : రచయితలకు, పత్రికా రంగాన ప్రసిద్ధి గల వారికి మేలు. ప్రయాణానుకూలం, గమనించండి.

విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# మన సంస్కారాలు ఓం విశేషాలు

## ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రి

(గత సంచిక తరువాయి)

–ధర్మ రహితమైన కామోద్రేకం అనర్థావహం–

ఇట్టి కామం స్వేచ్ఛా ప్రవృత్తితో ప్రాబల్యం వహించి ఎప్పుడైతే ధర్మపురుషార్థాన్ని "త్రోసి రాజు" చేస్తుందో అప్పుడు అట్టి ప్రబల కామం మానవుని పతనానికి వినాశానికి ప్రత్యేక కారణ మౌ తుంది రావణాసురుడు, కీచకుడు, దుర్యోధనుడు వంటి వారు ధర్మ రహితమైన అర్థానికి, కామోద్రేకానికి పూర్తిగా లొంగిపోవడం చేతనే వారిని మృత్యుదేవత యవ్వన దశలోనే వరించింది కదా! అంటే వారి కామం పూర్తిగా ధర్మరహితం కావడమే వారి వినాశానికి మూలమయిందన్నమాట ఈ సత్యాన్ని రుజువు పరచే లోక నిదర్శనమిది మండోదరి తన భర్త యగు రావణాసురుని నాశనం విని ఇలా విలపిస్తుంది

ఇంద్రియాణి పురాజిత్వాజితం త్రిభువనం త్వయా!
స్మర ద్భిరివత ద్వైర మింద్రియైరేవ నిర్జితః!!
(వాల్మీకి రామాయణం యుద్ధ కాండ)

ఓ పతిదేవా! నీవు నీ ఇంద్రియాలను నీ స్వాధీనంలో ఉంచుకొని నీ కామ పురుషార్థాన్ని ధర్మపూర్వకముగా నడిపించినంత కాలము నీకు ముల్లోకములను జయించడమనే అద్భుత కార్య సాధనం సాధ్యమయింది

ఇక నీవు కామోద్రేకానికి వశుడవై ధర్మ మార్గాన్ని విడిచి పెట్టి సీతా సాధ్విని ఎప్పుడు అపహరించినావో ఆ సమయమే నీ నాశక్రియకు నాంది అయింది నీ నాశన క్రియకై పొంచి ఉన్నట్లున్ననీ ఇంద్రియాల చేతనే నాథా! నీవు జయించబడి నడివయస్సులోనే నాశం పొందితివా? అని మండోదరి మీది శ్లోకం ద్వారా విలపిస్తుంది ఇది త్రికాలా బాధ్యమైన, అనగా భూత వర్తమాన భవిష్యత్కాలాలలో మార్పు లేని సత్యమని ఈ గీతా సూక్త్యర్థం ఇలా చాటుతుంది తన ఇంద్రియాలను జయించ లేని వానికి, వాని మనస్సుతో కూడిన వాని ఇంద్రియాలే ప్రబల శత్రువు లౌతాయి స్వాధీనం చేసికొన్న వాని యింద్రియాలే వానికి బంధువుల వంటి వౌతాయి

బంధురాత్మా త్మన స్తస్యయే నాత్మై వాత్మ నాజితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్
(భగవద్గీత) 6–6)

కనుక సృష్టికి మూలమైన 'పవిత్ర ప్రేమ', కామోద్రేక రూపంలో ధర్మ రహితము దూషితము కాకూడదనీ, అట్టి దూషిత కామం సృష్టి వికాసానికి కాక సృష్టి వినాశానికే విశిష్ట కారణ మౌ తుందనీ మీది చర్చ ద్వారా ఋజువయింది

–ధర్మ సహితమైన కామం –

కనుక, కామపురుషార్థం ధర్మ పురుషార్థంతో కలిసి దాని అడుగు జాడల్లో ప్రవర్తించి నప్పుడే ధర్మ సమలంకృత మైన అట్టి కామం మానవుల దైనందిన జీవితానికది మంగళదాయక మౌ తుంది. అంటే ధర్మ సహితమైన కామం వలన మానవులకు వివిధమైన అనర్థం పుట్టదన్నమాట అట్టి ధర్మ మూలక కామం వలన జనించిన ప్రేమ స్త్రీ పురుషుల అన్యోన్యాను రాగానికి మూల మౌ తూ ఎట్టి క్లిష్ట పరిస్థితుల లోనూ అట్టిది చెక్కు చెదరకుండా ఉంటుంది దీనికి ముఖ్య నిదర్శనం సీతారాముల ప్రేమ! వీరి ప్రేమకు మూలమైన వీరి కామం వీరి స్వధర్మానికి విధేయమై ఉంది ఎట్లనగా, 'ప్రజానురంజనం' అనేది రాజు యొక్క ముఖ్య ధర్మం ఈ ధర్మాన్ని శ్రీరామచంద్రుడు ఎట్టి పరిస్థితిలో నూ విడిచి పెట్ట లేదు

అసలు 'ప్రజారంజనం' అనే స్వీయ ధర్మ సంరక్షణ కోసమే శ్రీరాముడు ప్రాణాధిక మైన తన సీతాదేవిని అడవిలోనికి పంపేశాడు, పతియొక్క పవిత్ర ప్రేమలోని తత్వాన్ని తెలుసుకున్నది కనుకనే ఆ సాధ్వీమతల్లి అడవుల పాలు చేయబడి ఉండి కూడా భర్తకు లక్ష్మణుని ద్వారా ఇలా వార్త నంపుతుంది "తిరిగి నా అరణ్య వాసానికి నా కర్మే కారణం కాని శ్రీరామచంద్రుడు కారణం కాదు, కనుక తనకై దుఃఖించక శ్రీరామ చక్రవర్తి, ప్రజారంజన రూప స్వధర్మాన్ని నిర్విఘ్నంగా కొనసాగించ వలెను" అని సీతా దేవి తన మాటగా తన ప్రాణేశ్వరునికి విన్న వించమని లక్ష్మణుని వేడుకొంటుంది

దీనిని బట్టి, అడవులలో విడిచి పెట్ట బడిన సీతాదేవి యొక్క పవిత్ర పతిప్రేమ, కారడవుల పాలు చేయ బడినప్పుడు కూడా చెక్కు చెదరలేదన్న మాట దీనికి ముఖ్య కారణం – సీతాదేవి యొక్క కామం, "పాతివ్రత్యం" అనే ఆమె ధర్మానికి వశమై ఉండడమే ఇట్లే అడవులలో సీతను దిగవిడిచి నప్పుడు కూడా ఆ సీతకై శ్రీరాముడు విలపించడం చేత, అట్టి విషమ సన్నివేశంలో కూడా శ్రీరాముని పత్నీ ప్రేమ ప్రవృద్ధమే అయింది దీనికి కారణం, శ్రీరాముని కామం 'ప్రజా రంజనం' అనే రాజ ధర్మానికి వశమై ఉంది ఇట్లు భార్యా భర్తల కామం వారి వారి ధర్మాలకు అదీనమై, ధర్మం యొక్క అడుగు జాడల్లో నడచుకొనడం చేతనే ఆ ఆదర్శ దంపతుల పవిత్ర ప్రేమను ఏ విషమ కర సన్నివేశమూ చలింప చేయలేక పోయింది లౌకిక ప్రపంచంలోని దంపతుల యొక్క కామం కూడా సీతా రాముల కామం వలె వారి ధర్మాలకు వశమై ఆదర్శాన్ని అనుసరించి ప్రవర్తించిన నాడు అట్టి దంపతులకు అట్టి ధర్మయుత కామం శ్రేయస్కరమే ఔతుందనడంలో సందేహం లేదు కనుక ఇది నిత్య సత్యమే అనాలి

మీద తెలిపిన విధంగా "కామ పురుషార్థం యొక్క స్వరూప స్వభావాలను వేలాది సంవత్సరాలకు పూర్వమే పూర్తిగా తెలుసుకొన్న మన మహర్షులు ఆ కామాన్ని పూర్తిగా నిరోధించనూ లేదు, ఆ ప్రబల కామ వేగానికి మానవుణ్ణి దాసునిగా చేయనూ లేదు ఇక ఆ మహనీయులు సర్వ విధ విషమ సమస్యలకు పరిష్కార మార్గంగా ఉండేటట్లు మధ్యే మార్గంగా 'కామాన్ని' ధర్మ బద్ధం చేశారు దీనితో ప్రబల కామం యొక్క విషమయ విశృంఖలత్వ వేగం అంతా విలుప్తమై ఆ కామం సంఘ శ్రేయస్సు సాధనకు సమర్థమైన చక్కని సాధనంగా తయారయింది శుద్ధి చేయబడిన నాభి కూడా అందరకు ఆరోగ్య ప్రదమౌ తుందికదా!

ఇట్లు నియమ రహితా త్మైన మానవుల కామోద్రేక రూప ప్రళయం కరనదీ ప్రవాహాలు భారతీయుల ప్రవిమల పవిత్ర ప్రేమ సాగరంలో సంగమించి అవి పవిత్ర ప్రణయ భావ రూప పరిణతితో పరిపూర్ణతను, లోక క్షేమం కళత్వమును పొంద వలెననియే మన మహర్షుల పవిత్ర ధ్యేయమై ఉన్నట్లు ప్రస్ఫుట మయింది ఇట్టి ధ్యేయంతో మన వారు భారతీయుల వివాహాంగ సంస్కారాన్ని జగన్మంగళ్య కరంగా మలచినారు ఇట్టి సంస్కార నిర్వహణ వలన స్త్రీ పురుషులకు పూర్ణ జీవిత వికాసము, వంశాభివృద్ధి, సౌందర్య శ్రేయస్సు, ఆధ్యాత్మిక పరిణతి, మోక్ష ప్రాప్తి అనే మహోత్కృష్ట ప్రయోజనాలు సహజంగా సిద్ధించును!

సంస్కారాలన్నింటిలో అత్యంత ముఖ్యమైన "గర్భాదాన సంస్కారం కూడా వివాహ సంస్కారం ముగిసిన అనంతరం చేసే వివాహ సంస్కారం యొక్క ప్రతీకాత్మక ప్రధాన ప్రయోజనాలు ప్రకాశితము లౌ తున్నాయి (ఇంకా ఉంది)






## డాక్టర్ దాశరథి కన్నుమూత :

విఖ్యాత కవి, నిజాం ప్రజోద్యమ వీరుడు రాష్ట్ర ప్రభుత్వాస్థాన కవి మిత్రుడు డాక్టర్ దాశరథి కృష్ణమాచార్యులు నవంబర్ 5 వ తేదీ పగలు 11–30 గంటలకు హైదర్‌గూడలోని మాతృశ్రీ భవనసౌధంలోని స్వగృహంలో కాలధర్మం చెందాడు. నెల క్రితం గుండెపోటు రాగా నెలపాటు ఆస్పత్రిలో చికిత్స పొందాడు. కోలుకొన్నాడు. అంతకు నెల క్రితం అతడు మరణించినట్లు వ్యాపించిన వదంతి విని ఇంటికి వెళ్లాను. ఒక్క నవ్వు నవ్వాడు. ఈ వదంతితో మీ పీడ విరుగడైంది – అన్నాను. మరొక మందహాసం చేసి గురూగారూ, మన చేతిలో ఏముంది? – అన్నాడు, ఆ సందర్భంలోనే నా దగ్గరి వా మనువును ప్రస్తావించాను ఆయన కుమారునికి. గోత్రం ఏమిటన్నాడు. శ్రీవత్స గోత్ర మన్నాడు. మాదీ శ్రీవత్స గోత్రం. ఎన్నో తరాలు గడిచినా సగోత్ర వివాహం నాకు అంతగా నచ్చదు – అన్నాడు. నేనూ ఆ అభిప్రాయం వాడినే. కనుక ఊరుకున్నాను. దాశరథి మూర్తి చిన్నదైనా స్ఫూర్తి కీర్తి దొడ్డవి. మృత్యువుకు ఫాటితో ఏమి పని? తీవ్రమైన గుండెపోటు రూపంలో ప్రత్యక్షమైంద. నవంబర్ 5 వ తేదీ ఉదయం అల్పాహారం తర్వాత స్నానాల గదికి వెళ్లాడు. అక్కడే తీవ్రమైన గుండెపోటుకు గురి అయ్యాడు. కుప్పగా కూలిపోయాడు. అదే చివరి దశ. ఈయనకు భార్య, ఒక కుమారుడు, ఒక కుమార్తె ఉన్నారు. దాశరథి వరంగల్లు జిల్లా గూడూరులో జన్మించాడు. తండ్రి పేరు శ్రీమాన్ వెంకటాచార్యులు, తల్లి పేరు శ్రీమతి వెంకటమ్మ చిన్ననాడు సంస్కృతాంధ్రాలు తండ్రి వద్ద, పాఠశాలల్లో ఉరుదూ ఫార్సీలు చదివాడు. చిన్నతనంలోనే గ్రంథాలయోద్యమం వంటి ప్రజోద్యమాలలో పాల్గొన్నాడు. శ్రీ బూర్గుల రామకృష్ణారావు వంటి ప్రజా నాయకులకు సన్నిహితుడయ్యాడు. నిజాం ప్రజోద్యమంలో జాగీర్దారీ ప్రతికూలోద్యమంలో పాల్గొని నిజాం రాష్ట్రంలోని పలు కారాగారాలలో బాధలు పడ్డాడు. ఆకాశవాణిలో చేరి మద్రాసు, హైదరాబాదు కేంద్రాలలో పని చేశాడు. ఆ సమయంలోనే పెక్కు రేడియో నాటికలు రచించాడు. శబ్ద శక్తిని ఎరిగిన వాడు గనక 'ఎవతె అడుగుజాడులు భువికి గొడుగు నీడలు' వంటి చిన్న పదాలతో గొప్ప రచనలు చేశాడు. గాలిబ్, ఇక్బాల్ మున్నగు వారి గజళ్లను అనువదించాడు. గాలిబ్ అనువాదానికి 1965 లో రాష్ట్ర ప్రభుత్వపు ఉత్తమానువాద బహుమతి లభించింది. ఈయన "తిమిరంతో సమరం" కవితా సంకలనానికి 1974 లో కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి లభించింది. ఈ తిమిరం వివిధ రీతుల అజ్ఞాన తిమిరం. కవితా పుష్పకమనే కవితా సంపుటికి 1967 లో రాష్ట్ర సాహిత్య అకాడెమీ అవార్డు లభించింది. ఆంధ్ర విశ్వవిద్యాలయం ఇతనిని కళా ప్రపూర్ణ బిరుదంతోను, ఆగ్ర, శ్రీవేంకటేశ్వర విశ్వ విద్యాలయాలు డాక్టర్ ఆఫ్ లిటరేచర్ బిరుదంతోను సత్కరించాయి. దాశరథి చలన చిత్రాలకు రెండు వేలకు పైగా పాటలు వ్రాశాడు. శ్రీ జలగం వెంగళరావు ముఖ్యమంత్రిగా వున్నప్పుడు విశ్వనాథ సత్యనారాయణ గారి అనంతరం ఆస్థానకవిగా నియమితుడయాడు. ఇవన్నీ పొందడం గొప్ప అని నేను భావించను. ప్రజాకవిగా, ప్రజోద్యమ కవిగా వెలుగొందాడనేదే గొప్ప అని భావిస్తాను. యాడికెళ్లి అచ్చిండు ఈ పోరగాడు? గట్లా పదాలు సదువుతుండు పెద్దోండ్ల నడుంగ్ల! పిట్ట సిన్నదైనా కూత ఘనవే! – అన్నారు ప్రేక్షకులు 1940 నాటి ఖమ్మం మెట్టు గ్రంథాలయ మహాసభలో గిజిగాడులా గొంతెత్తిన శ్రీ దాశరథి కృష్ణమాచార్యులను చూచి, అప్పటికి ఈయనకు పట్టుమని పదమూడేళ్లయినా నిండలేదు. మరి మూడేళ్లకు ఓరుగల్లు కోటలో ఆంధ్ర సారస్వత పరిషత్సభలు జరిగాయి. దుండగులు సభామంటపం తగుల బెట్టారు. ఆ తగులబడిన మంటపం క్రిందే మొండిగా సభలు జరిగాయి. అప్పుడు విచ్చింది దాశరథి గొంతు.

"ఓ పరాధీనమానవా ఓ పరాని
దాస్యము విదల్చకొని శాంతమ్ము మాని
తలుపులను ముష్టిబంధాన కలచి వేసి
చొచ్చుకొని పొమ్ము స్వాతంత్ర్య సురపురమ్ము."

అంటూ అది కోటిన్నర నోటి మాటగా, కోటి రత్నాల వీణాలాపంగా వినిపించింది. దాశరథి సంస్కృతికి పునాది పలువురు నవకవుల కున్నట్లు పాశ్చాత్య విప్లవ సాహిత్యం కాదు – వల్లె వేసిన సంస్కృతాంధ్ర కావ్యాలు. కనుకనే చిన్ననాటి కవితలో దీర్ఘాతి దీర్ఘ సమాసాలపై సరదా, మాటల మల్ల యుద్ధమూ కనిపిస్తాయి. 'ఇంతలో గాలిబ్ మీర్, ఇక్బాల్ వంటి ఉరుదూ కవుల వెలుగు జిలుగు ప్రసరించగా, ఈయన పాత ధోరణిపై తిరుగబడి" చాలీచాలని రజాయిని కప్పుక కన్నుమూసి, నిద్రలు వడబోసి, స్వప్నములు త్రావి, ప్రియాధర మారగించి, ఆకలి దిగబెట్టి ... జగత్తును మొత్తము మెత్త కిందనే నలిపి చెలీచెలీ యనుచు నాలుక దప్పి గొన" జపించినాడు, దుర్గతికయిమందు మానవులకై కవితా మదిరాను పానమే అతులిత 'మోహనౌషధము" అంటూ వారి ఆరోగ్యం కోసం తను 'సాకీ' చేతుల్లో తల వాల్చాడు. జాగీర్దారీ ప్రతికూలోద్యమ ప్రభావం ప్రసరించకపోయి వుంటే ఈయనకు ఈ మత్తు వదిలేది కాదు. పాశ్చాత్య విప్లవ సాహిత్యం అప్పుడె ఆకళించుకొన్నాడు. దాని పుణ్యమా అని.

"జనం మనం మనం జనం
జనం లేంది మనం లేదు"

అనే జ్ఞానం వుదయించి ప్రజలతో పాటు పోరాటంలోకి ఉరికాడు. "పీడిత ప్రజావాణి మైకి అమర్చి అభావాదులకున్ వినిపింప జేసెదన్" అని ప్రతిజ్ఞ చేశాడు. కారాగార వాస శిక్షలు అనుభవించాడు. ఆ సమయంలోనే.

"రానున్నది ఏది నిజం

'శోకతప్తులైన దాశరథి కుటుంబం



# మంగళ సౌభాగ్య చిహ్నం

# ఐటెక్స్

## మాట్ ఫినిష్ తిలకం




**ఐటెక్స్** 48 సంవత్సరములుగ మీ
నమ్మకానికి పాత్రమైన ఉన్నతమైన చిహ్నం

అరవింద్ లాబొరేటరీస్ మద్రాసు 600 033

# ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి కాలధర్మం



ప్రముఖ సాహితీ వేత్త, సంస్కృతాంధ్ర పండితులు శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి (77) నవంబరు 14 న వరంగల్‌లో కాలధర్మం చెందారు.

విశాఖపట్నం జిల్లా మాడుగుల గ్రామంలో శ్రీ శాస్త్రి జన్మించారు. రామచంద్రపురంలోను, కావలిలోను సంస్కృత భాషా పండితులుగా పని చేసారు.

బ్రహ్మసమాజం, నవ్యాంధ్ర సాహితీ సమాఖ్య అభ్యుదయ సాహితీ సమితులలో ఆయనకు సన్నిహిత సంబంధాలు ఉండేవి.

కవిత్వంతో పాటు ఆయన పాటలు, అనేక వ్యాసాలు, కథలు, నాటికలు, నృత్యరూపకాలు రాసారు.

ఆయన రచనలు అనేకం గ్రంధరూపం దాల్చాయి. కొంతకాలం పత్రికా సంపాదకత్వం నెరపి, హైస్కూలు పండితునిగా ఉంటూ నవ్యసాహిత్యంపై ప్రజల్లోను, విద్యార్థుల్లోను అభిరుచి కలుగ జేయడానికి శ్రమించిన సాహితీ కృషీవలుడీయన.

ఆయనకు భార్య, ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె ఉన్నారు. □

## హైదరాబాద్ నోట్‌బుక్

అధి ఒక్కటే సోషలిజం"

లాంటి నినాద కవిత్వం "తరతరాల దరిద్రాల బరువులతో పరువెత్తే నిరుపేదా!" దీన పరాధీన జాతి శ్రమికజాతి దెబ్బతిన్న బెబ్బులి వలె మేల్కొన్నది" లాంటి సెకెండ్ హాండ్ అనుకరణ కవిత్వం చెప్పాడు. "భూలోకమ్మున అగ్గిపెట్టి దను నిప్పుల్ వోసి, హేమంత భామా గాంధర్వ వివాహమాడెదను.... బలిష్ఠమైన నా నరాలతో మృత్యు కన్యకను పిండి కొట్టి పిల్లలు పెట్టించు కొందును" అని వెర్రి మొర్రి కేకలూ వేశాడు. ఆ ఉద్రేకం పరాకాష్ఠ అగ్నివీణ, రుద్రవీణ అనే కవితా సంకలనాలు. ఈ ఆవేగ ఝురీ వేగంలోనే కొట్టుకొనిపోయి వుంటే ఏ అజ్ఞాతావర్తంలోనో పడిపోయేవాడే. ఆ సుడిగుండం నుంచి తప్పుకొని వ్యక్తిత్వంతో నిలబడడానికి తరుణం వచ్చింది. దేశం స్వతంత్రమై రజాకార్లు విజృంభించారు. నిజాం రాజరికాన్ని రూపుమాపాలని, మూడు కోటులు నొక్కటే ముడి బిగించాలని నిజాం ప్రజలు, ఉద్విగ్నులయారు. ఆ కోటిస్వర ఉద్వేగాన్ని ఈయన

"పాటలుగా మాటలుగా....
ఎదల్లోన, పొదల్లోన,
గదుల్లోన సొదల్లోన
ఇదే మాట ఇదే మాట
పద పదే అనేస్తాను"

అని అనేశాడు. ఆ మాట "దిగిపోవోయ్, తెగిపోవోయ్!" అనేది. నిజాం గద్దెను గడగడ లాడించేది అది, గడగడలాడించింది కూడ. మహేంద్ర సౌభాగ్య గీతిని ముక్తకంఠంతో పాడాడు. మళ్లీ కారాగార క్లేశం పొందాడు. కారాగారాల్లో చెప్పిన పద్యాలు మంగలి పొదిలోని మడతలలో పెట్టి వెలుపలికి పంపేవాడు, పత్రికలు అచ్చు వేసేవి. వాటి సంపుటాలే మహేంద్రోదయం, అమృతాభిషేకం మొదలైనవి. బుద్ధగౌతముని పంచవింశ శతవార్షికోత్సవం వచ్చింది. దాశరథి ఛదంత జాతక కథను 'మహాబోధి' అనే లఘుకావ్యంగా కూర్చి షష్ఠ్యంతాలతో ప్రాచీన సంప్రదాయానుసారం అంకితమిచ్చాడు. ఈ విధంగా సజాతీయ విజాతీయ భావాల సంఘర్షణ పరీవాహంలో పడి, ఉవ్వెత్తున ఉప్పొంగిపోయి "బహు ఛ్ఛత్రధారి" అయి, ఏది వస్తే అది వ్రాయడం వెనకాముందూ చూడక సెలయేరు లాగ దూకడం, పాలకులను మన్మధాకారులని, మహావీరులనీ ప్రశంసించడం సహృదయులకు కొంత అసంతృప్తి కారణాలు కావడం నిజమే. కాని, ఈయన శబ్ద శక్తిని ఎరిగిన వాడూ, అది హృదయాన్ని కదిలించి కరిగిస్తుందని, కవితకు ప్రయోజనం అవసరమే కాని, ఆ ప్రయోజనం సౌందర్యా పకర్ష హేతువు కారాదని నమ్మినవాడూ, వ్యక్తిత్వం, మౌలికతో వెల్లి విరిసిన వాడూ గనుక ఏది చెప్పినా రంజకంగానే అయింది. ప్రజారంజకంగానే అయింది. దాశరథి ప్రజోద్యమంలో పూచిన కవితా కుసుమం, ప్రజోద్యమానికి వినియోగమైన కవితా కుసుమం. ప్రజానాయకుడు మిత్రుడు శ్రీ రావి నారాయణరెడ్డి అన్నట్టు నిజాం ప్రతికూల ప్రజోద్యమ చరిత్రలో ప్రజాకవిగా దాశరథి చిరస్మరణీయుడుగా ఉంటాడు. తాను సైతం ప్రపంచాగ్నికి సమిధను ధారపోసిన, తాను సైతం ప్రపంచబ్జపు తెల్ల రేకై పల్లవించిన, తాను సైతం ప్రజాశ్రేయస్సుకు కేక వేసిన డాక్టర్ దాశరథి కృష్ణమాచార్యులు వైష్ణవ సంప్రదాయం ప్రకారం అపునరా వృత్తి రహితమైన శాశ్వతలో కాలలోనే వుంటాడు. ఈ వీర కవికి నా నమోవాకాలు.

"జయంతి తే సుకృతి నః
ప్రజా లుద్ధాః కవీశ్వరాః"

– తిరుమల రామచంద్ర

ఇటీవల "కళా దర్బార్" రాజమండ్రివారు నిర్వహించిన అఖిల భారత నృత్య పోటీలలో నిజామాబాద్ "కళా భారతి" విద్యార్థిని కుమారి ఏ. హరిత (12) శాస్త్రీయ నృత్యం (దశావతారములు) జానపద నృత్యం (లంబాడీ)లలో రెండు ప్రథమ బహుమతులతో పాటు "బంగారు పతకం", "నాట్యబాల" బిరుదు పొందినది.



Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667



విజయ్ మర్చంట్

# "లేట్-కట్"లో అగ్రగామి
# విశ్వ క్రికెట్ రంగములో మేటి
# విజయ్ మర్చంట్

భారతీయ క్రికెట్ రంగంలో మరువరాని మహా వ్యక్తి విజయ్ మర్చంట్. మన క్రికెట్ వీరులలో ప్రపంచ అగ్రగామిలతో పోల్చవచ్చును. ఏ ఇతర క్రీడలలో లభించనటువంటి ఖ్యాతి క్రికెట్‌లో సాధించగలిగాము. మొదటి నుండి మన క్రికెట్ యోధులు గుర్తింపు, ప్రశంసలు పొందారు. 50 ఏళ్ళ క్రితం మన జట్టు మొదటిసారిగా 1932లో తెలుగు బిడ్డ సారథ్యంలో ఇంగ్లాదు వెళ్ళి ఒకే ఒక టెస్టు పోటీలో పాల్గొన్నది. ఆంధ్రుడు సి. కె. నాయుడు లార్డ్స్‌లో జూన్ 25,27,28 జరిగిన టెస్టు పోటీకి ఇండియా జట్టు కెప్టెన్ సి. కె. ప్రతిభను ఆంగ్లేయులు ఎంతగానో కొనియాడారు. మళ్ళీ సంవత్సరం ఇంగ్లాండు జట్టు మనదేశం వచ్చి మూడు టెస్టు పోటీలలో పాల్గొన్నది. రెండు పర్యటనలలో భారత జట్టులోని 21 ఏళ్ళ యువకుడు అందరిని ఆకర్షించాడు. తప్పక అగ్రగామి బ్యాట్స్‌మెన్ అవుతాడని అప్పుడే అనుకున్నారు. అతనే విశ్వవిఖ్యాతి పొందిన విజయ్ మర్చంట్.

విజయ్ మాధవజీ మర్చంట్ 1911 అక్టోబర్ 11న బొంబాయిలో జన్మించారు. మర్చంట్ పిన్న వయసు నుండి క్రికెట్ ఆటలో ఆసక్తి, నైపుణ్యం చూపించారు. ఆ రోజుల్లో ఇప్పటిలాగ క్రికెట్ అంతగా ప్రచారంలో లేదు. సామాన్యునికి అందని ఆట. ఆంగ్లేయులు, మహారాజులు, పెద్ద వ్యాపారస్తులు, ఉన్నత కుటుంబంలో వారు ఆడేవారు. మర్చంట్ బొంబాయి సిడన్‌హాం కళాశాల విద్యార్థిగా ఉండగా అత్యధిక పరుగులు, బౌలింగులో ప్రతిభ చూపారు. ఆ కాలంలో బొంబాయిలో "క్వాడ్రాంగ్యులర్" క్రికెట్ పోటీలు ప్రతిష్ఠాకర పోటీలుగా భావించబడేది. ఈ పోటీలలో హిందూవులు, మహమ్మదీయులు, పార్సీలు, యితరులు నాలుగు జట్లుగా ఆడేవారు. మర్చెంట్ విద్యార్థిగా యీ పోటీలలో పాల్గొన్నారు. ప్రతిభావంతంగా ఆడి మంచి ఆటగానిగా గుర్తింపు పొందారు. మర్చంట్ 'హిందూస్' జట్టులో ఆడారు. 26 యిన్నింగులలో 1965 పరుగులు అంటే సగటున 109.16 పరుగులు చేసారు. 1941-42లో 'రెస్ట్'

1946లో ఇంగ్లాండు జట్టుపై మాంచెస్టర్‌లో ఆడిన భారత జట్టు కెప్టెన్ పటౌడీ (సీనియర్), విజయ్‌మర్చంట్, తదితర ఆటగాళ్ళని చిత్రంలో చూడవచ్చు.



**గోల్ఫ్‌బంతి వేగం!**

ఆట ప్రారంభంలో గోల్ఫ్ ఆటగాడు బంతిని కొట్టినప్పుడు అది గంటకి 170 మైళ్ల (273 కి. మీ.) వేగంతో వెళ్తుంది.

**అతి పెద్ద పిచ్**

బంతి ఆటలలో ఉపయోగించే పిచ్‌లన్నిటిలోకీ పెద్దది పోలో ఆడేందుకు వాడేది. పోలో పిచ్ పొడవు 300 గజాలు. వెడల్పు 200 గజాలు (274మీ. x182మీ.)

**ఏడు బంగారు పతకాలు**

అమెరికా సంయుక్త రాష్ట్రాలకి చెందిన ఈతగాడు మార్క్ స్పిట్జ్ 1972 ఒలింపిక్ పోటీలలో 7 బంగారు పతకాలు గెలుచుకున్నాడు.

**అతి తక్కువ వ్యవధి టైటిల్ పోటీ**

1914లో న్యూయార్క్‌లో జరిగిన మిడిల్ వెయిట్ బాక్సింగ్ టైటిల్ పోటీలో ఆల్ మెకాయ్ తన ప్రత్యర్థి జార్జ్ ఛిప్‌ని 45 సెకండ్లలో ఓడించాడు. అతి తక్కువ సమయం జరిగిన పోటీ ఇంతవరకూ ఇదే.

# విజయ్ మర్చంట్

జట్టుతో ఆడిన పోటీలో 250 పరుగులు వీరి రికార్డు. అదే ఏడు ముస్లిమ్స్‌తో జరిగిన పోటీలో 243 నాట్ అవుట్, పార్శీస్‌తో ఆడిన పోటీలో 221 నాట్ అవుట్.

రంజీ ట్రోఫీ పోటీలలో బొంబాయి తరఫున దశాబ్దమునకు పైగా ఆడారు. 47 ఇన్నింగ్స్‌లలో మొత్తం 3639 పరుగులు చేసారు. 1943లో మహారాష్ట్రపై ఆడినప్పుడు 359 పరుగులు చేశారు. నాట్ అవుట్. ఆ రోజుల్లో ఇది రికార్డు. సంచలనం సృష్టించారు. ఆతర్వాత మూడు 'డబుల్ సెంచరీలు' చేసారు. 1944 'హోల్కార్' జట్టుపై ఆడినప్పుడు 278, వెస్టరన్ ఇండియాపై 217 పరుగులు, 1945లో సింధ్‌పై ఆడినప్పుడు 217 పరుగులు చేసారు. ఇతర జాతీయ పోటీలలో పాల్గొని 47 ఇన్నింగ్స్‌లలో 3639 పరుగులు చేశారు. 1938లో బొంబాయిలో బరోడాపై ఆడినప్పుడు 143, 1939లో సింధ్‌పై 120, 1940లో నావానగర్ జట్టుపై 140, 1944లో మహారాష్ట్రపై 109, 1945లో సింధ్‌పై 171, బరోడాపై 1946లో 121 పరుగుల సెంచరీలు సాధించారు. 1943లో మూడు ఇన్నింగులలో ఆడి 553 పరుగులు చేశారు. ఒకసారి మాత్రం అవుట్ అయారు. సగటు పరుగులు 276.50. 359 పరుగులు రికార్డు అప్పుడే నెలకొల్పారు.

మహారాష్ట్రతో జరిగిన పోటీలో ఎస్. మోడీతో కలిసి ఆరవ వికెట్టులో 371 పరుగులు చేశారు. అప్పుడే ఆర్. ఎస్. కూపర్‌తో కలిసి 210 పరుగులు చేశారు. మొత్తం 16 సెంచరీలకు పైగా సాధించారు. రంజీ ట్రోఫీ పోటీలలో మర్చెంట్ 98.35 సగటు పరుగులు రేటున చేశారు.

మర్చెంట్‌కి 21వ ఏట ప్రప్రథమంగా ఇంగ్లాండు పర్యటించిన మన దేశ జట్టులో ఆడే అవకాశం లభించినది. 1933లో డి. ఆర్. జార్డిన్ సారథ్యమున మన దేశం పర్యటించిన ఇంగ్లాండు జట్టుపై ఆడిన బొంబాయి, కలకత్తా, మద్రాసు మూడు టెస్టులలో విజయ్ ఆడారు. బొంబాయి, మద్రాసు టెస్టులలో ఇంగ్లాండు గెల్పు పొందింది. కలకత్తా టెస్టు 'డ్రా' అయినది. 1936లో రెండవసారి మన జట్టు ఇంగ్లాండు పర్యటనకు విజయ్ ఆనంద్ (విజ్జీ- విజయనగరం మహారాజా) సారథ్యమున వెళ్ళినప్పుడు మర్చెంటు పాల్గొన్నారు. ఆ జట్టులో మేటి ఆటగాళ్ళు సి. కె. నాయుడు (వైస్- కెప్టెన్), లాలా అమర్‌నాథ్, అమర్‌సింగ్, అమిర్ ఎలాహి, బెనర్జీ, జిలానీ, దిల్వార్ హుస్సేన్, యం. జె. గోపాలన్, ఎస్. ఎం. హాధీ (హైదరాబాద్) హిండ్లేకర్, జై. జహంగీర్‌ఖాన్, మెహర్‌హోంజీ, మహమ్మద్ హుస్సేన్, నిస్సార్, ముస్తాక్ అలీ, సి. ఎస్. నాయుడు, పతియా, సి. రామస్వామి, వజీర్ అలీ, కలరు. బ్రిటాన్- జోన్స్ మేనేజరు. లార్డ్స్, మాంచెస్టర్ ఓవల్‌లో మూడు టెస్టు పోటీలు జరిగాయి. మాంచెస్టర్ టెస్టులో మర్చెంట్ 114 పరుగులు అద్భుతంగా చేసి టెస్టు డ్రా అవటానికి తోడ్పడ్డారు. మర్చెంట్ - ముస్తాక్ అలీ పార్ట్‌నర్‌లుగా 203 పరుగులు మాంచెస్టర్‌లో చేసారు.

ఆ ఏడు ఉత్తమ ఆటగాళ్ళలో ఒకనిగా గుర్తింపు పొంది, 'విస్డన్' బహుమతి పొందాడు. అయిదు అడుగుల ఏడు అంగుళాల ఎత్తు కలిగి, సన్నగా ఉండే మర్చెంట్ ఎంతో నేర్పుగా ఆడేవారు. బౌలరుని తికమక పెట్టేవారు. ఫీల్డర్స్ బంతి ఎటు వచ్చేది తెలియక కంగారుపడేవారు. రెండవ ప్రపంచ యుద్ధ కారణంగా మర్చెంట్ దశాబ్ద కాలం టెస్టు పోటీలు, విదేశ పర్యటనలకు వెళ్ళే అవకాశము లభించలేదు. 1946లో సీనియర్ పటౌడీ కెప్టెన్‌గా ఇంగ్లాండు వెళ్ళిన మన దేశ జట్టునకు మర్చెంట్ వైస్- కెప్టెన్. జట్టులో అమర్‌నాథ్, బెనర్జీ, గుల్ మహమ్మద్, హజరే, హిండ్లేకర్, కర్దార్, మన్కాడ్, ఆర్. ఎస్. మోడీ, ముస్తాక్ అలీ, సి. ఎస్. నాయుడు, నింబాల్కర్, సర్వతే, సోహని, సింధీ కలరు. పంకజ్‌గుప్త మేనేజరు. ఇంగ్లాండు పర్యటనలో మన జట్టు మూడు టెస్టులలో ఆడినది. లార్డ్స్‌లో ఇంగ్లాండు గెలుపొందగా, మాంచెస్టర్, ఓవల్ టెస్టులు డ్రా అయ్యాయి. మర్చెంట్ ఓవల్ టెస్టులో 128 పరుగులు చేసి పోటీ 'డ్రా' అగుటకు కారకులు అయారు. ముస్తాక్ అలీ పార్ట్‌నర్‌గా 124 పరుగులు మాంచెస్టర్ టెస్టులో చేశారు.

1952లో మన దేశం పర్యటనకు వచ్చిన ఇంగ్లాండు జట్టుతో ఆఖరిసారి ఆడారు. ఆ తర్వాత 41 ఏట టెస్టు పోటీలలో పాల్గొనుట నుండి విరమించారు. ఢిల్లీలో జరిగిన మొదటి టెస్టు పోటీలో మర్చెంట్ 154 పరుగులు సాధించారు. టెస్టు పోటీ డ్రా అయినది.

లార్డ్ టెన్నిసన్ జట్టుతో ఆడిన పోటీలలో 1938లో అయిదు పోటీలలో పాల్గొన్నారు. ఆస్ట్రేలియన్ సర్వీసస్ ఎలవన్‌తో 1945లో మూడు పోటీలలో, మొదటి కామన్వెల్త్ జట్టుతో 1949లో రెండు పోటీలు, రెండవ పర్యటనలో 1950లో అయిదు పోటీలలో పాల్గొన్నారు. అధికార టెస్టులు 10 పోటీలలో పాల్గొన్నారు. రైట్ బ్యాట్స్‌మన్. 'లేట్ కట్'లో దిట్ట. యీ పద్ధతిలో ఆడిన వారు అరుదు. అనేకమంది ఔత్సాహిక క్రికెట్ ఆటగాళ్ళను తీర్చిదిద్దారు. జాతీయ క్రికెట్ సమాఖ్య సెలక్షన్ కమిటీలో ఉన్నారు.

76వ ఏట బొంబాయిలో అక్టోబర్ 27న 'భాటియా' ఆసుపత్రిలో ఉదయం 10-45 లకు గుండెపోటు వలన కన్నుమూసారు. భారతదేశమే గాక, యావత్తు క్రికెట్ ప్రపంచం వీరి మరణానికి విలపించింది.

\- ముకరమ్